

# శ్రీ సర్వధారినామ సంవత్సర

## సిద్ధాన్త పంచాఙ్గమ్

## 2008 - 2009

ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**




శ్రీరస్తు

శ్రీ వేంకటేశాయ నమః

# శ్రీ సర్వధారినామ సంవత్సర

## సిద్ధాన్త పంచాఙ్గమ్

## 2008 - 2009

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాన్తి

**శ్రీ తంగిరాల ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతిగారిచే విరచితము**

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన పణ్డితులు

**అప్పికట్ల శ్రీమాన్ పణ్డిత వేదాన్తం దేశికాచార్యులవారిచే పరిష్కృతము**

తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు

మహారాజ **శ్రీ కె.వి. రమణాచారి**, ఐ.ఎ.ఎస్., గారిచే ప్రకటింపబడినది.

తిరుపతి

**2008**



## శ్రీ వేంకటేశ భగవాన్

ఓమ్॥ మత్పాదౌ శరణం వ్రజేతి చరణౌ సంసారసిన్ధుస్తదా
జానుం సంస్పృశతీతి జానుమపి పాణిభ్యాం స్వయం దర్శయన్ ।
శేషాద్రౌ జగతోఽస్య రక్షణధియాఽతిష్ఠద్దయాసాగరః
సశ్రేయాంసి చతుర్భుజః కలయతాం శ్రీ శ్రీనివాసః ప్రభుః ॥

**కీ.శే. శ్రీమాన్ పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యః**

తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన విద్వాన్





**శ్రీ పద్మావతీ దేవి**

ఓమ్॥ ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థల నిత్యవాసరసికాం తత్క్షాంతి సంవర్ధినీమ్ ।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

పూర్వాచార్య!

## నిత్యధ్యాన శ్లోకములు

శ్రీ వేంకటేశ్వర స్తోత్రం : శ్లో॥ శ్రియఃకాన్తాయ కళ్యాణ । నిధయే నిధయేఽర్థినాం ।
శ్రీ వేంకట నివాసాయ । శ్రీనివాసాయ మంగళం ॥

శ్రీ సరస్వతీ స్తోత్రం : శ్లో॥ సరస్వతీ త్వియందృష్ట్వా । వీణాపుస్తకధారిణీ ।
హంసవాహన సంయుక్తా । విద్యాదానకరీమమ ॥

శ్రీ విఖనసాచార్య స్తోత్రం : శ్లో॥ శ్రౌతస్మార్తాదికం కర్మ । నిఖిలం యేన సూత్రితం ।
తస్మై సమస్త వేదార్థవిదే విఖనసే నమః ॥

శ్రీ గురు ప్రార్థన : శ్లో॥ నిత్యానందైక కందాయ । నిర్మలాయ చిదాత్మనే ।
జ్ఞానోత్తమాయ గురవే । సాక్షిణే బ్రహ్మణే నమః ॥

నవగ్రహ ప్రార్థన : శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ । మంగళాయ బుధాయచ ।
గురు శుక్ర శనిభ్యశ్చ । రాహవే కేతవే నమః ॥

సూర్యస్తవం : శ్లో॥ ఉదయే బ్రహ్మరూపశ్చ । మధ్యాహ్నేతు మహేశ్వరః ।
అస్తకాలే స్వయం విష్ణుః । త్రిమూర్తిశ్చ దివాకరః ॥

చంద్ర దర్శనం (నెలపొడుపు) : శ్లో॥ క్షీరసాగర సంపన్న । లక్ష్మీప్రియ సహోదర ।
హిరణ్య మకుటాన్ భాస్వత్ । బాలచంద్ర నమోస్తుతే ॥

నిద్రలేచునపుడు (భూ ప్రార్థన): శ్లో॥ సముద్ర వసనే దేవీ । పర్వతస్తన మండితే ।
విష్ణుపత్ని నమస్తుభ్యం । పాదస్పర్శం క్షమస్వమే ॥

పరాశర ప్రార్థన : శ్లో॥ ధర్మజ్ఞం ధార్మికం ధీరం । ధర్మాత్మానం దయానిధిం ।
ధర్మశాస్త్ర ప్రవక్తారం । పరాశరమునింభజే ॥

పరమ భాగవతోత్తములు : శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనక । భీష్మ దాల్భ్యాన్,
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్ పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి ॥

గోమాత ప్రార్థన : శ్లో॥ గావో మేమాతరస్సర్వా । గావోమే పితరస్సదా ।
గావో మమాగ్రతస్సంతు । గావోమే సంతుపృష్టతః ।
గావోమే పార్శ్వతస్సంతు । గవాంబృందేవసామ్యహం ॥

తులసీ ప్రార్థన : శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని । యన్మధ్యే సర్వదేవతాః ।
యదగ్రే సర్వ వేదాశ్చ । తులసీంత్వాం నమామ్యహమ్ ॥

అశ్వత్థ ప్రార్థన (రావిచెట్టు) : శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ । మధ్యతో విష్ణురూపిణే ।
అగ్రత శ్శివరూపాయ । వృక్షరాజాయతే నమః ॥

బిల్వవృక్ష ప్రార్థన (మారేడు) : శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం । త్రినేత్రంచ త్రియాయుషం ।
త్రిజన్మ పాపసంహారం । ఏకబిల్వం శివార్పణం ॥

సంధ్యా దీప ప్రార్థన : శ్లో॥ శుభం భవతు కల్యాణీ । ఆరోగ్యం ధనసంపదం ।
మమశత్రు వినాశాయ । సాయం జ్యోతిర్నమోస్తుతే ॥

కర దర్శనం : శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీః । కరమధ్యే సరస్వతీ ।
కరమూలే స్థితా గౌరీ । ప్రభాతే కరదర్శనం ॥

శ్రీయైనమః
శ్రీనివాసాయ నమః
శ్రీమద్భూసమహాగురుభ్యో నమః

# శ్రీ సర్వధారినామ సంవత్సర పంచాఙ్గ విషయసూచిక

[illegible]

[illegible]

# శ్రీ తిరుపతి (వేంకటాద్రి) నగర్యాః

విషువచ్ఛాయాంగుళాని 2-55
భూమధ్యాత్ దేశాంతరకాలః ఘ। 0-29 గం। + 0-12 ని।లు

అక్షాంశాః + 13.44
అయనాంశాః భా. 23-57.44
వార్షికాయన గతిః 0-0-54

## స్ఫుటలగ్న ప్రమాణ, పుష్కరకాలాః

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | ౪ - ౨౮ | ౩ - ౮ | సింహస్య | ౫ - ౧౦ | ౩-౩౮ | ధనుషః | ౫ - ౧౯ | ౩-౪౩ |
| | 1-47-12 | 1-15 | | 2-04 | 1-27 | | 2-7-36 | 1-29 |
| వృషభస్య | ౫ - ౦౪ | ౨-౨౨ | కన్యాయాః | ౫ - ౦౬ | ౨-౨౩ | మకరస్య | ౪ - ౪౪ | ౨-౧౩ |
| | 2-01-36 | 0-57 | | 2-02-24 | 0-57 | | 1-53-36 | 0-52 |
| మిథునస్య | ౫ - ౩౦ | ౪-౨౪ | తులాయాః | ౫ - ౧౮ | ౪-౧౪ | కుంభస్య | ౪ - ౧౪ | ౩-౨౨ |
| | 2-12 | 1-46 | | 2-07-12 | 1-42 | | 1-41-36 | 1-21 |
| కర్కాటకస్య | ౫ - ౨౮ | ౧-౧౬ | వృశ్చికస్య | ౫ - ౩౧ | ౧-౧౭ | మీనస్య | ౪ - ౮ | ౦-౫౮ |
| | 2-11-12 | 0-30 | | 2-12-24 | 0-53 | | 1-39-12 | 0-23 |

ఈ లగ్న ప్రమాణములు ఈ కాలమునకు తిరుపతికి చేయబడినవి. ఇవియే స్ఫుటలగ్న ప్రమాణములుగ గ్రహింపవలెను. తిరుపతి ప్రాంతంలోని అలవాటులో ఉన్న పాతలగ్న ప్రమాణములు ప్రాచీనకాలములో సాధించబడినందున పరిగ్రాహ్యములు గావు.

* * *

శ్లో।। సర్వజ్ఞః సకలామరార్చితపదస్సప్తాచలాధీశ్వరః
సర్వాభీష్ట ఫలప్రదాన నిపుణః శశ్వత్ప్రసన్నాననః ।
వేదాన్తైరనుమేయ సుందరవపు ర్మోహోభిగమ్యస్సదా,
కళ్యాణం భవతాం కరోతు భగవాన్ పద్మావతీ వల్లభః ।।

తా।। సర్వజ్ఞుఁడును సమస్త దేవతలచే పూజింపబడు పాదపద్మములు కలవాడును ఏడుకొండలకు అధిపతియు సమస్తములైన (అందఱి) కోరికలను నెరవేర్చుటయందు సమర్థుడును, చిఱునవ్వుతో విరాజిల్లు ముఖారవిందుడును, "ధ్యేయస్సదా" "ఆ ప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః" మొదలగు ఉపనిషద్వాక్యములచే నూహింపదగిన సుందరమైన దేహము కలవాఁడును, పుంసాం మోహనరూపుడు గావుననే ఎన్ని మాఱులు చూచినను తనివితీరని వాడును, పద్మావతీ వల్లభుండునైన శ్రీ శ్రీనివాస భగవానుడు మీకు మంగళములను అనుగ్రహింతురు గాక.

శ్రీమాన్ పణ్డిత వేదాన్తం దేశికాచార్యులు
తి.తి.దే. ఆస్థాన పణ్డితులు
అప్పికట్ల STD: 08643 ఫోన్ 270198
బాపట్ల మండలం - గుంటూరు జిల్లా.

శ్రీలక్ష్మీ వేంకటేశః ప్రసన్నో భవతు
శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణేనమః

## పీఠికారంభః

ఓమ్॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥
యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాఃపరశ్శతమ్ ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥
శ్రీమాన్ శ్రీ శేషపృథ్వీ ధరశిఖరపరిస్పందిపాదారవింద-
ద్వంద్వో మందీకృతేందుద్యుతిరుచిరుచిరస్వాన్తనస్సంత నోతు ॥
లక్ష్మీం లక్ష్మీ వియోగాసహ నిజహృదయఃకో పి ఒ కారుణ్యపూర్ణో
దేవాధీశఃప్రపుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదోనః ।
కందర్పకోటి సదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠ ముదారహారమ్ ।
పీతాంబరద్యుతి విరాజిత దివ్యదేహం శ్రీ వేంకటేశ వపురాత్మని సన్నిధత్తామ్ ॥
మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా ।
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే ॥
శ్రీ విష్ణుచిత్తకుల నందనకల్పవల్లీం శ్రీ రంగరాజహరిచందన యోగదృశ్యామ్ ।
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే ॥
విశదోర్ధ్వపుంద్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్ ।
కరపద్మవజ్రకలితత్రిదండకం కలయే యతీంద్రమహనీయవిగ్రహమ్ ॥
ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః ।
భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః ॥
సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః ।
ధైర్యం రాహుశ్చకీర్తిం సకలశుభ యుతాం కేతురిష్టార్థ సిద్ధిమ్ ॥
అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్ ।
వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః ॥
శ్రీ వేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్ ।
నమస్కృత్యహృషీకేశం యతిరాజం చ నిత్యశః ॥
సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః ।
దద్యుర్మనోరథం సర్వం దేవతాఃఫలముత్తమమ్ ॥
జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్ ।
చంద్రార్కౌతత్రసాక్షిత్వం భజేతేనిశ్చలంయతః ।

యథాశిఖామయూరాణాంనాగానాంమణయో యథా ।
తథా వేదాంగశాస్త్రాణాం జ్యౌతిషం మూర్ధ్ని సంస్థితమ్ ॥

శ్రీవత్స జన్మాఽఖిల సౌరతంత్ర సిద్ధాంత విజ్ఞానమతిర్హనూమాన్ ।
శ్రీ తంగిరాలాన్వయజోఽహ మార్య్యః శ్రీ శేషశైలేశ కృపావిశేషః ॥

సోయం యథామతి మతాని విమృశ్య విద్వదాచారరీతిమవిలంఘ్య గురూపదేశమ్ ।
శ్రీ వేంకటేశకృపయా వితనోమి సాంగం పంచాంగమత్ర విబుధాస్సదయా భవంతు ॥

**గురువందనమ్** : దైవజ్ఞ ప్రథమస్య పూర్ణ యశస్త్ర్యంబాలపూర్ణస్య యః
పుత్రశ్శ్రీ పిడపర్తి వంశజని సుబ్రహ్మణ్యశాస్త్రీ కృతీ ।
సూర్యార్యాది పురాతనాద్యతనసిద్ధాంతేషు గోలాదివి-
త్రిస్కంధాంబుధిపారగం మమ గురుం వందే సదాశ్రేయసే ॥

**దైవజ్ఞ ప్రశంసా, దైవజ్ఞ నివాసః :**

శ్రీ వేంకటేశాప్ప నృసింహతాట కేశాదిదేవై రభిరక్ష్యమాణమ్ ॥
గోదావరీ పశ్చిమయోజనాంత శ్రీ గోస్తనీతీర విరాజమానమ్ ॥
శ్రీ వేదవేదాంగ విదుత్తమైర్బుధైః జ్యోతిర్విదగ్రేసర పండితైశ్చ ॥
ఈదృశ్యైర్వదాన్యైరభిభూషితం చ చకాస్తి రేలంగిపురం సురమ్యమ్ ॥
యద్వంశే బహవశ్శృతిస్మృతివిధౌ సజ్జ్యోతిషే పండితాః।
శ్రీవత్సాభిధగోత్రజాస్త దనుమత్త్రైతామహోఽత్యంతధీః ॥
శ్రీమత్పండిత సార్వభౌమ హనుమాన్వేదార్థవిత్సాత్త్విక-
స్తత్తత్కర్మసుకాలనిర్ణయకృతే పంచాంగకర్తా పురా ।
తస్యాత్మజో వేంకటకృష్ణ సోమయాజీసుసిద్ధాన్తవిదగ్రగణ్యః
శ్రీరామభక్తః ప్రతివత్సరం సత్పంచాంగమత్యంతముదాఽకరోచ్చ
జ్యాయాన్ వేంకటహనుమాన్ ద్వితీయాకస్తు పూర్ణదైవజ్ఞః
తార్తీయోఽయంహనుమాన్ వేంకటకృష్ణాఖ్యదైవవిత్పుత్రాః
చత్వారస్తనూజాః హనుమత్సిద్ధాంతినః తృతీయస్తేషు
ప్రభాకరపూర్ణశర్మోఽయం శ్రీనివాసకరుణాకాంక్షీ
అసూర్యం చ్యవనోంగిరోఽత్రిముఖరానభ్యర్చమాన్యాన్మునీ
నాచార్యానపరాన్మయా సుమనసా శ్రీతాతపాదం గురుమ్
పంచాంగంసు విరచ్య వేంకటవిభోః పాదాబ్జయోరర్పితం
సచ్ఛ్రేయాంసి దయామయః కలయ తాం శ్రీ వేంకటేశః ప్రభుః ॥

**తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి**

***పంచాంగకర్త:***

**తి.తి.దే. ఆస్థానసిద్ధాంతి అగు కీ.శే. దైవజ్ఞశేఖర బ్రహ్మశ్రీ తంగిరాల చినహనుమత్సిద్ధాంతిగారి కుమారుడు**

**శ్రీ ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతి**

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి

(శ్రీ పూర్ణ జ్యోతిర్నిలయం)

రేలంగి, తణుకు తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లా (ఆంధ్ర). STD: 08819 ఫోన్: 237064.

శ్రీరస్తు  శుభమస్తు  అవిఘ్నమస్తు

# శ్రీ సర్వధారినామ సంవత్సర పంచాంగము

శ్లో॥ శ్రీ వేంకటాచలాధీశం శ్రియధ్యాసితవక్షసం ।
శ్రిత చేతన మందారం శ్రీనివాసమహంభజే ॥

శ్లో॥ శ్రీకళ్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం
గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదాన తుల్యంనృణాం ।
ఆయుర్వృద్ధిదముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం
నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతాం ॥

## అథ బ్రహ్మణః ఆయుః ప్రమాణాదికం

శ్రీమద్భగవద్దివ్యనాభికమల జాతస్య పరార్థద్వయజీవినః చతుర్ముఖ బ్రహ్మణః పరమాయుః వర్ష శతమేవ । తత్ప్రమాణ సౌరాబ్దాః 31104000 కోట్లయః । ద్వితీయ పరార్థే ప్రథమవాసరే గతఘటికాదయః ఘడి 17 విఘ 42 ప్రాణకాల (0) గుర్వక్షరోచ్చారకాలః 3 నిమేషః 19 లవత్రుటయః 3 సంప్రతి చతుర్థేత్రుటౌ గతసౌర మాసాదయః 2,14,27,32 ఇదానీం శ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాః షణ్మనవో గతాః, సప్తమే వైవస్వత మన్వంతరే 27 మహాయుగాని గతాని. అధునా 28 తమే మహాయుగే వర్తమానం కలియుగం వ్యవహ్రియతే.

"యుగంభవేత్ వత్సర పంచకేన యుగాని తు ద్వాదశ వర్ష షష్ట్యాం" అను ప్రమాణముచే ప్రభవాది 5 సంవత్సరములు ఒక యుగము చొప్పున (5x12=60) 12 యుగములుగా నగుచున్నవి. ఇట్లుగ కృష్ణయుజుర్వేద తైత్తిరీయ బ్రాహ్మణము 10 ప్ర॥ పాఠకము, 4వ అనువాకము చెప్పుచున్నది.

1 సంవత్సరోఽ సి, 2 పరివత్సరోఽ సి, 3 ఇదావత్సరోఽ సి, 4 ఇదువత్సరోఽ సి, 5 ఇద్వత్సరోఽ సి. ॥ ఇతి ॥ ఇందులకు విద్యారణ్య భాష్యము.

ప్రభవాదిషు షష్టి సంవత్సరేషు ఏకైకస్మింశ్చక్రమేణ సంవత్సర పరివత్సరాది శబ్దాః వర్తన్తే............................. ............................. హే అగ్నేత్వం సంవత్సరోసి ప్రభవాది రూపోసి, పరివత్సరోసి విభవ రూపోసి, ఇదావత్సరోసి శుక్లరూపోసి, ఇదువత్సరోసి - ప్రమోదరూపోసి, ఇద్వత్సరోసి - ప్రజాపతిరూపోసి, పంచస్వేతేషు అనుగతాకారః వత్సరః ఏతద్రూపోసి.

ఏవమంగిరశ్శ్రీముఖ భావ యుగాదిషు ఏకాదశసు పంచకేషు యోజయితవ్యం.

అనగా, ప్రభవాది అయిదు సంవత్సరములు, "1. సంవత్సరము, 2. పరివత్సరము, 3. ఇదావత్సరము, 4. ఇదువత్సరము, 5. ఇద్వత్సరము" అను నామములు కలవై యున్నవి. ఇటులనే ప్రతి అయిదు సంవత్సరములకు నామములు తెలియదగియున్నవి. ఇప్పుడు విష్ణు, దేవతాకమగు 5వ యుగమున (వర్తమానమున పంచవత్సరాత్మకమగు పంచమ యుగమున), 2వది అగు పరివత్సర నామముగల ఈ సర్వధారినామ సంవత్సరము సూర్య దేవతాకమైనందున యిందు యవదానము విశేషపుణ్య ఫలప్రదము.

దయాసముద్రుడగు శ్రీ వేంకటేశప్రభువు అన్నియును శుభప్రదములుగను, సుఖప్రదములుగను ఉండునట్లు అనుగ్రహింతురుగాక.

| | | | |
|---|---|---|---|
| **కలియుగాబ్దములు** | **5109** | **శ్రీ శంకరాచార్యాబ్దములు** | **2080** |
| **విక్రమార్క శకాబ్దములు** | **2065** | **శాలివాహన శకాబ్దములు** | **1930** |
| | **1428-29** | **శ్రీరామానుజాబ్దములు** | **991** |
| | **892** | **భారత స్వతంత్రాబ్దములు** | **61** |
| **ఆంధ్రరాష్ట్రావతరణాబ్దములు** | **52** | **ఇంగ్లీషు** | **2008-2009** |

## నవనాయక నిర్ణయము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రాజా | - | చంద్రః | సస్యాధిపతిః | - | బుధః | మేఘాధిపతిః | - | రవిః |
| మంత్రీ | - | రవిః | ధాన్యాధిపతిః | - | కుజః | రసాధిపతిః | - | శుక్రః |
| సేనాధిపతిః | - | రవిః | అర్ఘాధిపతిః | - | రవిః | నీరసాధిపతిః | - | బుధః |
| శుభులు 4 + పాపులు 5 = మొత్తం 9. | | | | | | | | |

## పురోహితాది ఉపనాయక నిర్ణయము

పురోహిత, గణక, పరీక్షకాది ఉపనాయక గ్రహములు శుభులు శుభఫలితములను, పాపులు పాప ఫలితములను ఇచ్చుదురు.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పురోహితుడు | - | బుధః | అశ్వాధిపతి | - | రవిః | రత్నాధిపతి | - | రవిః |
| పరీక్షకుడు | - | బుధః | గజాధిపతి | - | బుధః | వృక్షాధికారి | - | కుజః |
| గణకుడు | - | గురుః | పశువులకు అధిపతి | - | రవిః | జంగమాధిపతి | - | బుధః |
| గ్రామనాయకుడు | - | రవిః | దేవాధిపతి | - | బుధః | సర్పాధిపతి | - | గురుః |
| దైవజ్ఞుడు | - | శనిః | నరాధిపతి | - | రవిః | మృగాధిపతి | - | శనిః |
| రాష్ట్రాధిపతి | - | బుధః | గ్రామాధిపతి | - | బుధః | శుభాధిపతి | - | రవిః |
| సర్వదేశోద్యోగి | - | రవిః | వస్త్రాధిపతి | - | శుక్రః | స్త్రీలకధిపతి | - | రవిః |
| శుభులు 10 + పాపులు 11 = మొత్తం 21 | | | | | | | | |

## శ్రీ సర్వధారినామ సంవత్సర ఫలితము

అస్మిన్దేశే లోక వ్యవహారతః చాంద్రమాన వశాదయం 'సర్వధారి' నామ సం॥రః, బార్హస్పత్య మానేన (కాశీప్రాంతే) 'ప్లవ' నామ సం॥రః. గురూదయవశాదయం 'మార్గశీర్షాబ్దః', అని వ్యవహరింపబడును. ప్రభవాది 60 సం॥లలో పంచవత్సరాత్మకమగు పండ్రెండు యుగములలో ఇది 5వది "విష్ణు" దేవతాకము, అందు రెండవది "పరివత్సర" నామకమగు, ఈ "సర్వధారి" నామ సంవత్సరము సూర్యదేవతాకమైనది. ఇందు యవదానము మహాఫలం. అబ్దాధిపతి విష్ణువు, ఆశ్రయించిన లక్ష్మిని కటాక్షింప చేయును. జనులు దైవకార్యాచరణము కల్గి వుందురు. రాజులు యుద్ధాభిలాష కల్గివుందురు. అన్ని వర్ణముల వార్కి పురోభివృద్ధి.

నవనాయకులలో 4 గురు శుభులు. 5 గురు పాపులైరి. 21 మంది ఉపనాయకులలో 10 మంది శుభులు, 11 మంది పాపులు అయిరి. వర్షవాతావరణములను కూలములు. మెట్ట భూములు బాగుగ పండును. అపరముల పంటకు అవరోధములు. ఎరువు పంటలు ఫలించును.

వర్ష లగ్నము పరిశీలించగ వృషభము లగ్నాధిపతి లాభమందుచ్చస్థితి, మరియు రవి బుధ చంద్రులకు కలసి వుండుట విశేషము, భాగ్యరాజ్యాధిపతి శనికి అర్ధాష్టమస్థానము, సప్తమ వ్యయాధిపతి కుజునికి ద్వితీయస్థితి, అష్టమ లాభాధిపతి గురునికి అష్టమస్థితి - దోషము అయిననూ నైసర్గిక శుభగురునికి స్వక్షేత్రము గాన కాలమాన మార్పులు ఒడిదుడుకులు ఎన్ని వున్ననూ సౌభాగ్య, సంపదలను వృద్ధి చేయును. వ్యవసాయ వాణిజ్య రంగముల కవరోధములు, జలవాహన ప్రమాదములు, వార్తా ప్రసారసాధనములు సామాన్యం. వాణిజ్యం, క్రీడలు, విద్య అనుకూలత కాదు, పెచ్చు మీరును. రాజకీయ ప్రభావం వుంటుంది. స్త్రీ ప్రాబల్యత కల్గును. బ్యాంకు ఋణాలు అనుకూలము. జగల్లగ్నము తుల, పరిశీలించగ రాజ్యాధిపతి చంద్రుడు స్వక్షేత్రం - బుధ, శుక్రులకు షష్ఠస్థితి. గురునికి (పాపి) స్వక్షేత్రము. శనికి లాభస్థితి కల్గినది. బలపరీక్షలున్నా ప్రభుత్వం దృఢం. దేశమునకు పరదేశ సహాయం వుండును. అన్ని రంగాలలోను లాభములుంటూ దుర్వ్యయం హెచ్చు. సైనిక అలజడులు హెచ్చును. రాష్ట్రానికి లాభం

అధికంగా వున్ననూ దుర్వ్యయము. సంకరజాతివారు, ఆట వికులు, చోరులు నశింతురు. అనుకూల వర్షములు. మకర గురుని ప్రభావముచే తెలుపు వస్తువులకు, పంట, భూములకు మందము. సుగంధాలు, బంగారం మందములో హెచ్చును. ఉత్తర పశ్చిమ. ప్రాంతాలలో ఖండవృష్టి దక్షిణాన కరవు కాటకాలు.

జగల్లగ్నమున కధిపతి శుక్రుడు శత్రుక్షేత్రమయిననూ మీనమందు ఉచ్ఛస్థితి కల్గుట వలన ప్రస్తుత ప్రభుత్వమునకు బలపరీక్షా కాలము. రాబోవు సం॥రం నూతన (స్వకీయ) వర్గంవార్కి రాజకీయ బలం. శని సంచార ప్రభావముచే వ్యాపారస్తులకు యంత్ర, రియల్ ఎస్టేట్, రస, వస్తు విక్రయ వ్యాపారులకు వృద్ధి. సముద్ర తీర ప్రాంతీయులు మేల్కొనవలెను. వీరికై ప్రభుత్వము ముందుగ తగు చర్యగైకొనవలెను. ఈ సంవత్సరము కాల సర్పయోగము. మాలిక, గ్రహ కూటములు. ఆగస్టు 1, 16. 2009న జనవరి 26 లందు గ్రహణములు సంభవించుట వలన రైతాంగమునకు ధరవరలకు, ఆరోగ్యమునకు, జీవన సరళి యందు మార్పులు గోచరించును. భారతమున బ్రహ్మాండమైన శుక్ర మహాదశ ఉన్నందున జల, భూ, విద్యా ప్రాజెక్టులు యందు ప్రభుత్వం సమర్ధవంతముగ, ప్రజోపయోగముగ, జనాకర్షణగ నిర్వహించును. మతసంబంధ అలజడులధికము. ప్రజలకు సుఖము వుండును. రాబోవు సం॥రం నుండి ప్రభుత్వ గమనం స్త్రీలకంటే పురుష ప్రభావం అధికము. ఏదో ఒక దైవ క్షేత్రమున శత్రువుల అలజడి సూచించుటచే ప్రభుత్వం తగు చర్యలు చేపట్టుదురు. చైత్రం ధాన్యాదుల ధరసమము. ఉత్తరాదిన అరిష్టము. బంగారము, మణులు, పేపరు ధర అధికము. సస్యానుకూలం. వైశాఖం ధరలు అధికము. ప్రాజెక్టులు నిర్వహణ సమర్ధవంతము. అల్లర్లు అలజడులు. జ్యేష్ఠం కలహము. తూర్పు దక్షిణ ప్రాంతములు భయోత్పాతములు. సస్యములకు చీడపీడలు, షేర్లు వ్యత్యాసం. మతోన్మాదములు. జూన్ 10 ప్రాంతము ఒక విశేషం, ఆశ్చర్యం. ఆషాఢం స్వల్పవృష్టి, మేఘాడంబరం. పశ్చిమ ఆగ్నేయ దిశలందు ప్రాకృతిక బీభత్సములు, జలప్రవాహములు. శ్రావణం సైనిక చర్యలు అధికం. భూముల ధరలు తగ్గుదల. షేర్లు వ్యత్యాసం. ఖండవృష్టి, నదీప్రవాహములు అధికం. ఆహార పదార్థములు గిరాకీ. భాద్రపదం దక్షిణాది ప్రాంతం ప్రాకృతిక బీభత్సములు. దుర్భిక్షం, జలప్రవాహాలు. అశ్వయుజమున రోగారిష్టములు, సర్వధాన్యములు, కొబ్బరి గృహోపకరణములు ధరలు హెచ్చును. కార్తీకమున దక్షిణ పశ్చిమ ప్రాంతములందు అరిష్టములు. ధరలు హెచ్చును. నాయకులకు, ఉద్యోగులకు, అపశృతులు. మార్గశీర్షమున భూయుద్ధములు, ఉద్యోగులకు అలవెన్సులు, వైద్యసేవలు అధికము. పుష్యమున ఉత్తరాదిన అరిష్టములు అధికారిక దుర్వ్యయములు, మాఘమున శతృవృద్ధి, దైవకార్యాచరణములు, వ్యాపారములు, షేర్లు, వాతావరణములు సర్వదా వ్యతిరేకములు. మిత్ర, శతృత్వములు అధికం. మతధార్మిక సంస్థాగత విప్లవములు. పాల్గుణము దైవకార్యాచరణములు, నాయకులకు తీవ్ర వాగ్యుద్ధములు. ధరల పెరుగుదల యాంత్రిక వ్యాపార నిర్మాణములు.

| | | | |
|---|---|---|---|
| రచం బుచ | | ల | కు |
| రా | వర్ష లగ్నము | | |
| | | | శ కే |
| గు | | | |

| | | | |
|---|---|---|---|
| బు శు | ర | | కు |
| రా | జగ ల్లగ్నము | | చం |
| | | | శ కే |
| గు | | ల | |

మొత్తం మీద పరిశీలించగా మంత్రి, సైన్య, అర్ఘ, మేఘాధిపత్యములు 4 కూడా రవి గ్రహమునకు వచ్చుటచె రక్షక, సైనిక చర్యలు, మత, ధార్మిక సంస్థల పరముగ అలజడులు ప్రజలకు పీడనములు సామాన్య వర్షములు. సామాన్య పంటలు వుంటాయి. కుతంత్రములు వివాదములు అధికము. ప్రభుత్వమునకు ఎన్ని ఇక్కట్లు కలుగుచున్నను క్రియాశీలక వ్యవహారములు దక్షతగ ప్రజారంజకముగ నిర్వహించును. ఆలయముల పురోభివృద్ధి. దైవకార్యములు. యజ్ఞయాగ నిర్వహణములధికముగ వుండును. విద్యాసాంకేతిక రంగములభివృద్ధి చెందును.

కలియుగ ప్రత్యక్షదైవమగు శ్రీ వేంకటేశ్వరుడు శాంతి, రక్షణ, సన్మార్గములను కలిగింతురు గాక.

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శుభం భూయాత్

## చాంద్రమానాబ్ద ఫలము

శ్లో: [illegible]

ప్రశాంత వైరాస్సర్వత్ర బహు సస్యార్ఘ వృష్టయః.

శ్రీ సర్వధారినామ సంవత్సరమునందు సర్వత్ర సస్యములు బాగుగ ఫలించును. ధరలు వృద్ధిలో [illegible]. ప్రాకృతిక [illegible].

## బార్హస్పత్యమానాబ్ద ఫలము

శ్లో: [illegible]

పీడ్యంతే సతతం ఘోరైః ప్లవంగ్వే ప్లవగా జనాః.

[illegible] సస్యములు (పెరుపులు) బాగుగ ఫలించును. అధికారులయందు మైత్రికొనసాగును. ప్రాజెక్టులభివృద్ధి చెందును. [illegible] కల్లోలములు కలుగును. [illegible]

## [illegible]

శ్లో: వర్షహంతా వ్యాధికరో మిథో భేద భయావహః,

శలభావ్యాకులః సౌమ్యో దుర్భిక్షభయకారకః.

మార్గశీర్షాబ్దమైనందున నాస్తికులు ప్రబలుదురు. ప్రజాపీడలధికము, ధాన్యం ధరనిలబాటులో వృద్ధి కలుగును. సస్యాపదూల [illegible].

## కర్తరీ నిర్ణయము

ది 4-05-2008 చైత్ర బహుళ చతుర్దశి ఆదివారం డొల్లు కర్తరి ప్రారంభము.

ది 11-05-2008 వైశాఖ శుద్ధ సప్తమి ఆదివారం కృత్తికకార్తె, నిజకర్తరీ ప్రారంభము.

ది 28-05-2008 వైశాఖ బహుళ అష్టమి బుధవారం కర్తరీ త్యాగము.

## పుష్కర నిర్ణయము

ది. 09-12-2008 మార్గశిర శుద్ధ ద్వాదశీ మంగళవారం సా.6-24 ని॥లకు గురువు మకర రాశి ప్రవేశమైనందున తుంగభద్రానదికి పుష్కర ప్రారంభము. మంత్రాలయము, హంపి విజయనగరము, మెట్టూరు స్నానయోగ్యమైన పుణ్యక్షేత్రములు.

## సూర్య గ్రహణము (1-8-2008)

ఈ సంవత్సర ఆషాఢ బహుళ అమావాస్య శుక్రవారం (పాక్షికం 5/8) కేతుగ్రస్త సూర్యగ్రహణము సంభవించును. అస్తమానం సా.గం.6-38 సవ్యగ్రహణం ఉత్తరగోలము.

| | |
|---|---|
| పగటియందు స్పర్శ | గం. 4-30 సాయంత్రం |
| మధ్యకాలము | 5-14 |
| మోక్షకాలము | 6-04 |
| ఆద్యంత పుణ్యకాలము | 1-34 ని॥లు |

వాయవ్యదిశి స్పర్శ, కృష్ణతామ్రవర్ణం, ఉత్తరగోలము. ఈ గ్రహణము సాయంకాలము సంభవించుచున్నందున నిత్యభోజన ప్రత్యాబ్దికాదులు ఈ 1 తేదీ శుక్రవారం సాయంత్రం గ్రహణ మోక్షానంతరమే జరుపవలెను. ఈ గ్రహణము పుష్యమీ నక్షత్రమునందు సంభవించుచున్నందున ఈ నక్షత్రమువారు కర్కాటక రాశివారు గ్రహణమును చూడరాదు. మరుదినము శాంతి జరిపించుకొనవలెను.

## చంద్ర గ్రహణము (16-8-2008 రాత్రి)

ఈ సంవత్సర శ్రావణ పూర్ణిమ శనివారం చంద్రగ్రహణము సంభవించును. పాక్షికము, కేతుగ్రస్తము. పింగళవర్ణం, సవ్యగ్రహణము దక్షిణ గోలము, ఆగ్నేయదిశిస్పర్శ, నైఋతి మోక్షము.

| | |
|---|---|
| 16-8-2008 రాత్రి యందు స్పర్శ | గం. 1-05 ని॥లు |
| మధ్యకాలము | గం. 2-40 ని॥లు |
| మోక్షకాలము | గం. 4-14 ని॥లు |
| ఆద్యంత పుణ్యకాలము | గం. 3-09 ని॥లు |

ఈ గ్రహణము అర్ధరాత్రి తరువాత సంభవించుచున్నందున ఈ శనివారం పగటి యందు నిత్యభోజన, ప్రత్యాబ్దికాదులు యధాప్రకారము ఆచరించవలెను. ధనిష్ఠ నక్షత్రము నందు సంభవించుచున్నందున ఈ నక్షత్రమువారు, మకరరాశి. కుంభరాశివారు దీనిని చూడరాదు. 17 ఆదివారం ఉదయం గ్రహణశాంతి జరిపించుకొనవలెను.

## పునః సూర్య గ్రహణము (26-1-2009)



ఈ సం॥ర పుష్య బహుళ అమావాస్య సోమవారం చూడామణి నామక సూర్యగ్రహణము సంభవించును. రాహు గ్రస్తం. అల్పగ్రాసం, సవ్యగ్రహణం, దక్షిణగోలము.

26వ తేదీ పగటి యందు స్పర్శ గం. 2-46 ని॥లు
మధ్యకాలము 3-23 ని॥లు
మోక్షకాలము 3-58 ని॥లు
ఆద్యంత పుణ్యకాలము 1-12 ని॥లు

ఈ గ్రహణము పగటి యందు సంభవించుచున్నందున గ్రహణ శుద్ధ మోక్ష కాలానంతరము నిత్యభోజన ప్రత్యాబ్దికాదులు ఆచరించవలెను. ఇది శ్రవణ నక్షత్రమున సంభవించుచున్నందున శ్రవణ నక్షత్రము వారు, మకర రాశివారు దీనిని చూడరాదు. యధాప్రకారము శాంతి జరిపించుకోవలెను.

**పునః చంద్ర గ్రహణము (9-2-2009)** : ఈ సం॥ర మాఘ పూర్ణిమా సోమవారం చంద్రగ్రహణము మనకు కనిపించదు.

## గ్రహణ శాంతి

ఈ గ్రహణములు పట్టు నక్షత్రములవారలు, రాశివారలు, గ్రహణానంతరము తమ నక్షత్ర జపములు, రుద్రాభిషేకములు చేయించుకొని, **"మమ జన్మరాశి, జన్మనక్షత్ర చతుర్థాద్యరిష్ట, స్థానస్థిత గ్రహణ, సూచితా సర్వారిష్ట ప్రశాంతి పూర్వక ఏకాదశస్థాన స్థిత గ్రహణసూచిత శుభఫల ప్రాప్త్యర్థం బింబదానం కరిష్యే"** అని సంకల్పము చేసి దక్షిణ వెండి/బంగారము బింబములను, నెయ్యితో నిండిన రాగిపాత్రను వస్త్రధాన్యాదులను దానం యివ్వవలెను.

## సావన వర్షారంభ ఫలము

ది. 05-9-2008 సావన వర్షారంభము - సర్వ సస్యసమృద్ధి, ధరలు మందం అందుబాటు సస్యానుకూల వర్షములు సుఖము కలుగును.

## శాలిశకారంభము

ది. 22-3-2009 శాలిశకారంభము

## మౌఢ్య నిర్ణయము

| | |
|---|---|
| ది. 06-5-2008 | వైశాఖ శుద్ధ పాడ్యమీ మంగళవారం ప్రాగస్తమిత్ర శుక్రమౌఢ్య ప్రారంభము. |
| ది. 11-7-2008 | ఆషాఢ శుద్ధ నవమీ శుక్రవారం పశ్చాదుదిత శుక్రమౌఢ్య త్యాగము |
| ది. 11-1-2009 | పుష్యశుద్ధ పూర్ణిమా ఆదివారం పశ్చాదస్తమిత గురుమౌఢ్య ప్రారంభము. |
| ది. 06-2-2009 | మాఘశుద్ధ ద్వాదశీ శుక్రవారం ప్రాగుదిత గురుమౌఢ్య త్యాగము. |
| ది. 22-3-2009 | ఫాల్గుణ బహుళ ఏకాదశీ ఆదివారం పశ్చాదస్తమిత శుక్రమౌఢ్య ప్రారంభము |
| ది. 01-4-2009 | శ్రీ విరోధి చైత్రశుద్ధ షష్ఠీ బుధవారం ప్రాగుదిత శుక్రమౌఢ్య త్యాగము. |

## భూవాహక శేషుని ఫలము - ఆఢకస్థితి నిర్ణయము

పద్మకుడు భూవాహకుడు గాన జనులకు సుఖ సౌఖ్యములు భోగభాగ్యములు సస్యానుకూల వర్షవాతావరణములు కలిగించును. ప్రజలు పాడి పంటల సమృద్ధి కలిగి ఉత్సాహముతో నుందురు. ఉగాది నుండి జూలై 27 వరకు బాల్య వేశ్య చేతియందును. తదుపరి అక్టోబరు 18 వరకు యౌవన వేశ్య చేతియందును. తదుపరి మార్చి 22 వరకు బాల్యవేశ్య చేతియందును వర్ష కుంచముండును. బాల్యవేశ్య చేతియందు వుండు కాలమున అల్పవృష్టి, యౌవ్వన వేశ్య చేతియందువుండు కాలమున అనుకూల వృష్టి కలుగును.

## రాజాది నవనాయక ఫలములు

**1. రాజా - చంద్ర:**

**శ్లో॥ గోధూమ శాలీక్షుమతీ ధరిత్రీ**
**సస్యాంబు పూర్ణాధ్వర వేదనాదితాః,**
**విభాంతి గావః సుదుఘాః ప్రభూతాః**
**సంవత్సరాధి పతౌ శశాంకే.**

పాడిపంటలభివృద్ధి, అనుకూల వర్షములు, ప్రజాభీష్ట పాలన. అపరధాన్యములు కొరత. ధర అధికము. జనులు అధిక ... కలు కలవారై స్త్రీలోలురై ఉందురు. స్త్రీ విప్లవములు అధికము. పెసలు, బియ్యం, ... ఓషధులు, ... ధాన్యములు. నూలు, రసవస్తువులు, మణులు, పండ్లు, మధుర పదార్థములు, పశువులు, అధిక ధరలు. రాజు ... ధూమ ... భూకంపాది ఉపద్రవములు, జన, మానహాని, అధిక ధనవ్యయము కల్గియుందురు

**2. మంత్రి - రవి:**

**శ్లో॥ రాజ్ఞామన్యోన్య వైరిత్వ మనావృష్టిశ్చ సంగరః,**
**అధర్మ నిరతా మర్త్యా భాస్కరే భ్రేతు మంత్రిణే.**

అధికారులయందు, జనులందు శత్రుత్వములు. అనావృష్టిచే పంటలు తగ్గు ముఖము. ప్రతిపక్ష అల్లరులు మాత్రము హెచ్చుగా నుండును. యంత్రములు, విద్యుత్తు, ఇనుము, ఎరుపు, పసుపు, వస్తువులు ధరలు హెచ్చును. రసవస్తువులు, నూనెలు, క్షారములు తగ్గు ముఖము. ధాన్యము, బంగారము, వెండి, మందములో హెచ్చును

**3. సేనాధిపతి - రవి:**

**శ్లో॥ అన్యోన్య యుద్ధం ధరణీశ్వరాణా మల్పాంబుదా వారిధరా స్సవాతాః,**
**రక్తానిసస్యాని ఫలంతి భూమౌ సైన్యాధినాధే దివసేశ్వరస్య.**

మేఘాడంబరములు హెచ్చు, వర్షములు క్రమముగా తగ్గును. ప్రజా ప్రభుత్వములందు అన్యోన్య యుద్ధములు ఉండును. అధికారులు స్వార్థపూరితులైనను క్రమము పాటించి తగుచర్య తీసుకొందురు. వాహన ప్రమాదములు అధికముగ వుండును. ప్రజల వలన ప్రభుత్వమునకు ఆస్థిమితములు హెచ్చుగా కల్గుచున్నను అధికారులు తగు చర్యలు గైకొందురు.

**4. సస్యాధిపతి - బుధుడు:**

**శ్లో॥ శశితనయే సస్యపతాత్వపరం ధాన్యం ప్రభూత ఫలదం,**
**అనిలహతం సస్యచయంత్విహ మధ్యమః ప్రస్సంపన్నం.**

సస్యములకు వాయుపీడలు, తెగుళ్ళు, ఈతి బాధలు, అల్పవృష్టి తూర్పు ప్రాంతములందు పంట నష్టము కలుగును. కొబ్బరి, రసాయనములు, నెయ్యి, పేపరు, మణులకు, జ్యోతిష్కులకు గిరాకీ. మెట్టభూములు, తెలుపు పంటలు బాగుగా పండును. మధ్యమవృష్టి, మొత్తం మీద పంట తక్కువ.

**5. ధాన్యాధిపతి - కుజుడు:**

**శ్లో॥ ఫలంతి శూకధాన్యాని శింబిధాన్యాని యానిచ,**
**రక్తభూమి స్సుఫలితా భౌమేధాన్యాధిపేసతి.**

ముల్లు ధాన్యములు, కందులు, బొబ్బర్లు, మిర్చి, వేరుశనగ, బెల్లం, నెయ్యి, కొబ్బరి ధర గిరాకీ. ఎర్రనిభూములు, ఎరుపు పంటలు బాగుగా ఫలించును. మూషికబాధలు అధికమగును. వ్యవసాయ ఉత్పత్తులకై ప్రభుత్వము ప్రత్యేకముగా చర్యలు, ధనవ్యయము చేయును.

**6. అర్ఘాధిపతి - రవిః**

**శ్లో॥ అల్పవృష్టి రసర్వత్ర క్షుద్భయం సమరాద్భయం,**

ఎరుపు వస్తువులు, అపర సస్యములు, విరివిగా ఫలించును. ధరలు అధికముగా నుండును. దళారులు, గూండాలు ప్రబలుదురు. రాజకీయ ఒడిదుడుకులు అధికముగా నుండును. వర్షములు తక్కువ.

**7. మేఘాధిపతి - రవిః**

**శ్లో॥ మహద్భయం ఫలం స్వల్పం వర్షం స్యాత్ఖండశః క్షితౌ,**
**రక్తసస్యం సుఫలితం సూర్యేమేఘాధిపే సతి.**

తూర్పు ప్రాంతమందు మేఘములు, పశ్చిమప్రాంతము నందు అధికవర్షములు, వాయు ప్రాబల్యము, ఖండ ప్రాంతవర్షములు అధికముగా ఉండును. ఎర్రని భూములు, ఎరుపు సస్యములు ఫలించును.

**8. రసాధిపతి - శుక్రుడుః**

**శ్లో॥ సుగంధవస్తూని శితే రసేశే నిర్గంధవస్తూ నిరసాదికాని,**
**క్షారాణి సర్వాణిచ కందమూలాః ఫలానిపుష్పాణి బహూనిచస్యు**

కుంకుమపువ్వు, కర్పూరము, అగరు, శృంగారము, సుగంధద్రవ్యములు, కందమూలములు, ఉల్లి, వెల్లుల్లి, మధుర పదార్థములు ఉత్పత్తి కల్గి ధర నిలబాటు. వాహనములు, ముత్యములు, మణులు అందుబాటులో నుండును. జనులందు ఆర్భాటములు, కోరికలు, ధనవ్యయము హెచ్చు. దైవకార్యాసక్తి అధికముగా నుండును.

**9. నీరసాధిపతి - బుధుడుః**

**శ్లో॥ చిత్ర వస్త్రాదికం చైవ శంఖ చందనపూర్వకం,**

చిత్ర వస్త్రములు, శంఖములు, చందనము, పెసలు, అపరములు, మాంసముల విక్రయము అధికము. బంగారము, లోహములు ధర మందము. ఈ వ్యాపారస్తులకు ఇక్కట్లు.

* * *

## శ్రీ సర్వధారినామ సంవత్సరములో గ్రహసంచారములు

**రవిచార:** చైత్ర శుద్ధ అష్టమీ ఆది మేషే రవిః, వైశాఖ శుద్ధ దశమీ బుధ వృషభేరవిః, జ్యేష్ఠ శుద్ధ ఏకాదశీ శని మిథునే రవిః, ఆషాఢ శుద్ధ త్రయోదశీ బుధ కర్కాటకే రవిః, శ్రావణ బ.పాడ్యమీ ఆది సింహే రవిః, భాద్రపద బ.విదియా బుధవారం కన్యాయాం రవిః, ఆశ్వయుజ బ.తదియా శుక్ర తులాయాం రవిః, కార్తీక బ. చవితీ ఆది వృశ్చికే రవిః, మార్గశిర బ. తదియా సోమ ధనుషీ రవిః, పుష్య బ. చవితీ బుధ మకరే రవిః, మాఘ బహుళ తదియా గురు కుంభేరవిః, ఫాల్గుణ బ. తదియా శని మీనే రవిః.

**కుజచార:** చైత్ర బహుళ అష్టమీ సోమ కర్కాటకే కుజః, జ్యేష్ఠ బహుళ తదియా శని సింహే కుజః, శ్రావణ శుద్ధ అష్టమీ శని కన్యాయాం కుజః భాద్రపద బహుళ ఏకాదశీ తులాయాం కుజః, కార్తీక శుద్ధ నవమీ శుక్ర వృశ్చికే కుజః, మార్గశిర బహుళ సప్తమీ శుక్ర ధనుషీ కుజః, మాఘ శుద్ధ పాడ్యమీ మంగళ మకరే కుజః, ఫాల్గుణ శుద్ధ ఏకాదశీ శని కుంభేకుజః.

**బుధచార:** చైత్రశుద్ధ దశమీ మంగళ మేషే బుధః, చైత్రబహుళ నవమీ మంగళ వృషభేబుధః, ఆషాఢ శుద్ధ షష్ఠీ మంగళ మిథునే బుధః, శ్రావణ శుద్ధ షష్ఠీ గురు కర్కాటకే బుధః, శ్రావణ బహుళ అష్టమీ ఆది సింహే బుధః, కార్తీక శుద్ధ తృతీయా శుక్ర కన్యాయాంబుధః, కార్తీక బహుళ సప్తమీ బుధ తులాయాం బుధః, మార్గశిర శుద్ధ దశమి సోమ వృశ్చికే బుధః, పుష్యశుద్ధ పాడ్యమీ ఆది ధనుషీ బుధః, పుష్య బహుళ అమావాస్య సోమ వృశ్చికే వక్రీ బుధః, మాఘ శుద్ధ త్రయోదశీ శని ధనుషీ బుధః, ఫాల్గుణ శుద్ధ అష్టమీ బుధ మకరే బుధః, ఫాల్గుణ బహుళ ఏకాదశీ ఆది కుంభే బుధః.

**గురుచార**: మార్గశీర్ష శుద్ధ ఏకాదశీ మంగళ మకరే గురుః.

**శుక్రచార**: చైత్ర బ.పంచమీ శుక్ర మేషే శుక్రః, వైశాఖ శు. పూర్ణిమా మంగళ వృషభే శుక్రః, జ్యేష్ఠ శు.దశమీ శుక్ర మిథునే శుక్రః, ఆషాఢ శు. పంచమీ సోమ కర్కాటకే శుక్రః, ఆషాఢ బ. అమావాస్య శుక్ర సింహే శుక్రః, శ్రావణ బ. నవమీ సోమ కన్యాయాం శుక్రః, భాద్రపద బ. చవితీ శుక్ర తులాయాం శుక్రః, ఆశ్వయుజ శు. చతుర్దశీ సోమ వృశ్చికే శుక్రః, కార్తీక శుద్ధ నవమీ శుక్ర ధనుషీ శుక్రః, మార్గశీర్ష శు. పంచమీ మంగళ మకరే శుక్రః, పుష్య శుద్ధ పాడ్యమీ ఆది కుంభే శుక్ర, మాఘ శు. పాడ్యమీ మంగళ మీనే శుక్ర.

**శనిచార** :సంవత్సరాద్యంతం సింహే సంచారః చైత్ర బ. దశమీ బుధ మకరే రాహుః, కర్కాటకే కేతుః

**రాహుకేతుచారా**: వత్సరమంతయు రాహువు కుంభరాశి యందు, కేతువు సింహరాశియందు సంచరింతురు.

* * *

## మకర సంక్రాంతి పురుష లక్షణము

దీ.14-1-2009 శ్రీ సర్వధారినామ సంవత్సర పుష్య బహుళ చతుర్థీ బుధవారం ఉ.ఘ.11-20 వి.లు, ఉ.గం.11-17 ని॥లకు మఘా నక్షత్రం మీనలగ్నం సౌభాగ్య నామయోగము. బవ నామకరణము నందు రవి మకరరాశిని ప్రవేశించి సంచరించును.



"మందాకినీ" నామధేయము. క్షత్రియులకరిష్టము, కుంకుమ ఉదకస్నానం, శుభకరము, శ్వేతాంబర వస్త్రధారణము ఆరోగ్యకరము, కస్తూరి గంధలేపనము - పుణ్యస్త్రీలకు అశుభము, పున్నాగ పుష్ప ఆభరణము - కీర్తిహాని, మాణిక్యాభరణ ధారణ - మణినాశము, సువర్ణపాత్రలో అన్నము/భోజనము - దుర్భిక్షము, కొబ్బరి ఫలము - కొబ్బరి గిరాకీ, భిశుండి ఆయుధము - క్షుద్బాధ. శ్వేతఛత్రధారణ - ఆరోగ్యకరము. సింహవాహనము - మహాభయము, కొంచెము చిరునవ్వు - శుభదాయకము, కూర్చుని వుండుట - మధ్యమధరలు. తూర్పుదిశ ప్రయాణము- తత్ప్రాంతారిష్టము, కృష్ణపక్షము - సుభిక్షము, క్షేమము, శాంతి కల్గును. 6వ ముహూర్తము-జయకరము, బుధవారమగుట సర్వ శుభఫలితములు, ఉదయ కాలమందు-క్షత్రియులకు దోషము, మీనలగ్నమందగుటచే రోగముల వలన జన క్షయములు - మొత్తం మీద ఫలితములు బాగుగనే వున్నవి.

### ఫలశ్రుతి

**ఫలశ్రుతి**: **సంక్రాంతి పురుషోత్పత్తికాలే దానం స్వశక్తి తః**
**ఫలం కాంస్యాది ధాన్యాని దీయతే దోషనాశనమ్ ॥**
**ఫలానిమూలాన్యజినం సువర్ణం గ్రామాంశుకాద్యం సతిలేక్షు గావః**
**ధాన్యం ఖరాం శోర్మకర ప్రవేశ యాతాని - దానాని విశేషితాని ॥**
**తేజసే రూప సామర్థ్యః సార్వ భౌమ ప్రజాయతే**
**యశ్శృణోతి మధు శుక్ల పక్షకే వర్షనాథ సచివాధికం ఫలం**
**ప్రాప్నుయాద్దురితముక్త విగ్రహశ్చాయురర్థ మతులం యశస్సుఖం ॥**

* * *

## కందాయ ఫలములు

| అశ్విని | భరణి | కృత్తిక | రోహిణి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రేష | మఘ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్ర |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 3<br>0<br>1 | 6<br>1<br>3 | 1<br>2<br>0 | 4<br>0<br>2 | 7<br>1<br>4 | 2<br>2<br>1 | 5<br>0<br>3 | 0<br>1<br>0 | 3<br>2<br>2 | 6<br>0<br>4 | 1<br>1<br>1 | 4<br>2<br>3 | 7<br>0<br>0 | 2<br>1<br>2 |
| స్వాతి | విశాఖ | అనూ | జ్యేష్ఠ | మూల | పూ.షా. | ఉ.షా. | శ్రవ | ధనిష్ఠ | శత | పూ.భా. | ఉ.భా. | రేవ | |
| 5<br>2<br>4 | 0<br>0<br>1 | 3<br>1<br>3 | 6<br>2<br>0 | 1<br>0<br>2 | 4<br>1<br>4 | 7<br>2<br>1 | 2<br>0<br>3 | 5<br>1<br>0 | 0<br>2<br>2 | 3<br>0<br>4 | 6<br>1<br>1 | 1<br>2<br>3 | *<br>*<br>* |

ఇందలి బేసి సంఖ్యలు ధనలాభమును, సమసంఖ్యలు సమఫలమును, శూన్యసంఖ్యలు శూన్య ఫలితములను ఇచ్చును. మొదటి సున్న రోగభయము, మధ్యసున్న మనోభీతిని, చివరిసున్న హానిని తెలుపును. ఒక్కొక్క సంఖ్య 4 మాసములుండును.

| ఆదాయవ్యయములు | | | రాజపూజ్యావమానములు | | |
|---|---|---|---|---|---|
| రాశి | ఆదాయం | వ్యయం | రాశి | రాజపూజ్యం | అవమానం |
| మేషం | 14 | 2 | మేషం | 4 | 5 |
| వృషభం | 8 | 11 | వృషభం | 7 | 5 |
| మిథునం | 11 | 8 | మిథునం | 3 | 1 |
| కర్కాటకం | 5 | 8 | కర్కాటకం | 6 | 1 |
| సింహం | 8 | 2 | సింహం | 2 | 4 |
| కన్య | 11 | 8 | కన్య | 5 | 4 |
| తుల | 8 | 11 | తుల | 1 | 7 |
| వృశ్చికం | 14 | 2 | వృశ్చికం | 4 | 7 |
| ధనుస్సు | 2 | 11 | ధనుస్సు | 7 | 7 |
| మకరం | 5 | 5 | మకరం | 3 | 3 |
| కుంభం | 5 | 5 | కుంభం | 6 | 3 |
| మీనం | 2 | 11 | మీనం | 2 | 6 |

సర్వాదాయం 93 - సర్వవ్యయం 84 - ఫలం - 9

## వర్షధాన్య ప్రమాణములు

వర్షం 7 ధాన్యం 11, శీతం 11, తృణం 15, ఉష్ణం 11, మారుతం 11, ప్రజావృద్ధి 11, నాశ 15, రాజవిద్వరాలు 11, ఉగ్రం 5, పుణ్యాలు 5, పాపాలు 5, వ్యాధి 13, ఉపశమనం 11, ఆచారం 15, అనాచారం 15, జననం 7, మరణాలు 19, దేశోపద్రవాలు 9, దేశస్వాస్థ్యాలు 3, చోరభయం 17, తన్నాశ 5, అగ్నిభయం 9, తచ్ఛాన్తి 9, మృగోపద్రవాలు 5, శాంతి 15, కీటకభయం 15, తన్నాశ 19, మూషికవృద్ధి 11, తనీ నాశ 13, సర్పోపద్రవాలు 17, తచ్ఛాన్తి 17, కామం 7, క్రోధం 9, లోభం 9, మోహం 7, మదం 19, మాత్సర్యం 5, సుఖం 7, దుఃఖం 11, భోగం 13, విడంబం 17, మనోవేదన 17, ద్వేషం 17, ప్రతిష్ఠ 7, అప్రతిష్ఠ 5, ద్యూతం 13, మత్తత 19, పురుష ఉత్పత్తి 9, స్త్రీ ఉత్పత్తి 5, ధాతువృద్ధి 9, భయం 7, శౌర్యం 19, దుష్టశిక్షణ 13, శిష్టరక్షణ 13, సత్యం 7, అసత్యం 3, విశ్వాసం 3, అవిశ్వాసం 9, దయ 5, నిర్దయ 9, న్యాయం 5, అన్యాయం 11, జ్ఞానం 17, అజ్ఞానం 3, కపటం 3, నిష్కపటం 13, పక్షివృద్ధి 1, నాశం 1, ధేనువృద్ధి 3, నాశ 4, మహిషవృద్ధి 1, నాశ 3, మృగవృద్ధి 4, నాశ 5, ఛాగవృద్ధి 1, నాశ 5, వైశ్యవృద్ధి 5, నాశ 1, శూద్రవృద్ధి 4, నాశ 3, మ్లేచ్ఛవృద్ధి 4, నాశ 4, సంకర వృద్ధి 4, నాశ 5, నవరత్నముల వృద్ధి 1, క్షయం 2, అశ్వప్రవృద్ధి 4, క్షయ 1, ఉష్ట్రవృద్ధి 5, నాశ 5, విప్రవృద్ధి 2, క్షయం 1, క్షత్రియ వృద్ధి 4, నాశ 3, మరకత రత్నవృద్ధి 2, మాణిక్య వృద్ధి 2, వజ్రముల వృద్ధి 4, వైఢూర్య వృద్ధి 2, యితర రత్నవృద్ధి 1 చొప్పున అతివృష్టి 7, అనావృష్టి 15, స్వచక్ర ఫలం 9, పరచక్రభయం 7, ధార్మికం 17, అధార్మికం 17, ఇతి.

# 2008 - 2009 శ్రీ సర్వధారినామ సంవత్సర కార్తెలు - వృష్టి నిర్ణయములు

| సం. | కార్తెలు | తేదీలు | వారం | ప్రవేశ సమయం | నక్షత్రం | రాశి | జంతువు | లగ్నం | ఫలితములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | భరణి | 27-04-2008 | ఆది | ప.గం.12-07 | ఉ.షా. | మకరం | ముంగిస | కర్కా | క్షేమ, చిరుజల్లులు, అనుకూల వాతావరణం. |
| 2. | కృత్తిక | 11-05-2008 | ఆది | ఉ.గం.7-08 | పుష్య | కర్కా | మేక | వృషభం | దహనం, ఉష్ణాధిక్యత. |
| 3. | రోహిణి | 24-05-2008 | శని | రా.గం.4-31 | ఉ.షా. | మకరం | ముంగిస | మేషం | అనుకూల వాతావరణం, ఉష్ణాధిక్యత. |
| 4. | మృగశిర | 07-06-2008 | శని | రా.గం.4-02 | ఆశ్రేష | కర్కా | పిల్లి | వృషభం | వాయూధృతం, తూర్పువర్షాలు, పశ్చిమ పేండాలు. |
| 5. | ఆర్ద్ర | 21-06-2008 | శని | రా.గం.5-00 | శ్రవణ | మకరం | కోతి | వృషభం | సువృష్టి, స్వల్పవర్షాలు, పశ్చిమాన మిశ్రమ వాతావరణం. |
| 6. | పునర్వసు | 06-07-2008 | ఆది | ఉ.గం.6-44 | ఆశ్రేష | కర్కా | పిల్లి | కర్కా | సువృష్టి, అల్పవర్షాలు. |
| 7. | పుష్యమి | 20-07-2008 | ఆది | ఉ.గం.8-16 | ధనిష్ఠ 1 | మకరం | సింహం | సింహం | సస్యోచిత వర్షాలు, తూర్పు పశ్చిమ ప్రాంతాలు వరము. |
| 8. | ఆశ్రేష | 03-08-2008 | ఆది | ఉ.గం.8-34 | మఘ | సింహం | ఎలుక | సింహం | అతివృష్టి, జలప్రవాహాలు, మిశ్రమవాతావరణం. |
| 9. | మఘ | 17-08-2008 | ఆది | ఉ.గం.7-11 | ధనిష్ఠ 3 | కుంభం | సింహం | సింహం | దక్షిణాగ్నేయాలు వరదలు, అతివృష్టి, వాయువులు. |
| 10. | పుబ్బ | 30-08-2008 | శని | రా.గం.3-44 | పుబ్బ 1 | సింహం | ఎలుక | కర్కా | అతివృష్టి, జలప్రవాహాలు. |
| 11. | ఉత్తర | 13-09-2008 | శని | రా.గం.9-26 | ధనిష్ఠ 4 | కుంభం | సింహం | మేషం | అతివృష్టి, మిశ్రమవాతావరణం. |
| 12. | హస్త | 27-09-2008 | శని | ప.గం.12-41 | పుబ్బ 1 | సింహం | ఎలుక | కుంభం | వాహకం, మిశ్రమవాతావరణము. |
| 13. | చిత్ర | 10-10-2008 | శుక్ర | రా.గం.12-57 | ధనిష్ఠ 4 | కుంభం | సింహం | కర్కా. | అతివృష్టి, జలప్రవాహాలు. |
| 14. | స్వాతి | 24-10-2008 | శుక్ర | ఉ.గం.10-35 | మఘ | సింహం | ఎలుక | ధనుస్సు | అతివృష్టి, జలసమృద్ధి, ఖండప్రాంత వర్షాలు. |
| 15. | విశాఖ | 06-11-2008 | గురు | సా.గం.5-39 | ధనిష్ఠ 1 | మకరం | సింహం | మేషం | ఖండవర్షాలు అనుకూలవాతావరణం శీతలగాలులు. |
| 16. | అనూరాధ | 19-11-2008 | బుధ | రా.గం.10-34 | ఆశ్రేష | కర్కా. | పిల్లి | కర్కా. | సువృష్టి, అనుకూలవాతావరణం. |
| 17. | జ్యేష్ఠ | 02-12-2008 | మంగళ | రా.గం.1-40 | శ్రవణ | మకరం | కోతి | కన్య | అనుకూల వాతావరణము. |

## శ్రీ సర్వధారినామ సంవత్సర వ్రతదిన పట్టిక

| 2008-2009 | శుక్ల పక్షము | | | | కృష్ణ పక్షము | | | | నక్షత్రములు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మాసములు | ప్రతిపత్ | షష్ఠి | ఏకాదశి | ○ పూర్ణిమ | ప్రతిపత్ | ఏకాదశి | మాసశివ రాత్రి | ● అమావాస్య | కృత్తిక | రోహిణి | ఆర్ద్ర | పునర్వసు | శ్రవణం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| ఏప్రిల్ 2008 | 7 | 11 | 16 | 20 | 21 | - | - | - | 9 | 10 | 12 | 13 | 29 |
| మే | 6 | 10 | 15 | 19 | 21 | 1,31 | 4 | 5 | 6 | 7 | 9 | 10 | 26 |
| జూన్ | 4 | 9 | 14 | 18 | 19 | 29 | 2 | 3 | 3,30 | 4 | 5 | 6 | 22 |
| జూలై | 4 | 8 | 13 | 18 | 19 | 28 | 1,31 | 3 | 27 | 1,28 | 3,30 | 4,31 | 19 |
| ఆగష్టు | 2,31 | 7 | 12 | 16 | 17 | 27 | 29 | 30 | 24 | 25 | 26 | 27 | 16 |
| సెప్టెంబరు | 30 | 5 | 11 | 15 | 16 | 25 | 27 | 29 | 20 | 21 | 23 | 24 | 12 |
| అక్టోబరు | 29 | 5 | 10 | 14 | 15 | 24 | 27 | 28 | 17 | 18 | 20 | 21 | 9 |
| నవంబరు | 28 | 4 | 9 | 13 | 14 | 23 | 26 | 27 | 14 | 15 | 16 | 17 | 6 |
| డిశంబరు | 28 | 4 | 9 | 12 | 13 | 23 | 25 | 27 | 11 | 12 | 14 | 15 | 3,30 |
| జనవరి 2009 | 27 | 2 | 7 | 11 | 12 | 21 | 24 | 26 | 7 | 8 | 10 | 11 | 27 |
| ఫిబ్రవరి | 26 | 1 | 6 | 9 | 10 | 20 | 23 | 24 | 4 | 5 | 6 | 7 | 23 |
| మార్చి | 27 | 2 | 7 | 11 | 12 | 22 | 25 | 26 | 3 | 4 | 6 | 7 | |

గమనిక : + ఏకాదశి ముందు దినము స్మార్త ఏకాదశిగా గ్రహించ వలయును.

# వర్ష యోగములు

**చైత్రమాసము :** ఇందు రవికి దహన, వాయు, మహావాయునాడుల యందును, గురునికి రసజల నాడులందును, శనికి అమృతనాడి యందును సంచారము కలదు. కుజునికి రసనాడి యందును సంచారము కలదు. మాసమంతయు శనికి వక్రస్థితి బహుళ 6 గురు వక్ర ఆరంభము బహుళ 8 అంగారక చలనము, కుజ, గురు షష్ఠాష్టకము కలదు. బహుళ పాడ్యమి నుండి పంచమి వరకు శుక్ర, బుధ, రవి మధ్యమము. బహుళ దశిమీ రాహుకేతు చలనము కలవు. పరిశీలించగా ఉష్ణాధిక్యత, వడగాడ్పులు, బహుళ దశమీ ప్రాంతమందు అక్కడక్కడ వడగండ్ల వర్షములు, కొద్ది ప్రాంతమందు అగ్ని ప్రమాదములు సంభవించును. చంద్ర యోగముచే ఏప్రిల్ 8,14,15,25,28,30 మే 3,4 తేదీలలో వర్ష సూచనలు. తూర్పు తీర ప్రాంతమున స్వల్ప ఉదుకు, వర్షములుండును.

**వైశాఖ మాసము :** ఇందు రవికి మహావాయు, వాయు నాడులందును, కుజునికి జల, అమృత నాడులందును శనికి అమృతనాడి యందును, గురునికి జల, రస నాడులందును సంచారము కలదు. శుద్ధ 1కి ప్రాగ్దిశి శుక్రోదయము, శుద్ధ 6 గురు వక్రారంభము, బహుళ 7 బుధ వక్రారంభము మాసమంతయు కుజ, గురుల షష్ఠాష్టకము కలదు. పరిశీలించగా చతుష్పాదులకు, నష్టము, శుక్ల పక్షమున రాజయుద్ధము ప్రజాకల్లోలాలు కలవు. బహుళమందు గాలి దుమారములు అధికముగా నుండును. ఉత్తరాదిన మిశ్రమ వాతావరణముచే జననష్టము, పంటల నష్టము వాటిల్లును. చాంద్రయోగములచే మే నెల 8,9,14,16,17,20,24,25,26,31 తేదీలలో ఆకస్మిక వర్షములుండును.

**జ్యేష్ఠ మాసము :** ఇందు రవికి వాయు, దహన, సౌమ్యనాడులందును, శని కుజులకు, అమృత నాడి యందును. గురునికి సౌమ్యనాడి యందును సంచారము కలదు. మాసమంతయు గురు వక్రము శుద్ధమున బుధో వక్రి ఋజు శ్శుక్రుడు బహుళ తదియ వరకు కుజ, గురు షష్ఠాష్టకము తరువాత సింహ అంగారకుడూ కలవు. అల్పవర్షములు, గాలి, దుమారములు వాయుస్తంభన, పూర్ణిమ ప్రాంతమున తొలకరి వర్షములు కలగును. సముద్ర తీర ప్రాంతీయులు జాగ్రత్తపడవలెను. చాంద్రయోగముచే జూన్ 7,8,11,18,19,20,23,26,29,30 తేదీలలో వర్షములుండును.

**ఆషాఢ మాసము :** ఇందు రవికి రస, జలనాడులందును, కుజునికి జల, అమృత నాడులందును, శనికి అమృత నాడియందును, గురునికి సౌమ్యనాడి యందును సంచారము కలదు. శుద్ధ నవమి పశ్చిమ దిశి శుక్రోదయము, వక్రగురుడు, శుద్ధ పాడ్యమి నుండి 6 వరకు, శుక్ర, బుధ రవి మధ్యమము. పురోంగారకుడు కలవు. దక్షిణ తీర ప్రాంతమున అధిక వర్షములు, మిగిలిన ప్రాంతమందు స్వల్ప వృష్టి కల్గును. బహుళమున ఉత్తరాదిన అరిష్ట సూచనలు. చాంద్రయోగముచే జూలై 4,5,8,11,16,17,20,21,25 ఆగష్టు 1 తేదీలలో వర్షములు కురియును.

**శ్రావణ మాసము :** ఇందు రవికి అమృతనాడి, కుజునికి రస, సౌమ్య, గురునికి సౌమ్యనాడి శనికి అమృతనాడి యందును సంచారము కలదు. శుద్ధ అష్టమి వరకు మహాంగారకుడు. మాసమంతయు వక్రగురుడు మఖాధి పంచక శుక్రుడు, బహుళ పాడ్యమి నుండి కాలసర్ప సంచారము. బహుళ నవమి నుండి పంచ గ్రహకూటమి. పరిశీలించగా నదులు పుష్కలముగా ప్రవహించుట, తూర్పు తీర ప్రాంతములందు సస్యానుకూల వర్షములు, తుఫానులు కలవు. సస్యములకు నష్టములు. చాంద్రయోగములచే ఆగష్టు 2,3,9,12,14,17,18,24,25 తేదీలలో వర్షములు కురియును.

**భాద్రపద మాసము :** ఇందు రవికి జల, రస, సౌమ్య, గురునికి సౌమ్య, కుజునికి సౌమ్య, దహన, శనికి జలనాడి యందును. సంచారము కలదు. శుద్ధ అష్టమి గురు వక్రత్యాగము, మఖాది పంచక శుక్రుడు గ్రహ కాల సర్పసంచారము, గ్రహకూటములు కలవు. బహుళ విదియ నుండి శుక్రో వక్రి, బుధ రవి మధ్యమము, బహుళమున 11 వరకు రవి, కుజ, గురుల సింహరాశి

స్థితి కలవు పరిశీలించగా అత్యంత వాతావరణ అల్లకల్లోలములు ప్రజా సంక్షోభములు, వ్యతిరేక పరిస్థితులు, జన నష్టము, సూచించబడుచున్నవి. తూర్పు, దక్షిణ ప్రాంతములందు తుఫానులు, శుక్లపక్షమున అల్పవర్షములు కల్గును. చాంద్రయోగముచే సెప్టెంబరు 7,8,13,14,15,16,20,21,28,29 తేదీలలో వర్షములు కురియును.

**ఆశ్వయుజ మాసము :** ఇందు రవికి సౌమ్య, దహన, వాయు నాడులందును, గురునికి సౌమ్యనాడి, కుజునికి దహన వాయు శనికి జలనాడి యందును సంచారము కలదు. మాస మంతయు అన్ని గ్రహములకు కాలసర్ప యోగము గ్రహకూటములు, బహుళ విదియ వక్రత్యాగము, శుద్ధ షష్ఠి నుండి స్వాతిత్రయ కుజుడు కలవు. పరిశీలించగా పశ్చిమ ప్రాంతము నందు, దక్షిణ ప్రాంతమందు తుఫాను భీభత్సములు, తూర్పు, ఆగ్నేయ ప్రాంతమున అగ్ని ప్రమాదములు, ప్రజాకల్లోలములుండును. చాంద్రయోగముచే అక్టోబరు 2,5,6,8,13,14,15,18,24,25,27,28 తేదీలలో అధిక వర్షము లుండును.

**కార్తిక మాసము :** ఇందు రవికి వాయు, మహావాయు కుజునికి మహావాయు, శనికి జలనాడి, గురునికి సౌమ్యనాడులందును సంచారము కలదు. ఇందు గ్రహములకు మాలిక యోగము, కాలసర్పయోగము కలవు. శుద్ధ నవమి అంగారక చలనము, గురు, శుక్ర ఏకరాశి స్థితి పరిశీలించగా శుక్ల పక్షమున పశ్చిమ తీర ప్రాంతములందు అధిక తుఫానులు, తూర్పు ప్రాంతమందు సస్యానుకూల వర్షములు, శీతల వాతావరణములు కలవు. చాంద్రయోగములచే అక్టోబరు 30,31 నవంబరు 3,4,7,8,11,15,16,18,19,22,23,26 తేదీలందు వర్షములు కురియును.

**మార్గశిర మాసము :** ఇందు రవికి వాయు, మహావాయు నాడులందును, కుజునికి వాయు, దహన వాయు నాడులందును గురునికి రసనాడి యందును, శనికి జలనాడి యందును సంచారము కలదు. ఇందు గ్రహములకు కాలసర్పయోగము, మాలికాయోగము, బహుళ సప్తమి కుజ చలనము, శుద్ధ 11 గురు చలనము శుక్ల పక్షమున స్వల్ప వర్షములు. బహుళమున హిమపాతములు కల్గును చాంద్రయోగములచే నవంబరు 30 డిశెంబరు 3,8,9,19,20 తేదీలందు ఆకస్మిక వర్షములు.

**పుష్య మాసము :** ఇందు రవికి సౌమ్య, రస, జలనాడులందును, కుజునికి దహన, సౌమ్యనాడులందును గురునికి రసనాడి యందును, శనికి జలనాడి యందు సంచారము కలదు. శుద్ధ పంచమి శని వక్రారంభము. పూర్ణమున పశ్చిమ దిశ గురు వస్తంగతము. బహుళ విదియ బుధ వక్రారంభము కల్గును. మాసమంతయు శని, గురు షష్ఠాష్టకములు కలవు. పశ్చిమ, ఉత్తరాది, ఈశాన్య ప్రాంతమందు మంచు అధికముగా కురియును. ఉత్తరాదిన జననష్టము వాటిల్లును. చాంద్రయోగములచే డిశెంబరు 28,29 జనవరి 10,11,12,22,26 తేదీలలో ఆకస్మిక వర్షములుండును.

**మాఘ మాసము :** ఇందు రవికి గురునికి అమృతనాడి, కుజునికి రస, జలనాడి శనికి జలనాడి యుందును సంచారము కలదు. శుద్ధమున పంచగ్రహకూటమి, గ్రహ, యుద్ధ సమాగమములు శుద్ధ షష్ఠి బుధ వక్రత్యాగము, శుద్ధ 12 ప్రాగ్దిశి గురూదయము. పూర్ణిమ గ్రహణము కలవు. అన్ని ప్రాంతములందును తుషారములు, సస్యానుకూల వాతావరణములుండును. జనవరి 27 ఫిబ్రవరి 5,8,12,17,18,24 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు.

**ఫాల్గుణ మాసము :** ఇందు రవికి జల,రస, సౌమ్య, కుజునికి గురునికి రస, జల, శనికి జలనాడి యందుకు సంచారము కలదు. శుద్ధ ఏకాదశి వరకు శని, కుజ, గురు షష్ఠాష్టకము. ఏకాదశి శుక్రవక్రారంభము, బహుళ ఏకాదశి పశ్చిమ దిశ శుక్రాస్తమయము కలవు. అన్ని ప్రాంతము లందును వర్షము లుండును. ప్రభుత్వ వాతావరణములో భేదములు కల్గి నివారించబడును. చాంద్రయోగములచే మార్చి 4,5,7,14,15,22 తేదీలలో వర్షము కురియును.

* * *

# పరకుల ధరలు

**చైత్రం :** కుంకుమాది సుగంధ ద్రవ్యములు, నిత్యావసర వస్తువులు, గృహోపకరణములు, పశువులు, ఆకులు, లోహములు, బంగారము ధర హెచ్చును. షేర్లు హెచ్చును. బహుళమున తిలతైలములు, యంత్రములు వస్త్రములు, కొబ్బరి, పసుపు ధరహెచ్చును. కొబ్బరి, చెరుకు భూములు ధరమందములో.

**వైశాఖం :** కూరలు, తైలములు, పెట్రోలు, ఇంధనములు క్రమముగ హెచ్చును. కొబ్బరి, పసుపు వుల్లి, సుగంధములు మందములో చురుకు. గృహోపకరణములు, ఎలక్ట్రానిక్స్, విలాసవస్తువులు శుద్ధమున గిరాకీ. కలప, భూములు, షేర్లు విపరీతము. బంగారాది లోహము మందము. మే 16 నుండి కొర్రలు, గోధుమలు కుంకుళ్ళు ఫలపుష్పములు ఓషధులు హెచ్చును మాసాంతమున షేర్లు, మధుర పదార్థములు మందము.

**జ్యేష్ఠ మాసము :** అపరములు, ధాన్యము, ఎలక్ట్రానిక్స్, యంత్రములు శుద్ధమున హెచ్చును బహుళమున తగ్గును. వాతావరణ ప్రతిబంధకములచే నిత్యకృత్య గృహ వస్తువులు గిరాకీ. వస్త్రములు, కొబ్బరి పొట్టు ధాన్యములు క్రమేణ హెచ్చును. వేరుశనగ నూనెలు, ఆకులు, ప్రత్తి, శృంగార వస్తువులు గిరాకీ. రవాణా గిరాకీ. వాహనములు గిరాకీ. జూన్ 20 నుండి పసుపు కుంకుమలు, వస్తువులు హెచ్చును. భూములు, యంత్రములు ఉన్ని, వేరుశనగ మిర్చి హెచ్చును. ఎరుపు వస్తువులు, ఎర్రధాన్యములు గిరాకీ బంగారము నిలబాటు.

**ఆషాఢం :** యంత్రములు, అపరములు, కొబ్బరి, రసద్రవ్యములు పరిమళ ద్రవ్యములు, చక్కెర, తోలు, పశువులు శుద్ధమున గిరాకీ. జూలై 15 నుండి ధాన్యము, బంగారము, వస్త్రములు, శృంగార వస్తువులు మందము. బహుళమున దుంపలు, రసాయనములు, కూరలు కొబ్బరి గిరాకీ. మాసాంతమున మందము.

**శ్రావణ మాసం :** వస్త్రములు, బంగారము, శృంగార వస్తువులు, ఓషధులు, ముల్లుధాన్యములు, కొబ్బరి హెచ్చి మందమగును, షేర్లు వ్యత్యాసము, బ్యాంకు వడ్డీలు హెచ్చును. ఆగష్టు 9 నుండి యంత్రములు, రస ద్రవ్యములు పాలు, కందలు హెచ్చును. ఆగష్టు 17 నుండి షేర్లు వ్యత్యాసము, సిమ్మెంటు, శీతల పానీయాలు, సుగంధ ద్రవ్యములు గిరాకీ. మాసాంతమున బంగారము హెచ్చును.

**భాద్రపదం :** యంత్రములు, పశువులు, కొబ్బరి, తైలములు, అపరములు మొదట గిరాకీ, షేర్లు, యంత్రములు, భూములు ఆకాశానంటును. కొబ్బరి, ధాన్యములు, ఉన్ని, సర్వధాన్యములు, పశువులు, వాహనములు, గిరాకీ. గ్రహకలయికచే కొన్ని ప్రాంతములందు ఆహార పదార్థములు, ట్రాన్స్‌పోర్టులు గిరాకీ అగును. బహుళమున గృహోపకరణములు, ఎరువులు, ధాన్యములు, వస్త్రములు బంగారం లోహములు, వుల్లి, వెల్లుల్లి ప్రత్తి, ప్రేలుడు పదార్థములు కొద్ది చురుకు.

**ఆశ్వయుజం :** సర్వధాన్యములు, అపరములు, కొబ్బరి, వస్త్రములు, ఎరువులు ప్రారంభమున గిరాకీ, జలచరములు, నిలువ పదార్థము, రాగి అందుబాటులో నుండును. వస్త్రములు, అపరములు యంత్రములు ధాన్యము, రసాయనములు వ్యాపారములు మంచికదలి కలుగును. భూములు, రియల్ ఎస్టేటు, షేర్లు, విలాస వస్తువులు మందము. చెరుకు, నూనెలు, ఉన్ని, రాళ్ళు అవిశెలు, కొబ్బరి, కుంకుళ్ళు, ఎర్రచందనము పాలు, పెరుగు గరుడ పచ్చలు గిరాకీ. ధాన్యము మందంలో చురుకు. ఎలక్ట్రికల్, ఎలక్ట్రానిక్ వస్తువులు, షేర్లు బహుళమున నిలబాటులో వృద్ధి.

**కార్తీకం :** మిర్చి, ధాన్యము, శనగలు, సుగంధ ద్రవ్యములు, టెంకాయలు బంగారు లోహములు క్రమముగ హెచ్చును. బహుళమున కంబళ్ళు, చిత్రపరిశ్రమలు, షేర్లు, గృహోపకరణలు, నీరు, యంత్రములు, రాగి హెచ్చును. బహుళమున పశువులు, కూరలు, పాలు, పండ్లు, కంబళ్లు, మందము. యితరములు గిరాకీ రసాయనములు భూములు నిలబాటు. మాసాంతమున గృహమందలి పరికరములు, తీగెలు, ఆకులు, సర్వ లోహములు గిరాకీ అగును. బంగారము హెచ్చును. కొబ్బరి నిలబాటు.

**మార్గశిరం :** పేపరు, కుంకుళ్ళు, ఉల్లి, పట్టు హెచ్చును. గణకులు, సేవకులు గిరాకీ, వస్త్రములు, బంగారము, మిర్చి డిశెంబరు 8 నుండి పెరుగును. డిశెం. 15 నుండి బియం, జలచరములు, షేర్లు, పోగాకు, అపరములు మందులు గిరాకీ అగును. యంత్రములు, కొబ్బరి, ధాన్యములు మందకొడి 19 నుండి ధాన్యము, భూములు, టెంకాయలు షేర్లు తగ్గి క్రమముగ గిరాకీ అగును.

**పుష్యం :** తిలతైలములు, యంత్రము, మణులు, దుంపలు, వాహనములు రసాయనిక వస్తువులు కొబ్బరి మాసారంభమున తగ్గును. పసుపు, చింతపండు, మిర్చి మందంలో గిరాకీ, భూములు, షేర్లు మందము. పూర్ణిమ నుండి ఆహార పదార్థములు, కొబ్బరి, ధాన్యములు పగడములు ధాతు వస్తువులు చింతపండు, షేర్లు గిరాకీ. జనవరి 14 నుండి పసుపు, ధాన్యములు, తేయాకు, తైలములు, వడ్డీలు, నీలమణులు, పశువులు హెచ్చును. అన్నియు క్రమముగ హెచ్చును. పేపరు, ధాన్యము హెచ్చును.

**మాఘం:** యంత్రములు, ఉపాధ్యాయులు గిరాకీ, బంగారము, పెరుగు, పాలు, తీపి పదార్థములు, తెల్లని వస్తువులు, క్షీరములు కొద్దిపాటి వృద్ధి. శృంగార వస్తువులు, ఆయుధములు, మిర్చి, ఉల్లి, పాలు, కూరలు, పొట్టు ధాన్యములు వృద్ధి. ఫిబ్రవరి 7 నుండి ద్రావకములు, పానీయాలు కొబ్బరి, ధాన్యము, పశువులు గిరాకీ అగును. పశ్చిమ ప్రాంతారిష్టములచే ఆహార పదార్థములు గిరాకీ అగును.

**ఫాల్గుణం:** సర్వధాన్యములు, ఎరువు వస్తువులు, మట్టి, పశువులు, సిమ్మెంటు, బంగారం లోహములు, కొబ్బరి క్రమేణా హెచ్చును. ధాన్యములు నిలబాటు. షేర్లు నిలబాటు. మార్చి 7 నుండి యంత్రములు, పట్టు, దూది, బెల్లము, గోధుమలు భోజన వస్తువులు, శ్రీగంధము, శంఖము, కొబ్బరి, ఉల్లి, నూనెలు, క్రమముగ గిరాకీ బహుళమున యంత్ర పరికరములు, లవణములు, కొబ్బరి, మిర్చి, కఱ్ఱలు, పెట్రోలు, రసాయనములు హెచ్చును.

* * *

## సంవత్సర ఫలితము

| | | | | |
|---|---|---|---|---|
| అశ్విని | పుష్యమి | స్వాతి | అభిజిత్ | వారికి అలంకారప్రాప్తి |
| భరణి | ఆశ్రేష | విశాఖ | శ్రవణం | వారికి రోగభయం |
| కృత్తిక | మఘ | అనూరాధ | ధనిష్ఠ | వారికి ఆయుర్వృద్ధి |
| రోహిణి | పుబ్బ | జ్యేష్ఠ | శతభిషం | వారికి అర్థలాభం |
| మృగశిర | ఉత్తర | మూల | పూ.భా. | వారికి మనస్తాపం |
| ఆర్ద్ర | హస్త | పూ.షా. | ఉ.భా. | వారికి రాజపూజ్యత |
| పునర్వసు | చిత్ర | ఉ.షా. | రేవతి | వారికి యుద్ధభయం |

## 2008 - 2009 శ్రీ సర్వధారినామ సంవత్సర [illegible]

| క్రమ సంఖ్య | ఇంగ్లీషు తేదీలు | మాసములు | అశ్విని మఘ మూల | భరణి పుబ్బ పూ.షా. | కృత్తిక ఉత్తర ఉ.షా. | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ.భా. | పుష్యమి అనూరాధ ఉ.భా. | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | 07-04-2008 | చైత్రం | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని |
| 2. | 06-05-2008 | వైశాఖం | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి |
| 3. | 04-06-2008 | జ్యేష్ఠం | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
| 4. | 04-07-2008 | ఆషాఢం | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు |
| 5. | 02-08-2008 | శ్రావణం | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు |
| 6. | 31-08-2008 | భాద్రపదం | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | శని | రావుహు |
| 7. | 30-09-2008 | ఆశ్వయుజం | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
| 8. | 29-10-2008 | కార్తీకం | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు |
| • 9. | 28-11-2008 | మార్గశిరం | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు |
| 10. | 28-12-2008 | పుష్యం | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు |
| 11. | 27-01-2009 | మాఘం | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
| 12. | 26-02-2009 | ఫాల్గుణం | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు |

**ఫలితములు** : జన్మ లేక నామ నక్షత్రగడికి క్రింది వరుసలోని మాసాధిపతికి గల ఫలితములను చూడవలయును.

### మాసాధిపతుల ఫలితములు

**రవి** : పనుల తొందర, ఒత్తిడి, ఆలస్యం, తూర్పు ప్రయాణం, దుఃఖం, శిరోవేదన, భయం, రాజభీతి, నిరుత్సాహం, ఆశాభంగం, శ్రమ, కోపం, శాంతి, రుద్రాభిషేకం, సూర్యస్తుతి.

**చంద్రుడు** : మాతృసౌఖ్యం, దధ్యన్నసౌఖ్యం, స్త్రీ సంభోగసుఖం, మనోనైర్మల్యం, ఆనందం, గౌరవం, కృషి వ్యాపారాదులు, పెద్దల దర్శనం, సర్వ కళాత్మభావం, లలిత కళలపట్ల కౌశల్యం, సప్త సంతాన పోషణం.

**గురుడు** : ధనలాభం, గురు ఆదరణం, జ్ఞానం, సుఖం, భార్యకు ఆభరణములు, సంతాన సౌఖ్యం, ఎడమరకు ప్రయాణం. మంచి వస్త్రధారణం. స్థిరవృద్ధి, శాస్త్ర విజ్ఞానం, ధైర్యం, సర్వశుభం, శివదర్శనం.

**రాహు** : ఆతురత, స్మశాన దర్శనం, దైన్యం, వ్యసనం, కడుపునందు, బొడ్డునందు వ్యాధి, కోపం, ధననష్టం, ప్రయాణంలో దొంగలభయం, గుండెజబ్బు, క్షయ, ఉబ్బసమువంటి దీర్ఘరోగ బాధ. శాంతి, దుర్గాపూజ, రాహుస్తుతి.

**బుధ** : బంధుగోష్ఠి, విద్వజ్జన సంగమం, వర్తకజన స్నేహం, వ్యాపారవృద్ధి, భవిష్యత్ ఆలోచనలు, హాస్య సంభాషణ, ధనలాభం, ప్రయత్నసిద్ధి. శాంతి, విష్ణుభక్తి విష్ణు స్తోత్రములు, పూజలు.

**శుక్రుడు** : తెల్లనిబట్టలు ధరించుట, పరిమళ ద్రవ్యోపయోగము, స్త్రీ సంభోగ సౌఖ్యం, నూతన పరిచయములు, స్థిరలాభం, మధుర పదార్థలాభం, ధనలాభం, స్త్రీలాభం, గోలాభం, సర్వసుఖం, లక్ష్మీస్తోత్రం.

**కేతువు** : బంధువైరం, దుష్టస్త్రీ పీడ, మనశ్చాంచల్యం, దైవభక్తి, అతికోపం, దీర్ఘతర్కం, పుణ్యకర్మలు, స్వల్పాధికారం కలుగుతుంది. పాముపల్ల ప్రమాదం. తరచు నష్ట ద్రవ్యలాభం. ప్రాయశ్చిత్తాది కర్మాచరణం, క్రతుదీక్షా తత్పరత. శాంతి, మహారుద్రాభిషేకం, కేతుస్తుతి.

**శని** : ఏనుగులవలన జంతువుల వలన భయం, నల్లని వస్త్రలాభం, కోపం, పరపీడ, నీచభయం, దుర్వార్తా శ్రవణం, నీచకార్యాచరణము బుద్ధి మాంద్యం, అనవసర ప్రసంగం, విరక్తి, గర్భశూల, గుండెపోటు. శాంతి రుద్రాభిషేకం, తైలాభిషేకం, శనిస్తుతి.

**కుజుడు** : అధికారుల బెడద, ఆయుధముల వలన భయం, కార్యనాశనం, మనస్తాపం, మనఃకాఠిన్యం, దక్షిణ నైరుతి దిశాప్రయాణం, ఔషధసేవ, ధనమునకు ఇబ్బంది, ఆకారణ విరోధం, రక్తదర్శనం, ఒత్తిడులు, పనులలో ఆటంకం, శాంతి, శివునకు అభిషేకం, కుజస్తుతి, దుర్గా స్తోత్రం.

# శ్రీ సర్వధారినామ సంవత్సర రాశిఫలితములు

## మేషరాశి



**(అశ్వని: 1,2,3,4 పాదములు భరణి: 1,2,3,4 పాదములు కృత్తిక: 1వ పాదము)**

| | | | |
|---|---|---|---|
| **ఆదాయం** | **- 14** | **వ్యయం** | **- 2** |
| **ం** | **- 4** | **అవమానం** | **- 5** |

ఈ రాశివారికి ఉగాది నుండి డిశెంబరు 9 వరకు గురుడు 9ట లోహమూర్తి తదుపరి వత్సరమంతయు 10ట సువర్ణమూర్తి శని వత్సరమంతయు 5ట లోహమూర్తి వత్సరమంతయు రాహువు 10ట, కేతువు 4ట సువర్ణమూర్తులు. ఈ సువర్ణమూర్తులు పూర్తి యోగదాయకులు.

ఈ రాశి వారికి గురు, శనిబలములు బాగుండుటచే అన్ని విధముల యోగదాయకముగ నుండును. అన్ని రంగముల వారికీ పట్టినదల్లా బంగారముగా నుండును. గతంలోని అర్ధాష్టమ శని, అష్టమ గురుని వలన కలిగిన మాతృవంశం వారితో తగవులు, భూగృహ సంబంధములైన కష్టములు తొలుగును. స్త్రీ ప్రోత్సాహముతో ముందుకు పోగలరు. వ్యవసాయదార్లు, వైద్య, కళా రాజకీయ, న్యాయ, సినీ, యాంత్రిక పరిశ్రమ రంగముల వారందరికీ లాభదాయక కాలము పనులు చురుకుగా సాగి గృహ జీవనము సుఖముగ నుండును. భూగృహలాభము కలుగును. పూర్వమందు నిలబాటులో ఉన్న వ్యవహారములు, పనులు పూర్తి అగును. రాహు కేతువులకు జపము, సుబ్రహ్మణ్య, దుర్గా ఆరాధన చేయుట, మంగళ, శుక్రవార నియమములు పాటించుటచే సుఖశాంతుల నొందగలరు. సంతానము యొక్క విద్యా ఉద్యోగముల కంటె ఆరోగ్యముకై అధికశ్రద్ధ కలిగి వుండవలెను. నూతన వ్యాపారములు విశేషముగ లాభించును. వ్యవహారముల యందు తాత్కాలిక పరిష్కారములు మేలనిపించును. స్వతంత్ర వృత్తుల, వ్యవసాయదారులకు కాలము కలసివచ్చును. భూగృహ శుభకార్య ప్రయత్నములు చిన్న ఆటంకములు కలుగుచు ముందుకు సాగును. కుజ సంచార ప్రభావముచే స్తంభించిన భూగృహ వ్యవహారములు సఫలములగును. సం॥ర పూర్వార్ధమున స్పెక్యులేషన్ ఫలించును. విద్యార్థులకు పట్టుదల, కృషి ద్వారా విశేష ఫలితములు ఉన్నత విద్యా ఉద్యోగ లాభములుండును. కాంట్రాక్టర్లు, జాయింటుదార్లకు షేర్లు, స్పెక్యులేషన్, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు అవరోధములు అనుకూల ఫలితములు. వస్త్రములు, ఫైనాన్స్ ఇంజనీరింగ్, ఉపాధ్యాయ, వ్యాపార వృత్తుల వారికి 6,7,9,10,12,2 నెలలు విశేషములు. కోళ్ళు, జలచరములు, ధాన్యము, కిరాణా వ్యాపారులకు 4,5,6,9,11,1,2 నెలలు విశేషలాభములు.

**వీరికి అదృష్ట సంఖ్య 9. 1,2,3,7 సంఖ్యలు, ఆది, సోమ, గురువారములు** లాభప్రదములు. వీరు కుజ, రాహుకేతువులకు జపములు, శనికి తైలాభిషేకములు, దుర్గాత్రిశతి ఆరాధనలు, గురువార నియమములు జరుపుట సర్వదా శ్రేయోదాయకము. స్త్రీలకు శుక్ర, శనివారములు, శివారాధన, ఆంజనేయ, లలిత పూజలు ముత్యము ధారణ వలన ప్రశాంతము, మనోభీష్టము నెరవేరును.

### నెలవారీ ఫలితములు

**ఏప్రిల్** : నెల అంతయూ భాగ్యగురునిచే ధనాదాయము, వృత్తివ్యాపారములు సాఫీగా నడచును, శుభమూలక ధనవ్యయం, సోదర సహాయము లభించును. పుత్రమూలక ధనవ్యయము. మొత్తం మీద మాసమంతయూ శుభసూచకము. జన్మరవిచే ఆతృత, స్వల్ప అనారోగ్యం, శిరోబాధలు.

**మే** : మాసమంతయూ అనారోగ్యసూచన. ధనప్రాప్తి, కీర్తివృద్ధి, శత్రువుల వలన భయము, మాసాంతమునందు అధిక త్రిప్పట, కార్యజయం.

**జూన్** : భయాందోళనలు. వ్యాపారాభివృద్ధి, ధనలాభము, సోదరవర్గవృద్ధి, శత్రుభయం. బంధుమిత్రుల సహకారములుంటాయి. ఆరోగ్యముపై శ్రద్ధ.

**జూలై** : సంపద్వృద్ధి, శత్రుభీతి. సంఘములో గౌరవభంగము, సౌఖ్యము, మనోవ్యాధి, మనోవ్యాకులము, మిత్రలాభము, వాదోపవాదములు.

**ఆగష్టు** : అమర్యాద, అవమానము, మనోవ్యాధి. శత్రువుల వలన భయము, సంతానమూలక లాభము, జయము, మాసం మధ్యలో ధనలాభము.

**సెప్టెంబర్** : భయాందోళనలు శత్రునాశనము. అలంకార వస్తుప్రాప్తి, ధననష్టము, ఇబ్బంది. మనోవ్యాకులత, మిత్రలాభము, కుటుంబానందము.

**అక్టోబర్** : శత్రువులపై జయము. ఋణబాధలు ఉన్ననూ కార్యములందు జయము. అలంకార వస్తుప్రాప్తి, మాసం పూర్వార్ధమునందు మనోవేదన, ద్వితీయార్ధములో నూతన వస్త్రలాభము. స్త్రీల పట్ల జాగ్రత్త. చోరభయము.

**నవంబర్** : ఋణబాధ అనారోగ్యము కలుగును. మనోభీతి, ధైర్యము లేకుండుట, విచారము, మాసం ద్వితీయార్ధములో ఆరోగ్యము సిద్ధించును.

**డిశెంబర్** : ఆరోగ్య సమస్యలు మనోధైర్యము, శస్త్రభీతి, ధనవ్యయము, అయిననూ సుఖసంతోషములు ఉండును. పదవీగండము, వ్యాపారకలతలు.

**జనవరి** : క్రోధము, వ్యయము, మానసికపీడ, శుభవార్తానందము, వ్యవహారము లందు ఆలోచనలు, పండిత ప్రసంగములు, ప్రేమ విషయములలో తొందర, పుత్ర, పితృభావముల గురించి జాగ్రత్త, నూతన వస్తు, వస్త్రలాభము.

**ఫిబ్రవరి** : శత్రుత్వంతో కార్యసిద్ధి, కంగారుతనము, రాజనీతి, గౌరవ పురస్కారములు, స్త్రీమూలక వాదప్రతివాదనలు, వ్యతిరేక కార్యకలాపాలు, వ్యవహార పరిష్కారాలు, సర్వత్రలాభము, మందీబలము.

**మార్చి** : మనోవేదన, ఆత్మతతో కూడి వ్యవహార నిలుపుదల, తప్పని ప్రయాణాలు, విద్యా, వికాసములు, అపూర్వ వస్తు సంపాదన, మనోకాఠిన్యత లోపల గంభీరత, విష్ణుభక్తి, ఆలయసందర్శనలు, రద్దీ.

* * *

# వృషభ రాశి



**(కృత్తిక: 2,3,4 పాదములు రోహిణి: 1,2,3,4 పాదములు మృగశిర: 1,2 పాదములు)**

| | | | |
|---|---|---|---|
| **ఆదాయం** | **- 8** | **వ్యయం** | **- 11** |
| | **- 7** | **అవమానం** | **- 5** |

ఈ రాశివారికి ఉగాది నుండి గురుడు డిశెంబరు 9 వరకు 8ట సువర్ణమూర్తి తదుపరి వత్సరమంతయు 9ట లోహమూర్తి. శని వత్సరమంతయు 4ట సువర్ణమూర్తి, వత్సరమంతయు రాహువు 9ట కేతువు 3ట తామ్రమూర్తులు.

ఈ రాశివారికి ఈ సంవత్సరము పూర్వార్ధములో గడ్డుకాలము. ప్రారంభమున ప్రతి పనియందు ఆటంకములు, ఒడిదుడుకులు కలుగును. ఆరోగ్యవిషయమై తగు జాగ్రత్త అవసరము. ఆకస్మిక ధననష్టము కలుగు అవకాశము కలదు. వాహనములు నడుపునప్పుడు తగు జాగ్రత్తలు పాటింపవలెను. రాజకీయ పరమైన ఇబ్బందులు ఎదురగును. ప్రతి పనియందు, ప్రతి వ్యవహారమునందు ఆచి తూచి అడుగు ముందుకు వేయవలెను. ముఖ్యమైన కార్య వ్యవహారములు వాయిదా వేయుట ఉత్తమము. అకాలభోజనము, శ్రమ, త్రిప్పట, అయిననూ ఫలితం శూన్యము. సంవత్సరము రెండవ భాగములో అన్ని రంగముల వారికీ పూర్వము ఉన్న ఒడిదుడుకులు తగ్గి, కొంతవరకు ఉపశమనము లభించును. వ్యవసాయదారులకు రెండవ పంట అనుకూలించును. మొదటి పంట అననుకూలము. విద్యార్థులకు రెండవ ఛాన్సు చూడవలసి వచ్చును. కష్టపడిన గానీ ఉత్తమ ఫలితముల నొందలేరు. స్వయం వృత్తుల వారికి, చిరు, స్థిర వ్యాపారస్తులకు సంవత్సర రెండవ భాగము నుండి వృద్ధి కానవచ్చును. అన్ని రంగముల వారికీ ప్రథమార్థము యోగించదు. ద్వితీయార్థము యోగదాయకము. ఉద్యోగులకు పరీక్షాకాలము. ఉద్యోగులకు నిలబాటు, వ్యాపారులకు పురోభివృద్ధి.

ఈ రాశివారు శని, గురులకు జపములు, తరచు ఈశ్వరాభిషేకము, దర్శనములు చేసిన కొంతవరకు జయము కలుగును. శని, గురువార నియమములు పాటించిన శుభము. నూతన వ్యాపారులకు ప్రస్తుతము కంటె భవిష్యత్తు బలపడును. రాజకీయము బలీయము. రుణములు పెరుగును. తిల, తైల, యంత్ర గృహోపకరణ వ్యాపారులకు క్రమేణావృద్ధి, కాంట్రాక్టర్లు, న్యాయవాదవృత్తి, ఇంజనీరింగ్, శాస్త్రీయ వృత్తులవారికి ఆదాయము కంటే శ్రమ మిగులును. బంధు మిత్ర వ్యవహారములయందు తల దూర్చరాదు.

కృత్తిక నక్షత్రమువారు కెంపు, పచ్చ, రోహిణి నక్షత్రమువారు ముత్యము, మృగశిర నక్షత్రమువారు పుష్యరాగము ధరించుట శుభము, శని, మంగళవార నియమములు, విష్ణు స్తోత్రములు. అంజనేయ ప్రార్థనలు విశేషములు. నిత్యం శివదర్శనం ప్రశాంతము వృద్ధి. మొత్తం మీద భవిష్యత్ అన్ని రంగముల యందు ముందంజ వేయుచుందురు. కుజ, శని, రాహు జపములు విశేషలాభములు కలిగించును.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్** : సోదర సోదరీమూలక ఖర్చులు, మాతృమూలక చిక్కులు. ఆర్థికపరమైన చిక్కులు. చేయు వృత్తివ్యాపారములు ప్రోత్సాహకరముగా నుండవు. ప్రభుత్వ పరమైన ఆర్థికలావాదేవీలు, స్వల్ప అనారోగ్యము. నిరాశ నిస్పృహలు, శత్రువృద్ధి.

**మే** : ఉద్యోగులకు స్థానచలన సూచన, ప్రయాణసూచనలు, అనవసర తగువులు, మాట ఇచ్చుట మాటపడుట, మాసాంతము నందు సుఖము కీర్తి, సర్వ సంపద సంతోషము. వ్యాపారబలము, నూతన ప్రణాళికలు.

జూన్ : స్థానచలనములు ఉండగలవు. ఆర్థికాభివృద్ధి, మనోవ్యథ, భయాందోళనలు, సౌభాగ్యం. వాగి వలన ధనలబ్ధి, వర్గలాభము.

జూలై : భయాందోళనలు. ఆర్థికాభివృద్ధి, సువర్ణవస్తుప్రాప్తి, ఆరోగ్యము వృద్ధి, సౌభాగ్యము, శత్రువుల వలన భయము. ఆర్థికమిశ్రమం, వాహనలాభం.

ఆగష్టు : సిరిసంపదలు, గౌరవమునకు లోటు. శత్రువుల వలన అపజయము, సుఖము, మనశ్శాంతి లేకుండుట. నిదానము కార్యసాధన కలుగుతుంది.

సెప్టెంబర్ : అమర్యాద గౌరవభంగము భయము. ధనమునకు ఇక్కట్లు, పుత్ర మూలక ధనలాభము ధననష్టము, మాసం చివరిలో ధనప్రాప్తి. అనుకూల ప్రయాణం.

అక్టోబర్ : మనోభీతి శత్రువులపై జయము. అయాచిత ధనలాభము అయిననూ ఋణబాధ, ధననష్టము కలుగును. సమస్యలు క్రమతో పరిష్కృతములు.

నవంబర్ : శత్రువులపై జయము ఋణములు చేయవలసివచ్చును. కార్య వ్యవహారములలో జయము, అలంకార వస్తుప్రాప్తి, నూతన వస్తువస్త్రలాభము. విద్యావ్యాసంగములు, సద్గోష్ఠి.

డిశెంబర్ : ఋణములు చేయవలసి వచ్చుట, అనారోగ్య సంబంధిత సమస్యలు కార్యములయందు జయము-భయము సంతోషము ద్వితీయార్థమున ఆరోగ్యసిద్ధి. వ్యాపారులకు పురోభివృద్ధి, స్థిరలాభములు.

జనవరి : మోకాలు నొప్పులు, దురదలు, ఆశ్చర్యములు, వ్యసనాలబాట, అసౌఖ్యము, భూప్రయత్నాలు, శుభకార్య ప్రసంగాలు.

ఫిబ్రవరి : బంధుమిత్ర శుభ ప్రసంగాలు. వ్యాపార, శుభకార్య ప్రణాళికలు, అకారణ ప్రయాణాలు, మందబుద్ధి. వార్తాశ్రవణము, కొనుగోలు వృత్తి వ్యాపారములందు విజయము.

మార్చి : ఎదురీత, సర్వత్ర ఆనందము, దైవభక్తి శుభకార్యములందు పాల్గొనుట, సుఖభోజనము, గణిత, జ్యోతిష గోష్ఠి, స్త్రీ సౌఖ్యము.

* * *

# మిథున రాశి



**(మృగశిర : 3,4 పాదములు ఆరుద్ర: 1,2,3,4 పాదములు పునర్వసు : 1,2,3 పాదములు)**

**ఆదాయం - 11 వ్యయం**
**- 3 అవమానం**

ఈ రాశివారికి ఉగాది నుండి డిశెంబరు 9 వరకు గురుడు 7ట తామ్రమూర్తి తదుపరి వత్సరమంతయు 8ట సువర్ణమూర్తి. శని సంవత్సర మంతయు 3ట రజితమూర్తి, వత్సరమంతయు రాహువు 8ట కేతువు 2ట రజితమూర్తులు సం॥ర ఉత్తరార్థము మేలు.

ఈ రాశివార్కి గురుబలము బాగున్నది. శుభకార్య అనుకూలత. ఆర్థికాభివృద్ధి కలుగును. తరచు ఆర్థిక పరమయిన ఇబ్బందులు మానసిక ఆందోళన, తీవ్రదృష్టి, తీవ్రకార్య దీక్ష, ఉష్ణతత్వము అధికముగ వుండును. జూన్ 21 వరకు అంగారక సంచార ప్రభావముచే మానసిక, వ్యవహారిక సమస్యలు, సోదర వర్గ విరోధములు, స్థానచలనములు, జాయింటుదార్లు విడిపోవుట, యితరుల హామీలలో చిక్కుకొనుట, మొదలగు ఫలితములుండును. ఆత్మస్తుతులు పరనింద మానవలెను. మిత్ర శత్రుత్వములు, శత్రుమిత్రత్వములు కల్గును. గౌరవమునకై ప్రాకులాడు చుందురు. ప్రతి విషయమునందు సంయమనము పాటించవలెను.

రాహు కేతువుల ప్రభావముచే విద్యార్థులు సమస్యల నెదుర్కొన వలసి వచ్చిననూ పురోభివృద్ధిలో నుందురు. వ్యవసాయదారులకు స్వయం వృత్తులవార్కి సం॥ర ఉత్తరార్థము బాగుండును. వ్యాపారస్తులకు స్వయం వృత్తిదారులకు ఉత్తరార్థము లాభకరము. రాహుగ్రహ శాంతిచే సర్వదా వృద్ధి. ఉద్యోగస్తులకు పరీక్షాకాలము. దుర్గాచండీ పారాయణాలు, విష్ణు సహస్ర నామములు చేయుట, గురు, శనివార నియమములు చేసిన మంగళప్రదముగా నుండును. పరుల సహకారముతో కార్యసిద్ధి కల్గును. నూతన దంపతులు సంయమనము పాటింపవలెను. అన్నిరంగముల ఉద్యోగులకు పురోభివృద్ధి కల్గును.

ఈ రాశివార్కి ద్విస్వభావము అగుటచే ఇతరులను ఖంగారు పెట్టుచుందురు. రాజకీయములకు దూరముగా నుండుట మంచిది. వ్యాపారస్థులు పెట్టుబడులు తగ్గించి తాత్కాలిక వ్యాపారము చేయుట మంచిది. శాస్త్ర కళాకోవిదులకు, స్వయం వృత్తులవారికి పరీక్షా కాలముగా ఉన్నను వృద్ధి కల్గును. విద్యా, వైజ్ఞానిక, వ్యవసాయ రంగముల వారికి ఫైనాన్స్ యాంత్రిక, తిల, తైల వ్యాపారులకు విశేష ఫలితములు. వైద్యులు, కాంట్రాక్టర్లు, ఇంజనీర్లు రియల్ ఎస్టేట్, వ్యాపారులకు సంవత్సర పూర్వార్థమందు మేలు. ఉత్తరార్థము మందమగును. భాషా విద్యార్థులకు, ఇంజనీరింగ్ విద్యార్థులకు పురోభివృద్ధి, ఉపాధ్యాయులకు స్థిరములు చేకూరును. మిగిలిన వ్యాపారులకు ఊహాత్మక వ్యాపారము కల్గును. మొత్తం మీద ఈ సం॥రము భారీ పెట్టుబడి వ్యాపారముల కంటె, చిరువ్యాపారము వలనే లబ్ధి కలుగును. స్పెక్యులేషన్, చెరువులు కలసిరావు. మృగశిరా నక్షత్రం వారు పుష్యరాగము, ఆర్ద్రవారు నీలమణి, గోమేధికము పునర్వసు వారు వజ్రము, పుష్యరాగము ధరించిన కలసి వచ్చును.

ఈ రాశి వారికి అదృష్ట సంఖ్య 5. 1,2,8 సంఖ్యలు ఆదిత్య, గురు, శుక్రవారములు ఫలించును. మొత్తం మీద గురు, రాహు, కేతువులకు జపములు, విష్ణు నామపఠన ఆచరించుట మేలు. స్త్రీలు గురు, శుక్రవారములు లక్ష్మీ, సాయి, గణేశ, అంగారక స్తోత్రములు పఠించుట మంచిది.

**నెలవారీ ఫలితములు**

**ఏప్రిల్** : మాసాంతము వరకు ఆరోగ్య విషయమై శ్రద్ధ అవసరము. వృత్తి వ్యాపారముల యందు ప్రోత్సాహము. ధనాదాయము బాగుండును. లాభ రవిచే పితృసౌఖ్యము. మాసాంతమున తలపోటు, బి.పి. అధికము.

**మే** : మాసం ప్రారంభములో అకస్మిక ధనలాభము, ద్వితీయార్థములో అనారోగ్యము. ఇతరులచేతిలో మోసపోవుట స్థానభ్రంశము, పనియందు నిరాసక్తత అయిననూ సర్వవృద్ధి. నేత్రవైద్యము, మృష్టాన్నభోజనము.

**జూన్** : ఆరోగ్యసిద్ధి, స్థానచలన సూచనలు. మనోవ్యాకులత, తదుపరి మాసాంతములో ఆనందము. మనోల్లాసము, శయ్యాభోగము.

**జూలై** : స్థానచలనములు బదిలీలు సూచితము. భయము, సుఖము లేక పోవుట, ఆర్థికాభివృద్ధి, సౌభాగ్యము సంపద. మందీబలము, ప్రయాణలాభము. పూర్వ స్నేహితుల ఆగమనము.

**ఆగష్టు** : భయాందోళనలు, సంపద కల్గును. సువర్ణవస్తు లాభము, సౌభాగ్యము, శత్రువుల వలన భయము. పెద్ద వ్యాపారులకు లాభము, బాకీలు వసూలు. విద్యాలాభము.

**సెప్టెంబర్** : సంపదృద్ధి, గౌరవభంగము. శత్రువుల వలన భయము, అంతంత మాత్రముగా సుఖప్రాప్తి. మించిన ఖర్చులు, అతివాక్.

**అక్టోబర్** : సంఘములో గౌరవము తగ్గుట, మనసునందలి భయము, వ్యాకులత, శత్రువుల వలన భయము, పుత్రమూలక ధనలాభము నష్టము. శాంతికై సూర్య నమస్కారములు.

**నవంబర్** : సంఘములో గౌరవమునకు లోటు, అమర్యాద, విశ్వాసము లేకపోవుట ధనమునకు ఇబ్బంది, నష్టము, మనోవ్యాకులము. ద్వితీయార్థములో ధనలాభము, గృహనిర్మాణములు వాయిదా మేలు.

**డిశెంబర్** : శత్రునాశనము ఋణములు ధనలాభము యత్న కార్యసిద్ధి మనోవిచారము, నూతన వస్తు వస్త్రలాభము కలుగును. ప్రియ సంభాషణములు. మృష్టాన్న భోజనము.

**జనవరి** : కార్య, కళాపోషణము, యత్నకార్యలాభము, బంధుమిత్ర దర్శనములు, మోకాలు నొప్పులు, కీళ్ళవాతములు, పాండిత్యగోష్ఠి, కంఠశోషణము, నూతన వస్త్ర, ఆభరణలాభము. చిరకాల స్నేహితుల ఆగమనము.

**ఫిబ్రవరి** : ప్రియాశూన్యత, చిన్న పనికి పెద్ద కృషి, శస్త్రలాభము, అవాంచిత కోరికలు, మిత్రశతృత్వములు. నూతన ప్రాజెక్టుల ప్రారంభము.

**మార్చి** : శస్త్రభయం, అనవసర ఆలోచనలు, అస్థిమితములు కల్గుచున్నను. శుభప్రదముగ వుంటాయి. ఔషధసేవ తప్పనిసరి.

* * *

# కర్కాటక రాశి



**(పునర్వసు : 4వ పాదము పుష్యమి: 1,2,3,4 పాదములు ఆశ్లేష: 1,2,3,4 పాదములు)**

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 5 | వ్యయం | - 8 |
| రాజపూజ్యం | - 6 | అవమానం | - 1 |

ఈ రాశివారికి గురుడు ఉగాది నుండి డిశెంబరు 9 వరకు 6ట రజిత మూర్తి తదుపరి వత్సరమంతయు 7ట తామ్రమూర్తి. శని సంవత్సరమంతయు 2ట సువర్ణమూర్తి రాహువు, 7ట కేతువు జన్మమందు సంవత్సరమంతయు లోహమూర్తులు. శని పూర్ణయోగవంతుడు. స్థిరములనిచ్చును.

ఈ రాశివార్కి గ్రహబలము సామాన్యముగా వున్నది. షష్ఠ గురుడు, ఏప్రిల్ 30 నుండి సప్తమ రాహువు, జన్మకేతువు, అగ 9 వరకు కుజదోషము కల్గినవి. వ్యవహార పట్టుదలలు, నూతన కార్యయత్నములు, తీర్థయాత్రాసిద్ధి, ఔషధసేవనము కల్గును. ఆర్థికము, వ్యవహారములు మాట, బహు మందకొడిగా సాగును. ఆకలి తక్కువగును. కుటుంబవృద్ధి, చిన్న చిన్నవ్యాపారములు కలసి వచ్చును. వ్యవహార యీతిబాధలు కల్గిన యెడల శీఘ్ర పరిష్కారములు మేలు నిచ్చును. శుభకార్యములు వాయిదా వేయుట మేలు. ఈ రాశివార్కి మనః చాంచల్యము, పరపీడనము హెచ్చుగా నుండును. విద్యా వైజ్ఞానిక రంగములందు ముందంజ వేయుదురు. అన్ని రంగముల వ్యాపారులకు, సినీనట గాయకులకు పారిశ్రామిక వేత్తలకు అపూర్వ గౌరవ, ధనలాభములు కల్గును. తరచు అనుమానములు, నీరసము, నేత్రములు, నడుము మోకాళ్ళు స్థానములందు అనారోగ్యములు కల్గుచుండును. ప్రతీ పనియందు యితరులను నమ్మరాదు. శని కుజ ప్రభావముచే సం॥ర పూర్వార్ధమున ముందు నుయ్యి వెనుక గొయ్యి అన్నచందాన వుండును. వీర్కి భాగ్యకారకుడు గురుడు 6వ స్థానము నందున్ననూ నైసర్గిక శుభప్రదుడు గాన, మరియు ఈ రాశివార్కి పూర్ణ రాజయోగ

కారకుడు కుజుడు గాన వీరి ప్రభావముచే భవిష్యత్ ప్రణాళికలు వేయుట, భూ వ్యాపార లాభములు, అఖండ రాజయోగ సన్మానములు కలుగును. అపకారములు జరుగక కొద్దిపాటి మేలు కలుగును.

ఈ రాశివారు నవగ్రహారాధన సుబ్రహ్మణ్యాభిషేకములు సుందరకాండ పారాయణ, మంగళ, గురువార నియమములు చేయుచుండిన కుటుంబ సౌఖ్యము, విశేషము, వృద్ధి కల్గును. విద్యార్థులు కుటుంబ సమస్యలతో సతమతమగుచుందురు. అకారణ కలహములు ఎదుర్కొందురు. ఉపాధ్యాయులు, బ్యాంకింగ్, ఉద్యోగులకు అధికశ్రమ, పట్టుదలలు, బదిలీలు మిగిలిన ఉద్యోగులకు అభీష్ట సిద్ధి. పేపరు, గృహోపకరణ రసాయన, అపర, పశు వ్యాపారులకు సంవత్సర ఉత్తరార్థము మేలు. ఫైనాన్స్ షేర్లు, వస్త్ర, యాంత్రిక, లోహ వ్యాపారులకు 4,5,8,9,10,12, 2 నెలలు విశేష లాభములు, ధాన్యము, కోళ్ళు, మత్స్యసంపద, మిగిలిన వ్యాపారులకు సమఫలితములు.

**ఈ రాశి వారికి అదృష్ట సంఖ్య 2. 1,3,9 సంఖ్యలు, సోమ, గురు, శుక్రవారములు** కలసి వచ్చును. పునర్వసు వారు పుష్యరాగము, పుష్యమివారు నీలమణి, పగడము, ఆశ్లేషవారు గరుడపచ్చ ధరించుట ఉత్తమం. మృత్యుంజయ జపము, రుద్రాభిషేకము, సర్ప సూక్త పారాయణము నిత్యము దైవదర్శనము, గోసేవ బహుశాంతి నిచ్చును. స్త్రీలు సుబ్రహ్మణ్య, అంజనేయ, లక్ష్మీపూజలు, శుక్ర, మంగళవార, నియమములు పాటించుట కుటుంబమున ఋణవిముక్తి, శాంతి సౌఖ్యములు కలుగును.

### నెలవారీ ఫలితములు

ఏప్రెల్ : ఆర్థికపరమైన చిక్కులు, షష్ఠగురుని వలన శారీరకశ్రమ, అనారోగ్యము, వృత్తివ్యాపారముల యందు ప్రోత్సాహము. వాగివలన ధనలాభము.

మే : సుఖము వ్యాపారాభివృద్ధి అందలి లాభము, జయము, తలచిన కార్యములు నెరవేరును. పదోన్నతి లభించును. సంఘములో గౌరవము, కీర్తి ప్రతిష్ఠలు. దొంగలవలన ధననష్టము. ప్రయాణములలో జాగ్రత్త అవసరము.

జూన్ : మాస ప్రారంభమున ఆరోగ్యము. వ్యాపారాభివృద్ధి ఆనందము, ఐశ్వర్యసిద్ధి, కించిత్తు అనారోగ్యము. యత్నసిద్ధి మిక్కిలి లాభము.

జూలై : రవి వ్యయసంచారముచే మాసం ప్రథమార్థములో ధనవ్యయము స్థానచలనములు. అనారోగ్యము, మనోవిచారము దుర్వార్తలు, వైరాగ్యము.

ఆగష్టు : స్థానచలన సూచనలు బదిలీలు ఉండును. ధైర్యము కోల్పోవుట, సంసారిక బంధనములు, భాగ్యము, సౌభాగ్యము. మాట నిదానము అవసరం.

సెప్టెంబర్ : భయాందోళనలు సంపద, శత్రువుల వలన భయము, మాసాంతమున సుఖసంతోషములు కలుగును. విందులు, వినోదములు.

అక్టోబర్ : మాస ప్రారంభములో ధనలాభము. అవమానములు, శత్రుభీతి, సుఖము, సంతానలాభము. భూసేకరణ, మాతృవర్గ అనుకూలత.

నవంబర్ : గౌరవభంగము కలుగును. మనోభీతి వ్యాకులము శత్రువుల వలన భయము ఏర్పడును. ధననష్టము జరుగును. ఉద్యోగ, వ్యాపారజయం.

డిశెంబర్ : మనోభీతి శత్రువులపై పైచేయి సాధింతురు. మనసులో బాధ ధనమునకు లోటు రాదు. అలంకార వస్తు ప్రాప్తి. మాట పట్టింపులు.

జనవరి : వ్యవహారజయము, ధనలాభము, శస్త్రలాభము, దైవక్షేత్ర సందర్శనములు, శోషణము, మాటదైన్యము, అనవసర ధనవ్యయము.

ఫిబ్రవరి : అధికారిక వత్తిడులు. వైరాగ్యము, స్నేహ, అర్థవ్యయము, లాభము, మూఢభక్తి, పుణ్యకథా శ్రవణము, లోభత్వము, వ్యాపార భాగస్వాముల వలన చిక్కులు.

మార్చి : లాభము, వ్యవహారచింత, బద్ధకము, లోకపౌరుషము. భూగృహవాహన మార్పులు సిద్ధిస్తాయి. విద్యా విషయాలు ఫలిస్తాయి. బంధువు దూరము.

* * *

# సింహ రాశి



**(మఖ : 1,2,3,4 పాదములు పుబ్బ: 1,2,3,4 పాదములు ఉత్తర: 1వ పాదము)**

| | | | | | |
|---|---|---|---|---|---|
| **ఆదాయం** | - | **8** | **వ్యయం** | - | **2** |
| **రాజపూజ్యం** | - | **2** | **అవమానం** | - | **4** |

ఈ రాశివారికి గురుదు ఉగాది నుండి డిశెంబరు 9 వరకు 5ట లోహమూర్తి తదుపరి వత్సరమంతయు 6ట రజితమూర్తి. శని వత్సరమంతయు జన్మమందు లోహమూర్తి. రాహువు 6ట కేతువు 12ట తామ్రమూర్తులు.

ఈ రాశి వారికి సం॥రం పూర్వార్థం విశేషము, ఏల్నాటి జన్మశని, వ్యయ కేతు. ఏప్రిల్ 28 నుండి సెప్టెంబరు 25 వరకు కుజదోషము కొద్దిపాటి శ్రమను అస్థిమితములు కల్గించును. శని, గురులు స్థిరలాభములు శుభములు. విద్యా ఉద్యోగ విజయములు కల్గించును. స్థిరము వృద్ధి అగును.

ఈ రాశి వారికి సంతానోత్సాహము. సంఘములో పలుకుబడి కీర్తి ప్రతిష్టలు, దైవకార్యాచరణ, శుభకార్య నిర్వహణ, ఆర్థికాభివృద్ధి కల్గించును. జన్మ శని, కేతు సంచార ప్రభావముచే ఆరోగ్యముకై జాగ్రత్త వహించవలెను. మాట పట్టింపులు, క్రిందివారి వలన సమస్యలు, చోరభీతి, నరముల బలహీనత, స్త్రీ మూలక చిక్కులు కల్గుచుండును. విద్యార్థులు శ్రమచే ఉన్నతి సందగలరు. అన్ని రంగముల వ్యాపారులకు మిశ్రమ ఫలితములు. స్వయం వృత్తుల వారు సమస్యలున్ననూ క్రమేణ వృద్ధి కల్గును. దైవకార్యాచరణములు ఫలించును. విద్యా, ఉద్యోగ విదేశీ ప్రయాణములు ఫలించును. ఋణములు ఆలస్యముగ తీరును. వీరు మంగళ, శనివార నియమములు, శివునికి, అన్నిగ్రహములకు, శనికి తైలములతో, అభిషేకములు, తరచు శివదర్శనములు చేయుట వలన ప్రశాంతము, ఆరోగ్యవృద్ధి కల్గును. వీర్కి ఛాయాగ్రహముల ప్రభావము గతంకంటె అనుకూలత కల్గి శుభము ఆరోగ్యము కల్గును. నిత్య అన్నదానములు. గోసేవ, విద్యాదానము చేయుట వలన గ్రహపీడ తొలగును. యాంత్రిక, నిర్మాణములు, నూతన వ్యాపారములు, మొదట అస్థిమితము కల్గించిననూ భవిష్యత్ సంస్థాగతమై వృద్ధి చెందును. దిగులు, ఈతి బాధలు గతమందలి వ్యాపార, వ్యవహార స్తంభనలు తొలగి ముందంజ వేయుదురు. రాజకీయము, కాంట్రాక్టర్లు, జాయింటు వ్యాపారులకు వన్నె హెచ్చును. సినీ, న్యాయవాద వృత్తుల వారికి ఒకప్పుడు సహనము నశించిననూ భవిష్యత్ బంగారుబాట అగును. షేర్లు, స్పెక్యులేషన్, రియల్ ఎస్టేట్ రంగముల వారికి పట్టు. అన్ని రంగముల ఉద్యోగులకు చలనములు, చంచలత్వములు కలుగుచుండును.

**ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 1. 3,5,9 సంఖ్యలు, మంగళ, బుధ, గురువారములు** అదృష్ట ప్రదములు. మఖవారు వైఢూర్యము, పుబ్బవారు వజ్రము, పచ్చ, ఉత్తరవారు కెంపు, పుష్యరాగము ధరించుట మేలు. నిత్యము శివారాధన, అభిషేకములు, మృత్యుంజయ జప, అభిషేక హోమములు ఆచరించవలెను. సుందరకాండ పారాయణము చాలా విశేషము నిచ్చును. స్త్రీలు శుక్ర, శనివారముల నియమములు దుర్గ ఆరాధన, లక్ష్మీ పూజలు నవగ్రహస్తోత్రములు పఠించిన గృహమందు ఋణవిముక్తి భర్తృపుత్ర సౌఖ్యములు ఆరోగ్యవృద్ధి, కుటుంబమున ఉద్యోగలాభములు కలుగును.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్** : శారీరక శ్రమ, ధనాదాయము బాగుండును పుత్రమూలక సుఖము, కళత్ర అనారోగ్యము, చేయు వృత్తి వ్యాపారముల యందు ప్రోత్సాహముగ నుండి. స్త్రీ ప్రోత్సాహముతో ముందుకు పోగలరు. నూతన స్నేహితులు ఆగమనము.

**మే** : శస్త్రచికిత్స తద్వారా అధిక ధనవ్యయము. మనశ్శాంతి లేకపోవుట, పితృవర్గము వలన ఆందోళన, మాసాంతములో ధనలాభము, ఆర్థికముగా వృద్ధి, చేయని పనికి శిక్ష అపనిందలు. శాంతికై సూర్య నమస్కారములు.

**జూన్** : లాభము, వ్యవహారజయము, మనశ్శాంతి, సంతోషవార్తలు, ధనలాభము, ఆరోగ్యము. విద్యాజయము వస్త్రలాభము.

**జూలై** : ఆరోగ్యము, అధిక ధనవ్యయము. సంతోషదాయక సంఘటనలు జరుగును. ఐశ్వర్యవృద్ధి, మాసం చివరిలో కించిత్తు అనారోగ్యము కలుగును.

**ఆగష్టు** : అనవసర ధనవ్యయము, స్థానచలనములు బదిలీలు. ఆరోగ్యము మందగించుట, మనోవిచారము వ్యయసూచనలు కల్గును. బహునిదానము.

**సెప్టెంబర్** : స్థానచలనము పిరికితనము. సువర్ణ వస్తులాభము, భాగ్యవృద్ధి, మనోవిచారము కలుగును. శిరోవేదన, వాత ప్రకోపములు.

**అక్టోబర్** : మనోభీతి ధనలాభము. ఆదాయమునకు లోటురాదు. ధనలాభము, సుఖము శాంతి కలుగును. వ్యాపార, వస్తులాభము.

**నవంబర్** : సంపదవృద్ధి అగును. గౌరవభంగము కలుగును. శత్రుభయం ఏర్పడును. పుత్రమూలక ధనలాభము లభించును. మాతృవర్గ వ్యతిరేకం.

**డిశెంబర్** : గౌరవమునకు భంగము అవమానములు భయభ్రాంతులగుట. శత్రువుల వలన భయము, మనోవ్యధ, ధనమునకు ఇబ్బంది. నష్టము.

**జనవరి** : సంతాన తాపత్రయము, శుభకార్య నిశ్చిత, అపూర్వ వస్తు సంగ్రహణము, శిరోబాధ, ఆకలి, ప్రయత్నానికి తగ్గ ఫలితములు లేకపోవడము, క్లేశము, స్నేహవ్యయము.

**ఫిబ్రవరి** : అర్థసిద్ధి, శుభ దైవకార్యములందు పాల్గొనుట, నూతన స్నేహితుల ఆగమనం, అధికార వత్తిడులు, సాహసముచే క్రమేణ కార్యసాఫల్యత, రిపుక్షయం, వృత్తి, వ్యాపారాలలో ప్రోత్సాహాలు, ధనవృద్ధి గుర్తింపు.

**మార్చి** : శస్త్రలాభము, మనోధైర్యం, అనుకూల బదిలీలు, అనుకూల ప్రయాణాలు, వాహనలాభము, ఇంటా బయట ఆనందము, పాండిత్యగోష్ఠి, స్త్రీసౌఖ్యము, శుభపరంపరలు.

* * *

# కన్యా రాశి



**(ఉత్తర: 2,3,4 యలు హస్త : 1,2,3,4 పాదములు చిత్త : 1,2 పాదములు)**

**ఆదాయం - 11 వ్యయం - 8**
**- 5 అవమానం - 4**

ఈ రాశివారికి ఉగాది నుండి గురుడు డిశెంబరు 9 వరకు నాల్గింట తామ్రమూర్తి. తదుపరి వత్సరమంతయూ ఐదింట లోహమూర్తి. వత్సరమంతయూ శని 12వ స్థానమునందు సువర్ణమూర్తి. 2008 ఏప్రిల్ 30 నుండి రాహువు 5ట, కేతువు 11ట సువర్ణమూర్తులుగ సంచరింతురు.

ఈ రాశి వారికి గురుబలం బాగున్నది. రాహుకేతువులు సువర్ణమూర్తులుగ నుండుటచే లాటరీ ఛాన్సు వలె కలసివచ్చును. శని వ్యయమందు ఉండుట దోష భూయిష్టమే అయిననూ, భూగృహ నిర్మాణముల ద్వారా వ్యయము, ఆర్థిక, స్థిరాస్తులు వృద్ధి పొందును. సంతానమును గూర్చి శ్రద్ధ కలిగి ఉండవలెను. గత మందలి వ్యవహార భేదములు, ఆరోగ్య అస్థిమితములు తొలగును. తీర్థయాత్రలు, క్రతువులు ఆచరించుతురు. విదేశీయానములు ఉండగలవు. పూర్వబంధు మిత్రులు, శత్రువులుగ అగుదురు. స్థానచలన ఆలోచనలు మానవలెను. కార్యములయందు చురుకు పాటింతురు. సంఘమున పలుకుబడి, నాయకత్వము, విశేష ఆదరణలు, నూతన వ్యాపార సంస్థా ప్రారంభములు, పెద్దల పరిచయము కలిగి యుందురు. చంచల మనస్తత్వము వీడవలెను. కుటుంబ సౌఖ్యము కలిగియుందురు. శని సంచార ప్రభావముచే కొద్దిపాటి నేత్ర, ఉదర, నడుము, మోకాలు స్థానముల యందు ఆరోగ్యలోపములు, కంగారు మాటలు, నిస్సత్తువ, చోరభయము కల్గుచుండును. నవగ్రహశాంతి. విద్యార్థులకు, ఉన్నతి, నూతన ఉద్యోగలాభములు కల్గును. గణితము, ఆంగ్లము విషయముల యందు అధికశ్రద్ధ కలిగియుండవలెను. అన్ని రంగముల ఉద్యోగులకు అధికారుల వల్ల వత్తిడులు ఉన్ననూ పురోభివృద్ధి కలుగును. వ్యవసాయదార్లకు, నిత్యకృత్య వ్యాపారులకు వృద్ధి కానరాగలదు. వ్యాపారులకు జాయింట్లు, నిల్వలు యందు నిదానించవలెను. సినీ, నట, గాయకులు, స్వయం వృత్తుల వారికి ప్రశంసలు, పురోభివృద్ధి, ఇంజనీర్లు, డాక్టర్లు, శాస్త్ర కోవిదులు మొదలగు వారికి మిశ్రమ ఫలితములు ఉండును. అపరములు, రైస్‌మిల్ వ్యాపారులు, మత్స్య, రసాయనిక వ్యాపారులకూ, 7,8,9,1,2 మాసములు అనుకూలించవు. కాంట్రాక్టర్లు, కోళ్ళఫారముల వారికి 5,7,8,9,11,1మాసములు వ్యతిరేకము. సంతానము నాశించువారికి సంవత్సరాంతమున కోరిక నెరవేరును. తరచు శివదర్శనములు, అభిషేకములు, శనికి తైలాభిషేకములు, నిత్యము శివపంచాక్షరి (ఓం నమశ్శివాయ) మంత్ర జపము ఆచరించిన శుభకార్య నిర్వహణ ఆరోగ్యవృద్ధి, అన్ని రంగముల యందు ప్రోత్సాహము, కుటుంబ ఆనందము కలుగును.

**ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 5. 1,3,4,6 పచ్చ, నీలమణి ధరించుట, శని, శుక్రవార** నియమములు పాటించుట చేసిన ఫలితము కానవచ్చును. స్త్రీలు, శుక్ర, గురువార నియమములు పాటించి, గణేశ, విష్ణు స్తోత్రములు పఠించిన సత్ఫలితములుండును. నవగ్రహాభిషేకం, శనికి తైలాభిషేకము ముఖ్యం. రామరక్ష స్తోత్రము, సుందరకాండ పారాయణ, కొండంత అండ.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్** : శారీరక రుగ్మతులు, శ్రమ, సుఖము తగ్గుట. ధనాదాయము, సోదర వర్గముచే ప్రోత్సాహము. ఆరోగ్యము పట్ల శ్రద్ధ వహించవలెను.

**మే** : అపనిందలు, పితృవర్గము వలన ఆందోళన ఇష్టకార్యసిద్ధి, నూతన వస్త్ర లాభము, పరోపకారాభిలాష, ధనలాభము, కీర్తివృద్ధి, శత్రుజయము, సర్వత్రా సుఖము.

**జూన్** : మనోధైర్యముచే కార్యజయము కలుగును. లాభము, వ్యాపార సంబంధిత ఖర్చు, శాంతి, భాగ్యవృద్ధి, శుభం, పురోభివృద్ధి.

**జూలై** : వృత్తివ్యాపారముల యందు లాభము, జయము, మనశ్శాంతి, ఆనందము, మాసాంతములో మనోవ్యాకులత, మిశ్రమ ఫలములు.

**ఆగష్టు** : ఆరోగ్యవృద్ధి, ధనవ్యయము, సుఖసంతోషములు, ఐశ్వర్యప్రదము, మాసాంతమున ఆరోగ్యక్షీణము. లబ్ధి, స్వార్థం, చికిత్సలు, జయం.

**సెప్టెంబర్** : అనవసర ధనవ్యయము, స్థానచలనము. దుఃఖము, ఆరోగ్యము, వృద్ధి అగును. ఆదాయము కూడా వృద్ధి అగును. కంగారు, శుభవ్యయం.

**అక్టోబర్** : స్థానచలనములు ఉండవచ్చును. అకారణ భయము, మనో వికారము, అగౌరవము, అవమానములు. ద్వితీయార్థములో కొంతవరకు నయముగా ఉండును. వాదనలు జయం, గ్రహశాంతి.

**నవంబర్** : భయము కలుగును. సంపదవృద్ధి అగును. సౌభాగ్యము చేకూరును. ధనలాభము కలుగును. సర్వసుఖములు లభించును.

**డిశెంబర్** : సంపద వృద్ధి, అవమానకర సంఘటనలు, శత్రువుల వల్ల భయాందోళన మనోవ్యాకులం, పుత్రమూలక ధనలాభము.

జనవరి శీలము కాపాడుకొనవలెను. వితండవాదనలు, ఆత్మస్తుతి, పరనిందలు మానవలెను. మంచివాగి వల్ల కార్యసిద్ధి, స్త్రీ సౌఖ్యము, శుభవార్తాశ్రవణము, సుఖభోజనము, శుభకార్యచరణము.

ఫిబ్రవరి ఆర్థిక, నూతన వస్తు, వస్త్రలాభము, కుటుంబ ఆనందము, సంతతికై ఆరాటన, ఆలోచనలు, బంధుప్రయాణములు విద్యావాగ్ వివాదములు, విద్యాభివృద్ధి, కోర్టు వ్యవహారములు లాభములు, స్వరత్రా జయము.

మార్చి : అస్థిమితం, అలజడి. కంఠంనొప్పి, నోటిపూత, చెడుకలలు, వ్యధ, సర్వదాజయం, ఆనందం, లబ్ధి, గృహవృద్ధి, భక్తిశ్రద్ధలు.

* * *

# తులా రాశి



**(చిత్త: 3,4 పాదములు స్వాతి: 1,2,3,4 పాదములు విశాఖ: 1,2,3 పాదములు)**

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 8 | వ్యయం | - 11 |
| రాజపూజ్యం | - 1 | అవమానం | - 7 |

ఈ రాశివారికి గురుడు ఉగాది నుండి డిశెంబరు 9 వరకు 3ట సువర్ణమూర్తి, తదుపరి వత్సరమంతయూ 4ట తామ్రమూర్తి. శని వత్సరమంతయూ 11ట తామ్రమూర్తి. ఏప్రిల్ నుండి రాహు 4ట, కేతువు 10 ట రజితమూర్తులు.

ఈ రాశి వారికి శని లాభమునందు పరిపూర్ణయోగప్రదుడు. గురు, రాహు, కేతువుల సంచార ఫలితము అంతంత మాత్రము. పరుల సహకారముచే కార్యములు నెరవేరును. అనవసర ప్రసంగములు, చిక్కులు, తగాదాలు, శ్రమ, త్రిప్పుట, వర్గభేధములు, అసౌఖ్యము, నిద్రలేమి, ఆకస్మిక ధన లాభ వ్యయనులు, మోకాలు నొప్పులు, అనివార్య ప్రయాణములు, అధికార వత్తిడులు, శత్రు మిత్రత్వము, మిత్ర శత్రుత్వములు కలుగుచుండును. పరపీడనములధికము. మొత్తం మీద వృద్ధి. కళానైపుణ్యము, పరోపకారములు, పారిశ్రామికవృద్ధి. నూతన వ్యాపార కార్యోన్ముఖత.

కంఠము, నడుము నొప్పి, నరముల నిస్సత్తువ, సంవత్సరం మధ్యలో శస్త్రచికిత్సలు కలుగును. వ్యవహారములు తగ్గించుకోవలయును. అన్ని వర్గములవారు స్వధర్మమును పాటించిన సుఖము, జయము, లబ్ధి కలుగును.

వ్యాపారస్తులు నిలువలు తగ్గించుట మేలు. జాయింట్లు, స్పెక్యులేషనులు కలసిరావు. విద్యార్థులకు రెండవఛాన్సు చూడవలసి వచ్చును. గణితము, సైన్సు వారలకు పురోభివృద్ధి, ఫైనాన్స్, సినీ, వస్త్ర, యాంత్రిక వ్యాపారములు చేయు వారికి పరీక్షాకాలము. ఉపాధ్యాయులు, బ్యాంకింగ్, ఇంజనీరింగ్ ఉద్యోగస్తులకు అస్థిమితములు తప్పవు. భాషాకోవిదులు స్వయంవృత్తుల వారికి, సినీ నటగాయకులకు పురోభివృద్ధి, లబ్ధి, కోళ్ళఫారములు, ధాన్యము, కిరాణా రసాయన వ్యాపారులకు 5,7,8,11,3 మాసములు కాక, తక్కిన మాసములు లబ్ధి. భూ, గృహ నిర్మాణములు, శుభకార్యములు తప్పనిసరిగా ఫలించును. సంతాన సాఫల్యత, కిరాణా ధాన్యము, బంగారము, వస్త్రము వ్యాపారులకు 2,3,5,6,7,10,12 మాసములు విశేష లాభదాయకముగా ఉండును.

**ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 6. 4,5,8,9 సంఖ్యలు తేదిలు, అది, సోమ, శనివారములు** కలసిన యోగప్రదము. లక్ష్మీ, గణేశ, షణ్ముఖ, సాయి ఆరాధనలు విశేష ఫలితములను ఇచ్చును. "సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే శరణ్యే త్ర్యంబకేదేవీ నారాయణి నమోస్తుతే" అను మంత్రమును 108 లేక 27 పర్యాయములు నిత్యము పఠించిన దివ్యఫలము సిద్ధించును. సోమ, శనివార నియమములు, నవరత్నధారణ వలన మనః ప్రశాంతత, లక్ష్మీ వృద్ధి కలుగును. గృహనిర్మాణావరోధములు తొలుగును.

## నెలవారీ ఫలితములు

ఏప్రెల్ : కళత్రమూలక అనారోగ్యము. భూసంపద, వృద్ధి, భూసంబంధిత వృత్తి వ్యాపారములు కలసివచ్చును. ఈ మాసము శుభాశుభ మిశ్రమము.

మే : కుటుంబంలో కలతలు, కళత్ర అనారోగ్యము, అపనిందలు పడుట, బంధువుల వలన సర్దుబాటు, ధనమునకు లోటురాదు. మాసం చివరలో శుభకార్యాచరణ, మృష్టాన్నభోజనప్రాప్తి. వస్తులాభము, స్త్రీవాంఛ.

జూన్ : అనారోగ్యము సూచితము, అయిననూ ధైర్యము వీడరు, మాసాంతము నందు ఆరోగ్యమును పొంది సుఖముగ నుండగలరు. కష్టసాధ్యములుండును. ఉద్యోగ, వ్యాపారములందు పురోభివృద్ధి, ఉత్సాహము.

జూలై : మనోధైర్యము, వృత్తివ్యాపారముల యందు లాభము, మనోనైర్మల్యము. మంచి వాగిపల్ల ఆదాయము.

ఆగష్టు : లాభము, వ్యవహార జయము, ఆరోగ్యము కల్గును. మనోరంజకముగా ఉండును. సంతోషప్రదముగా ఉండును. సంతాన మూలక ధనలాభము.

సెప్టెంబర్ : ఆరోగ్యము తదుపరి వ్యయము. మాసం ద్వితీయార్థములో అనారోగ్యము, ఐశ్వర్యప్రాప్తి. మాసమంతయూ శుభాశుభ మిశ్రమము. స్త్రీ అసౌఖ్యం.

అక్టోబర్ : ధనవ్యయం, స్థానచలన సూచనలు. ఆరోగ్యముపట్ల జాగ్రత్త అవసరము. మాసం ద్వితీయార్థములో కొంత శాంతి లభించును. కోరికలు నిదానము. ఆత్మస్తుతి, పరనింద మానవలెను. సూర్య జపము, నవగ్రహ అభిషేకము చేయుట మంచిది.

**నవంబర్** : స్థానచలన సూచనలు ఏర్పడును. మనోభయం కలుగును. విచారము, సౌభాగ్యము, అనారోగ్యసూచనలు, సౌభాగ్యములు కలుగును. దైవకార్యాచరణములు కల్గును.

**డిశెంబర్** : మనోభీతి సంపద వృద్ధి, మనోవ్యధ, శత్రువుల వలన భయము, అయిననూ సుఖము ఉండును. భూగృహలాభములు, చతురత. చేయువృత్తి యందు లాభము, స్థిరవృద్ధి.

**జనవరి** : సంపద, దైన్యము, కార్యలాభము, బాకీలు వసూలగుట, సంతానాది ప్రయత్నములు సఫలత, పిరికివానివలె నుండుట, బంధుమిత్రు దర్శనములు.

**ఫిబ్రవరి** : అసౌఖ్యము, స్త్రీ వ్యతిరేకములు, భూమిలాభము, ప్రయాణములు, బంధుమిత్ర ఆగమనములు, రాజకీయ జయములు, పాండిత్య ప్రసంగాలు.

**మార్చి** : బుద్ధివికాసము, యంత్రలాభము, వాక్పటిమ, గౌరవము, ధనలాభము, స్త్రీ సౌఖ్యము. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరము.

* * *

# వృశ్చిక రాశి



**(విశాఖ: 4వ పాదము అనూరాధ: 1,2,3,4 పాదములు జ్యేష్ఠ: 1,2,3,4 పాదములు)**

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 14 | వ్యయం | - 2 |
| రాజపూజ్యం | - 4 | అవమానం | - 7 |

ఈ రాశివారికి ఉగాది నుండి డిశెంబరు 9 వరకు గురుడు 2ట రజితమూర్తి, తదుపరి వత్సరమంతయూ 3ట సువర్ణమూర్తి. శని వత్సరమంతయూ 10ట రజితమూర్తి. ఏప్రిల్ 30 నుండి వత్సరమంతయూ రాహువు 3ట, కేతువు 9ట లోహమూర్తులు.

వీరికి నవంబరు వరకు గురుడు ధన స్థానమున విశేష లాభప్రదుడు. ఏప్రిల్ 28 తేదిన అష్టమ కుజదోషము తొలగుట వలన ఆరోగ్య, ఆర్థిక, దాంపత్య, ఈతి బాధలు తొలగి, సత్ఫలితములు ఉండగలవు. ఇంకనూ ఇంద్రియ నిర్వీర్యత, కార్యస్తంభన, అకారణ సంచారాది దోషములు క్రమముగ తొలగును. కార్యశూరులూ, నిదానస్తులు, స్వాభిమానులూ అయిన ఈ రాశివార్లకు గురుబలముచే అన్నియునూ జయప్రదముగా, క్రియాశీల ఫలితము కలుగును. నవంబరు తరువాత దైన్యము, కళాహీనత, ఆతృత, అనాచారము, న్యాయస్థాన సందర్శన, జ్వరాది ఫలితములు సూచించబడుటచే రుద్రాభిషేకములు, గురువార నియమములు చేయుటచే పై విషయములు ఉపశమించును. శ్రమాధిక్యతచే కార్యసిద్ధి. సోదర వర్గ అనుకూలతచే ధైర్యము ఉత్సాహము కలుగును.

విద్యార్థులకు క్రమేణా ఉన్నతి కలుగును. ఉపాధ్యాయులకు భాషా కోవిదులకు, బోధనేతర ఉద్యోగులకు విశేష కాలముగా వుండును. పారిశ్రామిక వేత్తల పెట్టుబడులు భవిష్యత్తులో బంగారు బాట అగును. స్మగ్లింగ్, షేర్లు, కలప, లోహ వ్యాపారులకు, వైద్య, సినీ కళాకారులకు, స్వయం వృత్తుల వారికి పట్టిందల్లా బంగారమగును. ధాన్యము, కిరాణా, రసాయన, కోళ్ళు మత్స్య వ్యాపారులకు తాత్కాలిక వ్యాపారములు కలసి వచ్చును స్వయం వృత్తి వార్లకు, సినీ నట గాయకులకు, కళాకారులకు, ప్రశంసలు లబ్ధి. జాయింట్లు నిల్వలు షేర్లు అనుకూలించును. దుర్గాస్తోత్రము, మంత్రము వీరికి ఐశ్వర్యము నిచ్చును. సినీ పరిశ్రమవారికి అత్యంత యోగదాయకము.

**ఈ .రాశివారికి అదృష్ట సంఖ్య 9.1,2,6 సంఖ్యలు తేదీలు ఆది, సోమ, గురువారములు యోగప్రదములు.** నవగ్రహ అభిషేకములు, సుందరకాండ పారాయణ, ఆది, గురువార నియమములు చేయుటచే శుభకార్యసిద్ధి కుటుంబసౌఖ్యము, గృహనిర్మాణ లాభము ఆరోగ్యవృద్ధి కలుగును. అత్యంత యోగదాయకమైన కాలము అన్నిరంగముల పురోభివృద్ధి కల్గును.

స్త్రీలు గురు, శుక్రవార నియమములు మాతంగి, లక్ష్మి, సాయి పూజలు చేసిన భర్త, పుత్ర సౌఖ్యములు. శాంతి కలుగును. సంతతి విద్యా ఉద్యోగ సిద్ధి కలుగును.

## నెలవారీ ఫలితములు

**ఏప్రిల్** : అనారోగ్యము. ప్రభుత్వమూలక ఆర్థికపరమైన ఖర్చులు, చేయు వృత్తివ్యాపారముల యందు మందకొడి, ఆరోగ్య విషయమై శ్రద్ధ అవసరము. మాట పట్టింపులు, స్త్రీ వ్యతిరేకత కలుగును. సాయి, దత్తాస్తూతిచే నిర్మలత్వము.

**మే** : శత్రునాశనం, మనోవ్యాకులం శస్త్రభీతి, శుభాశుభ మిశ్రమము, శాంతి.

**జూన్** : ఋణభీతి, అనారోగ్య సూచనలు, మిత్ర కలహము, నూతన వస్త్రములు కొనుగోలు, శస్త్రచికిత్స, కష్టఫలితములు, సర్వత్ర వ్యతిరేకత.

**జూలై** : శుభాశుభ మిశ్రమము. ధైర్యము ప్రదర్శించెదరు. ఆరోగ్య విషయమై భయాందోళన, జాగ్రత్త అవసరము, ధనవ్యయము. సంఘసేవలు, కోరికలు.

**ఆగష్టు** : మనోధైర్యము, లాభము. ధనవ్యయము, వ్యాపారమూలక, మాసాంతము నందు ధైర్యము కోల్పోదురు. వ్యవహారములందు జాగ్రత్త.

సెప్టెంబర్ : లాభము ఆరోగ్యము, సంతోషము, మనసు సందలి భయము. వాహనలాభము వృద్ధి, విజ్ఞానలాభము.

అక్టోబర్ : ఆరోగ్యవృద్ధి ధనవ్యయము, మనోవిచారము పైకి సంతోషము. మాసం ద్వితీయార్ధములో ధనలాభము కలుగును. నూతన వ్యాపారములు పెట్టుబడులు, భూగృహ నిర్మాణములు, ప్రయత్నములు, సంతానము, విద్యా ఉద్యోగాలు.

నవంబర్ : ధనవ్యయం మాసం మధ్యలో స్థానచలనములు సూచితము. ఆరోగ్యము సరిలేకుండుట, ధనమునకు లోటురాదు. పెట్టుబడులు, ప్రణాళికలు. హడావుడి.

డిశెంబర్ : స్థానచలన సూచన బదిలీలు భయముగ నుండుట. ఆరోగ్య సమస్యలు మనోవిచారము. ధనమునకు ఇబ్బంది లేకుండుట, రాజభోగము, వివాహ ఉద్యోగలాభములు. శుభకార్య ప్రసంగములు, సద్గోష్ఠి.

జనవరి : వాక్చాతుర్యము, పౌరుషము, అనాచారము, రోగము, ధనవ్యయము, ఉద్యోగాది లాభము, హుందాతనము, ఆదాయవృద్ధి, శయ్యాభోగము, నూతన వస్తు వస్త్రలాభము.

ఫిబ్రవరి : సర్వత్ర ఆనందము, శుభప్రసంగాలు, బంధనము, బద్ధకము, పెద్దమనిషిగ చెలామణి, అన్నీ తెలిసినవారివలె, దేహపీడ, ఉపశమనములు.

మార్చి : సంతానాది జయము, స్త్రీసుఖము, పుణ్యకథా శ్రవణము, ప్రయాణ లాభములు, గృహాది అలంకరణ లాభము, చోర భయమున్నది తస్మాత్ జాగ్రత్త.

* * *

# ధనూ రాశి



**(మూల: 1,2,3,4 పాదములు, పూ.షా.: 1,2,3,4 పాదములు, ఉ.షా.: 1వ పాదము)**

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | - 2 | వ్యయం | - 11 |
| రాజపూజ్యం | - 7 | అవమానం | - 7 |

ఈ రాశివారికి గురుడు డిశెంబరు 9 వరకు జన్మమందు లోహమూర్తి తదుపరి వత్సరమంతయు 2ట రజితమూర్తి శనివత్సరమంతయు 9ట లోహమూర్తి ఏప్రిల్ 30 నుండి రాహువు 2ట, కేతువు 8ట సువర్ణమూర్తులు.

ఈ రాశివారికి ఏప్రిల్ వరకు సప్తమ స్థానమందలి కుజ దోషము తొలగినది. మరియు గురుని సంచార ప్రభావము అనుకూలత తక్కువ తరచు గమనములు, దడ, మనోవ్యాకులత, నిస్సత్తువ, మానసిక పీడ, స్వకీయ వ్యతిరేకత మున్నగు ఫలితములున్నను నైసర్గిక శుభ గురునిచే శుభకార్య ఆచరణలు, స్థిరాస్తి వృద్ధి, భవిష్యత్ ప్రణాళికలు, తీర్థయాత్ర సిద్ధి, ఆర్థికవృద్ధి, చిరకాల కార్యసిద్ధి, పుత్రాది విద్యా ఉద్యోగ సత్ఫలితములు, స్వల్ప చికిత్సలచే ఆరోగ్యవృద్ధి మున్నగు శుభఫలితములు పొందుదురు. నిత్యాన్నదానము గోచార ధర్మనిరతి వీరికి రక్ష పారిశ్రామిక నిర్మాణములు, నూతన వ్యాపారములు పురోభివృద్ధి చెందును. అన్ని రంగముల వ్యాపారులకు ముందంజ.

విద్యార్థులకు ఉన్నతి శాస్త్ర, భాషాకోవిదులు, గణితము విద్యార్థులకు శ్రద్ధ కలిగిన విశేషము. ఉపాధ్యాయులు, బ్యాంకింగ్, ఇంజనీరింగ్ ఉద్యోగులకు సమస్యలు పరిష్కరింపబడును. గణితము, సైన్సువారు అధికశ్రద్ధ కల్గివుండాలి.

సినీ, నట, గాయకులకు స్వయం వృత్తుల వారికి బంగారు బాట, జాయింటు, స్పెక్యులేషన్ నిదానించవలెను. అపరములు, కలప, ధాన్యము, నిత్యకృత్య వ్యాపారులకు లక్ష్మీవృద్ధి. కిరాణా, వస్త్రములు, ఫైనాన్స్, రసాయన జలచరములు, కోళ్ళు ఇతర వ్యాపారులకు సంవత్సర ప్రారంభాంత్యములందు కలసి వచ్చును. యంత్ర, సిమెంట్, షెల్ల వ్యాపారులకు అసౌఖ్యము. మొత్తంమీద ఈ రాశివారికి గత సంవత్సరము కంటె, ఉత్సాహము, ఆరోగ్యము, పురోభివృద్ధి కలుగును. శుభకార్యములు, భూగృహ నిర్మాణములు ఫలించును. మిత భాషణము మేలు.

**ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 3. 1,2,5,8 సంఖ్యలు ఆది, బుధ, శనివారములు** కలసి వచ్చును. రాహు, కేతువు జపములు, నవగ్రహాభిషేకములు, గురువార నియమములు, లక్ష్మీనారాయణ, దత్త పూజలు, విశేష ఫలితములు ఇచ్చును. స్త్రీలు, ముత్యము, పచ్చ ధరించిన గురు, మంగళవార నియమములు ఆచరించిన భర్త, పుత్ర సౌఖ్యములు, లక్ష్మీవృద్ధి శాంతి కలుగును.

మూల నక్షత్రమువారు గరుడపచ్చ, వైఢూర్యము, పూర్వాషాఢ నక్షత్రము వారు పచ్చ ఉత్తరాషాఢ నక్షత్రమువారు కెంపు ధరించిన మేలు.

## నెలవారీ ఫలితములు

ఏప్రిల్ : మాసాంతము వరకు వృత్తి వ్యాపారములయందు స్తంభన, కళత్రమునకు అనారోగ్యము, సంతానమూలకముగా ఖర్చు, నష్టము, మృష్టాన్నభోజనము. వస్త్రలాభము.

మే : కుటుంబంలోని వారితో కలహము. అనవసర భయాందోళనలు, అలంకార ప్రాప్తి, ధనలాభము, అనారోగ్యము.

జూన్ : శత్రువులు నశింతురు, అలంకార వస్త్రప్రాప్తి, ఋణములు ఉండును. మనశ్శాంతి లేకపోవుట, భయాందోళనలు, శాస్త్ర, వ్యవహారభయం.

జూలై : అలంకార వస్తుప్రాప్తి, మనోచింత. మాసాంతములో సంతోషము, అనారోగ్యము, వస్త్రలాభము, శస్త్రభీతి. పరామర్శలు, తప్పని ప్రయాణాలు

ఆగష్టు : అనారోగ్యము తదుపరి అధైర్యమును వీడి ధైర్యముగా నుందురు. సంతోషము, ధనవ్యయము. భాగ్యవృద్ధి, భవిష్యత్ప్రణాళికలు, ఆనందము.

సెప్టెంబర్ : మనోనిబ్బరము ధైర్యము, లాభము కలుగును. సంతోషకర విషయములు, సుఖము కలుగును. మాసమున విచారము, భయము.

అక్టోబర్ : లాభము కార్యజయము. ఆరోగ్యము, మనోవిచారము, పూర్వార్థములో సంతోషము, ఆనందము, ధనలాభము, సుఖభోజనము.

నవంబర్ : ఆరోగ్యము వృద్ధి అగును. ధనము ఖర్చు. మనోవిచారము, మాసాంతమున ఆరోగ్యసిద్ధి కలుగును. స్థానభ్రంశము, తలపోటు.

డిశెంబర్ : ధనవ్యయము స్థానచలనము లుండును. మనోవిచారము ఆరోగ్య సమస్యలు. భాగ్యము. దూర ప్రయాణములు, మిశ్రమ ఆరోగ్యము, ఆనందం, భూలాభం, కలహ ప్రియత్వం.

జనవరి : లాభము, శోషణము, దేహపీడ, యిష్టదేవతా సందర్శనము, కంగారు, కలత, అనవసరపు ఆలోచనలు, మొత్తం మీద వ్యాపారాదుల వలన లాభమే.

ఫిబ్రవరి : సోదరవర్గానుకూలత. స్వర్ణలాభము, మాట పట్టింపులు. దృష్టితీక్షణత, కార్యముల యందు శ్రద్ధ, నిలుపుదల, వ్యయప్రయాసలు, ఉదర గుప్తరోగములు, వస్తు కొనుగోలు నష్టం.

మార్చి : బంధకము, పాండిత్య ప్రకర్షణలు, కార్యలాభాలు, మిశ్రమఫలితాలు, అధికసుఖము, సుఖ భోజనము, ధనసౌఖ్యము, విజ్ఞాన లాభము.

* * *

# మకర రాశి



**(ఉత్తరాషాఢ: 2,3,4 పాదములు, శ్రవణం: 1,2,3,4 పాదములు, ధనిష్ఠ: 1,2 పాదములు)**

| | | | |
|---|---|---|---|
| **ఆదాయం** | **- 5** | **వ్యయం** | **- 5** |
| **రాజపూజ్యం** | **- 3** | **అవమానం** | **- 3** |

ఈ రాశివారికి డిశెంబరు 9 వరకు గురుడు 12ట సువర్ణమూర్తి తరువాత వత్సరమంతయు జన్మమందు లోహమూర్తి వత్సరమంతయు శని అష్టమందు తామ్రమూర్తి. వత్సరమంతయు రాహువు జన్మమందు, కేతువు 7ట రజితమూర్తులు గురు ప్రభావముచే తీర్థయాత్రలు, క్రతునిర్వాహణ. శుభకార్యసిద్ధి, నిదానించిన వ్యవహార నిలుపుదల ఆర్థిక ఇబ్బందులున్ననూ వృద్ధి కలుగును. సమయపాలన, కార్యదక్షత, స్నేహశీలత్వము గల వీరికి ఈ సంవత్సరమున భిన్నములు కలుగును. అకాలభోజనములు, కంగారు, అజీర్ణము, గుండెదడ మోకాలు నొప్పులు, కళావిహీనత ఆలోచనలు గంభీరత కలుగుచుండును.

మొత్తము మీద పరిశీలించగా కుటుంబములో ఒకరికి అనారోగ్యము శ్రమాధిక్యత, మిత్ర శత్రుత్వములు, అపనిందలు నీచ కార్య ఆలోచనలు, దాబుదర్పము కల్గుచుండును. ప్రత్యేకించి హనుమదుపాసన, నవరత్నధారణ, కాలసర్పశాంతి, దుర్గ, సుబ్రహ్మణ్య ఆరాధనలు ఏకాదశ రుద్రాభిషేకములు జరుపుట ద్వారా పై ఫలితముల నుండి కొద్ది ఉపశమనము పొందవచ్చు. విద్యార్థులకు పురోభివృద్ధిగా వుండును.

ఉపాధ్యాయులకు ఈ సంవత్సరము పరీక్షా కాలముగా వుండును. ఇతర ఉద్యోగులకు ఆకస్మిక దాడులు, న్యాయస్థాన దర్శనము, కల్గుచుండును. వ్యాపారులకు జాయింట్లు, నిల్వలు కలసిరావు. షేర్లు ఆకస్మిక ఫలితములుండును. ఆర్థిక లావాదేవీలు నిదానించి నిర్వహించవలెను. మాట, ఆరోగ్యము ముఖ్యము. రాజకీయము ఫలించును, శాస్త్రవేత్తలకు, స్వయం వృత్తులవారికి శ్రమచే గుర్తింపు లబ్ది కలుగును. స్థిరాస్తులు నెరవేరును. సినీ పరిశ్రమవారికి విశేషములు.

కిరాణా, ధాన్యము, రసాయనములు, వస్త్ర, ఫైనాన్స్ వ్యాపారులకు, సంవత్సరాంతమున బాగుండును. జలచరములు, కోళ్ళు, సిమెంటు, యాంత్రిక, కూరలు, వ్యాపారులకు విశేష ఫలితముండును. శాస్త్రకోవిదులు, స్వయం వృత్తివారు, నటగాయకులకు పరీక్షా కాలము. వ్యవసాయమున శ్రమ మిగులును. బంగారము ఫ్యాన్సీ, తైల వ్యాపారులకు మిశ్రమము.

**ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 8. 2,3,6 సంఖ్యలు తేదీలు సోమ, మంగళ, శుక్రవారములు** ఫలించును. మృత్యుంజయ జపములు, శివలింగ దర్శనములు, విష్ణు ఆరాధన, గోసేవ సౌఖ్యము నిచ్చును. భూగృహ నిర్మాణములు, శుభకార్యములందు నిదానము అవసరము. వాయిదా వేసిన మేలు. చండీ హోమములు, సర్ప సూక్త పారాయణ విశేష ఫలము నిచ్చును.

ఉత్తరాషాఢ వారికి పచ్చ, కెంపు, శ్రవణంవారు, ముత్యము, పుష్యరాగం, ధనిష్ఠవారు, పగడము, ముత్యము, ధరించిన మేలు. స్త్రీలు, గురు, శుక్రవారములు, సాయి బగళ లలితా పారాయణలు కుటుంబమున శాంతి, వృద్ధి నిచ్చును.

**నెలవారీ ఫలితములు**

**ఏప్రిల్** : ధైర్యము, ఉత్సాహము, శత్రుజయము, శిరోవేదన, సుఖము తగ్గును. వాహనములపై ఖర్చు పెట్టుట జరుగును. అర్థసిద్ధి, ప్రయాణ, వ్యవహారలాభము.

**మే** : సంఘములో అగౌరవము. ధననష్టము, సంతాన మూలకలాభము, కార్యసిద్ధి. అతిసర్వత్ర వర్జయేత్.

**జూన్** : మనోభీతి తదుపరి శత్రునాశనము. ధననష్టము కలిగిననూ కార్యము సిద్ధించుట జరుగును. పేరాశ, అశాంతి, సుతోదయము.

**జూలై** : (ఈ రాశి వారికి) అలంకార వస్త్ర, వస్తుప్రాప్తి. విచారము, ఋణములు, మనోవ్యాకులము, ప్రభువుల వలన భయము శతృనాశము స్త్రీ వ్యతిరేకము.

**ఆగష్టు** : ఋణములు చేయవలసివచ్చును. ఆరోగ్యము పట్ల శ్రద్ధ అవసరము. మనోవ్యాకులత, నూతన వస్త్రలాభము, ఉదరబాధ, శస్త్రచికిత్సలు సూచితము.

**సెప్టెంబర్** : అనారోగ్యము కలిగిననూ ధైర్యము ప్రదర్శింతురు. ధన, వస్తు వ్యయము, శస్త్రభీతి, ఆరోగ్యము, మనసులో భయము, జయము.

**అక్టోబర్** : మనోధైర్యము, లాభము వ్యవహారజయము. మధ్యలో భీతి, ధనము, అధిక ఖర్చు, విచారకర విషయములు, ద్వితీయార్థములో సంతోషము.

**నవంబర్** : వృత్తి వ్యాపారములలో లాభము. స్థిర ఆరోగ్యము, మనసునందు భయాందోళన, ఐశ్వర్యప్రాప్తి కలుగును. శుభమూలక వ్యయము.

**డిశెంబర్** : ఆరోగ్యము స్థిరముగ నుండును. ధనము వ్యయమగుట - భయాందోళనలు మనోవిచారము మూస మధ్యలో స్వల్ప అనారోగ్యము.

**జనవరి** : వ్యయము, స్థానభ్రంశము. రాజకీయ వ్యాపార వ్యతిరేకత, తీక్షణ దృష్టి, అధికార ప్రసంగాలు, మించిన ఖర్చులు, స్వయం వృత్తులవారికి మొత్తం మీద లాభమే.

**ఫిబ్రవరి** : భయభ్రాంతములు, సోదర పితృవర్గ అనుకూలత. చాతీ, కంటినొప్పి, క్రయవిక్రయముల వలన లాభము. పశులాభము, వ్యాపార భాగస్వాముల వలన యితిబాధలు, వ్యవహార విజయములు.

**మార్చి** : భయము, ధనక్షయం, గ్రహపీడలచే మనస్తాపము, సంపన్న కార్యభంగము, ఇతరులవలన మోసములు, వాగివలన నష్టము శాంతులు.

* * *

# కుంభ రాశి



**(ధనిష్ఠ: 3,4 పాదములు శతభిషం: 1,2,3,4 పాదములు పూర్వాభాద్ర: 1,2,3 పాదములు)**

| | | | |
|---|---|---|---|
| **ఆదాయం** | **- 5** | **వ్యయం** | **- 5** |
| **రాజపూజ్యం** | **- 6** | **అవమానం** | **- 3** |

ఈ రాశివారికి ఉగాది నుండి డిశెంబరు 9 వరకు గురుడు 11ట రజితమూర్తి తదుపరి వత్సరమంతయు 12ట సువర్ణమూర్తి శని సంవత్సరమంతయు 7ట, సువర్ణమూర్తి. రాహువు 12ట కేతువు అట సువర్ణమూర్తులు.

వీరికి గురు, కేతు బలముచే సంవత్సర పూర్వార్థము ఉత్సాహము, ధైర్యము, పుష్టి, వ్యవహార జయము, వర్చస్సు, ధనలాభము సన్మానము కలుగును. శుభ కార్యములు, నిర్మాణములందు మెలికలు. అసుఖము. చోరభీతి సూచించు చున్నవి. శని, రాహు సంచార ప్రభావముచే శస్త్ర చికిత్సలు, కళత్ర ఆరోగ్య లోపములు, నీరసము, చర్మవ్యాధులు, కార్యములందు బద్ధకము, ఆలస్యము, కల్గును. ఇతరులను నమ్మరాదు. స్వయం కృషిచే విజయము, కార్యసఫలత. కోరికలు తగ్గించవలెను. సంవత్సర ఉత్తరార్ధమున వ్యయమందలి నీచ గురునికి శాంతి జరిపించిన అపకారము జరుగదు. విద్యార్థులకు నూతన విద్యా ఉద్యోగములు ఫలించును. భవిష్యత్ బంగారుబాట అగును. చిన్న తరహా పెట్టుబడులు, తాత్కాలిక వ్యాపారులకు సమస్యలున్ననూ విశేష లాభములు కలుగును. గత సం॥ముల కంటె చాలా మేలు, ఉత్సాహము.

జాయింట్లు, నిల్వలు, షేర్లు, అనుకూలము కాదు. వ్యవసాయదారులకు వృద్ధి, విద్యార్థులకు ఆంగ్లము, సైన్సులందు అధికశ్రమ అవసరము. ఉపాధ్యాయులు, బ్యాంకర్లు, ఇంజనీర్లకు సంవత్సర పూర్వార్ధము మేలు. వైద్యము, న్యాయవాద వృత్తి వారలకు పట్టు, సినీ, నట గాయకులకు, శాస్త్ర కోవిదులకు ఆటంకములు. రాజకీయ నాయకులకు ఆశాభంగమే కాని పలుకుబడి పెరుగును.

చిత్రపరిశ్రమ, యాంత్రిక, వ్యాపారులు, సిమెంటు, గృహోపకరణములు, కాంట్రాక్టర్లు, ట్రాన్సుపోర్టు విద్యా వ్యాపారులకు సంవత్సర ప్రారంభమున ఒడి దుడుకులుగా ఉన్ననూ క్రమేణా పురోభివృద్ధి విశేషముగా కలుగును. కిరాణా, ముత్యములు, కోళ్ళు, ధాన్యము, వస్త్రము, ఫైనాన్స్ వ్యాపారులకు 5,6,9,10,12,2 నెలలు విశేషముగా కలసి వచ్చును. నిరుద్యోగులకు ఉద్యోగ ప్రాప్తి కలుగును.

**ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 8. 1,3,6,9 సంఖ్యలు సోమ, మంగళ, శుక్రవారములు** ఫలించును. ధనిష్ఠ వారికి పగడము, నీల పుష్యరాగము శతభిషం వారికి ఊదారంగు పుష్యరాగము, పూర్వాభాద్ర వారికి నీలము, పుష్యరాగము ధరించిన మేలు. సూర్య నమస్కారములు, సుందరకాండ, రామచంద్ర పూజలు, గురు, శనివార నియమములు కలసి వచ్చును. స్త్రీలు మహాలక్ష్మీ సాయి, విష్ణు నామము శుక్ర, శనివార నియమములు జరిపిన కుటుంబము నందు ఋణ విముక్తి సంతానాది అభివృద్ధి జయము కల్గును.

### నెలవారీ ఫలితములు

**ఏప్రిల్** : ఈ మాసమంతయూ కుంభరాశి వారికి తృతీయ రవి, శుక్రుల వలన ప్రభుత్వమూలక ఆదాయము, ప్రోత్సాహము కలుగును. సోదర సోదరీ వర్గములచే ఆదాయప్రాప్తి, భూవిషయక లాభం కలుగును. సుఖ భోజనము.

**మే** : సోదరమూలక ధనలాభము. మాతృవర్గము వారిచే అసౌఖ్యము. విద్యాభివృద్ధి, ధనలాభము, సంపద, అలంకార లాభము, క్షేత్రదర్శనము.

**జూన్** : సంఘములో అమర్యాద, విశ్వాసము తగ్గుట, భయము, శత్రుభయము, పుత్ర మూలకలాభము, ధనలాభము. శతృక్షయము, వస్తు వస్త్రలాభము.

**జూలై** : ధనమూలకమైన ఇబ్బందులు, ధననష్టము. శత్రునాశనము, కార్యముల యందు ఆటంకములు అయిననూ కార్యసిద్ధి. ధైర్యము, నీరసము.

**ఆగష్టు** : శత్రునాశము, ఋణములు చేయవలసి వచ్చుట, అలంకార వస్తు ప్రాప్తి, మనోదుఃఖములు, మనశ్శాంతి లేకపోవుట, భయాందోళనలు కలుగును.

**సెప్టెంబర్** : ధనము అధికముగా ఖర్చు అగును. అనారోగ్యము కలుగును మనోసౌఖ్యము, అనవసర భయము, నూతన వస్త్రలాభము. స్వరత్రజయం.

**అక్టోబర్** : ఆరోగ్యము పట్ల శ్రద్ధ అవసరము. మనోధైర్యము ప్రదర్శించెదరు. శస్త్రభీతి, సంతోషము. ద్వితీయార్థములో విచారము, క్షేత్రదర్శనము.

**నవంబర్** : మాసం ప్రారంభములో ధైర్యము ధనలాభము, వ్యయము, సుఖ సంతోషములు కలుగును. కార్యసిద్ధి, సుఖభోజనం, సుఖ నిద్ర. సుసంపన్న కార్యజయము.

**డిశెంబర్** : ధనలాభము ఆరోగ్యవృద్ధి ధనము వ్యయము మనసులో భయము. సంతోషము. వ్యవహార, సన్మిత్రలాభములు అనుకూల ప్రయాణములు, భాగస్వాములు వలన లాభము.

**జనవరి** : ముఖ్య వ్యవహారముల వలన జయము. శిరోవేదన, పిక్కలు, నరము నొప్పి, రక్తపోటు, అనవసర ప్రసంగ, ప్రయాణాలు.

**ఫిబ్రవరి** : సుఖశాంతులకై పరీక్షణ, సహనపరీక్ష, రాజదర్శనము, శుభకార్యములకై ధనవ్యయము, యత్నకార్యసిద్ధి.

**మార్చి** : ధన, విద్యావృద్ధి, నూతన కార్యలాభము, స్త్రీ సౌఖ్యము, లలితకళా ప్రియత్వము. నూతన పరిచయములు, అన్ని విషయములు చాలా బాగున్నాయి. జయమేగాని అప్రమత్తము కలిగివుండాలి.

* * *



## మీన రాశి

**(పూర్వాభాద్ర: 4వ పాదము ఉత్తరాభాద్ర: 1,2,3,4 పాదములు రేవతి: 1,2,3,4 పాదములు)**

| | | | |
|---|---|---|---|
| **ఆదాయం** | **- 2** | **వ్యయం** | **- 11** |
| **రాజపూజ్యం** | **- 2** | **అవమానం** | **- 6** |

**ఈ రాశివారికి** గురుడు డిశెంబరు 9 వరకు 10ట సువర్ణమూర్తి, తదుపరి వత్సరమంతయు 11ట రజితమూర్తి, సంవత్సరమంతయు రాహువు 11ట కేతువు 5ట లోహమూర్తులు. శని వత్సరమంతయు 6ట రజితమూర్తి.

**ఈ రాశివారికి** ఈ సంవత్సరము చాలా యోగవంతమైనది. గురు, శని, రాహుగ్రహ పరిశీలన చేయగా శుభ కార్య, క్రతు నిర్వాహణ, శత్రుజయము, వృత్తి, ఉద్యోగాల యందు ప్రమోషన్లు క్రియాశీలక వ్యవహారము లందు భూమిక వహించుట, మంత్రసిద్ధి,

**కార్యసాఫల్యత, సంతాన లాభము, సౌఖ్యము, వృత్తి పూర్వక** ప్రశంసలు కలుగును. కుజ సంచార ప్రభావముచే 5,6,8,10,1,2 **మాసములందు నడుము, ఉదరము నేత్రములు గుప్తస్థానములందు అనారోగ్యము, చికిత్సలు, ఋణములు కలుగుచుండును. శత్రు, మిత్రత్వములు, చిరకాలము నుండి స్తంభించిన కార్యములు అనుకూలత కలుగును.** నిరుద్యోగులకు ఉద్యోగప్రాప్తి, సినీ నిర్మాతలు, కళాకారులు, శాస్త్రవేత్తలకు, స్వయంవృత్తుల వారికి బంగారు బాట న్యాయవాదులు, వైద్యులు, ఇంజనీర్లు, ఉపాధ్యాయ వృత్తుల వారికి యత్న బదిలీలు, శ్రమతో కూడి ఫలితములు ఉండును. షేర్లు, స్పెక్యులేషన్లు, లాటరీలు కలసివచ్చును. వివాహ, భూగృహ నిర్మాణాలు అనుకూలించును. విద్యార్థులు ర్యాంకులు సాధింతురు. సైన్సు, ఆంగ్లము విద్యార్థులకు శ్రమాధిక్యత కలిగి ఉండవలెను. ఎరువులు, చిరువ్యాపారులు, కాటా వ్యాపారులు, ఫ్యాన్సీ వస్త్ర, ఫైనాన్స్ వ్యాపారులకు ఆకస్మిక తనిఖీలు, ఒత్తిడులు, కల్గుచున్ననూ లాభదాయకమే కాంట్రాక్టర్లు. రాజకీయ నాయకులు, రియల్ ఎస్టేట్ వ్యాపారులకు మెత్తని కాలము పట్టుదలకు పోరాదు. రైస్‌మిల్లర్లు, కోళ్ళు జలచరములు, యాంత్రిక వ్యాపారులకు మిశ్రమ ఫలితము. మిగిలిన వ్యాపారులకు 1,3,5,6,9,10,12,1 మాసములు విశేషలాభములు. సుబ్రహ్మణ్య ఆరాధన, విష్ణు దర్శనం వీరికి రుగ్మత్తులను తొలగించును. గతంలో పోగొట్టుతున్న కాంట్రాక్టులు ఉద్యోగములు తిరిగి పొందుదురు. లాభమునకు కొద్ది ఆటంకములు కల్గుచున్నను పురోభివృద్ధి, ఉత్సాహము కల్గును.

పూర్వాభాద్ర నక్షత్రమువారు శ్వేత పుష్యరాగము, ఉత్తరాభాద్ర నక్షత్రము వారు నీలము, పగడము, రేవతి వారు పచ్చ ధరించిన విశేష వృద్ధి కలుగును.

**ఈ రాశివారికి అదృష్ట సంఖ్య 3. 1,2,5,9 సంఖ్యలు, ఆది, సోమ, గురువారములు** యోగప్రదములు. లక్ష్మీ గణపతి, విష్ణు, దుర్గ పారాయణలు సల్పిన విశేషవృద్ధి. స్త్రీలు మంగళ శుక్రవార నియమములు, దుర్గ, లలిత, శివ స్తోత్రములు ఆచరించిన కుటుంబము శుభకార్య నిర్వహణ, సౌఖ్యము లక్ష్మీప్రాప్తి కలుగును.

## నెలవారీ ఫలితములు

ఏప్రిల్ : శరీర అనారోగ్యము, సుఖము తగ్గును. ధనస్థాన రవి, శుక్రుల వలన ప్రభుత్వమూలకముగానూ, స్త్రీ వలన సహాయము లభించును. లేఖనము.

మే : భయాందోళనలు. శత్రుభీతి, మనోవ్యాకులము అధికము ఉండును. తరచునీరసము, దురదలు.

జూన్ : సంపదవృద్ధి కలుగును. గౌరవభంగము కలుగును. సుఖసౌఖ్యము లున్ననూ మనోవ్యాకులము ఉండును. మౌనము మేలు.

జూలై : శత్రువులు వలన భయము. ధనమునకు ఇబ్బంది పడవలసి వచ్చును. పుత్రమూలక లాభము, మనోవ్యాకులత, మాసాంతమున ధనలాభము.

ఆగష్టు : భయాందోళనలు, శత్రువులపై జయము, ధనమునకు ఇబ్బంది. ధన నష్టము, కార్యములయందు. వ్యవహారములయందు జయము కలుగును.

సెప్టెంబర్ : శత్రువులపై జయము, ఋణబాధ, భయము, కార్య వ్యవహారముల యందు సిద్ధి, మనోవ్యాకులత వ్యవహారము వ్యయము, ధైర్యము కలుగును.

అక్టోబర్ : ఋణబాధ, అనారోగ్యము, మనోభీతి, దుఃఖము, మాసం ప్రారంభములో వస్త్రలాభము, ద్వితీయార్థములో ఆరోగ్యసిద్ధి, శుభసందర్శన.

నవంబర్ : ఆరోగ్య సమస్యలు కలుగును. మనోధైర్యము శస్త్రభీతి ఉండును. సంతోషకర సంఘటనలు జరుగును. మాసము మధ్యలో భయాందోళనలు కలుగును. భాగ్యరాజ్యస్థితి, స్థిరత్వము, ధర్మనిరతి, కుభోజనము.

డిశెంబర్ : ధైర్యము, ధనలాభము, ఆరోగ్య విషయమై జాగ్రత్త అవసరము. ధనవ్యయము జరుగుట మనశ్శాంతి సంతోషము కలుగును. ప్రయాణలాభము.

జనవరి : స్త్రీ అసౌఖ్యము, అలసత్వము, లాభ భంగములు, కార్యసిద్ధి, యంత్ర, మంత్రలాభములు, విద్యా ఉద్యోగలాభములు, బంధుమిత్ర లాభములు.

ఫిబ్రవరి : శ్రమతో కూడి జయము. సర్వలాభము, వ్యయములు, మిశ్రమ ఫలితము, ప్రతిపని కాటావలె. మంత్రసిద్ధి, సిద్ధులతో సంభాషణములు.

మార్చి : ఆరోగ్య, కవిత్వలాభములు, శ్రమ, సహనము పరీక్షించుట, ధనలాభము, అనవసర ప్రసంగము, ఋణవిముక్తి, ధనవ్యయ లాభములుండును, సంఘ గౌరవము, వ్యాపార పురోభివృద్ధి, శుభకార్యములు, లలితకళ, చర్చలందు పాల్గొందురు.

* * *

# వివాహాది శుభముహూర్తములు

ఈ సంవత్సరములో దోషరహితములైన, బలమైన శుభ ముహూర్తములు ఎక్కువగ లేవు. పాపగ్రహములు రాశి బాహుళ్యముగ సంచరించుటచే ముహూర్తములు తగ్గినవి. ఇందు వ్రాయబడిన వానికి స్వల్పదోషములున్నను, వాటికి పరిహారములను గమనించియే వ్రాయబడినవి. ఏకవింశతి మహాదోషములు, ఉపదోషములు, మీద చైత్ర, లత్తా, వేధలు మున్నగు వాటికిని దేశవ్యవస్థలను గమనించి వ్రాయబడినవి. కేవలము నిర్దుష్టమగు లగ్నములు సంవత్సరమునకు 3, 4 గూడ దొరకుట కష్టము. సుప్రసిద్ధ సిద్ధాంతులును చిరకాలమునుండి గుణదోషములను నిరూపణ చేయుటయు, వ్రాయుటయు గలదు. మరియు ప్రజాబాహుళ్యమునకు ఉపయోగించుకొనుటకు కొంతవరకు ముహూర్తములు వ్రాయబడినవి. సహృదయులు వాటిని గమనించి క్షీరనీర న్యాయముగా గ్రహించి ఆచరణ యోగ్యములగు వాటిని ప్రజలకు అందచేయవలసినదిగా మనవి చేయుచున్నాను.

- పంచాంగకర్త

## శుభముహూర్తాని

### చైత్రమాసము (7-4-2008 నుండి 05-5-2008 వరకు)

ఏప్రెల్ 7 సోమ. శుక్లప్రతిపత్ అశ్విని వత్సరాదిత్యేన నవవస్త్రాభరణ ధారణ రాజదర్శనాదీనాం వృషభోర ఉ.గం.9-15.

10 గురు. పంచమి రోహిణి అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార క్రయ విక్రయాదీనాం మేషో మతాంతర ఉ.గం.7-33 దోలారోహణస్య కర్కాటకో ర ప.గం.12-49.

11 శుక్ర. షష్ఠి మృగశిర అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార క్రయ విక్రయాదీనాం మేషో ర ఉ.గం.7-29.

14 సోమ. నవమి పుష్యమి (అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వ్యాపారాదీనాం) వృషభో ర ఉ.గం.8-46.

17 గురు. ద్వాదశి ఉత్తర వివాహ గృహారంభ ప్రవేశాదీనాం మీనో ర తె.గం.4-34 (7 చంద్రః).

18 శుక్ర. త్రయోదశి హస్త దోలారోహణస్య కన్యార సా.5-00.

20 ఆది. పూర్ణిమ చిత్ర అన్నప్రాశనస్య వృషభోర ఉ.గం.8-22 (నార్గలః).

21 సోమ కృష్ణప్రతిపత్ స్వాతి దోలారోహణ క్రయ విక్రయాదీనాం కన్యార సా.గం.4-47.

22 మంగళ. విదియ అనూరాధ వివాహ గృహారంభ ప్రవేశాదీనాం మీనో ర తె.గం.4-14.

23 బుధ. తదియ అనూరాధ అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ క్రయవిక్రయాదీనాం వృషభో వసుః ఉ.గం.8-10 దోలారోహణస్య కన్యార సా.గం.4-40.

24 గురు. చవితి మూల వివాహ గృహారంభాదీనాం మీనో మతాంర తె.గం.4-07.

25 శుక్ర. పంచమి మూల దోలారోహణ క్రయ విక్రయాదీనాం కన్యార సా.గం.4-32 పూ.షా. కూపారంభస్య మీనోర తె.గం.4-05.

27 ఆది. సప్తమి ఉ.షా. వివాహ గృహారంభ ప్రవేశాదీనాం మీనోర తె.గం.3-55.

30 దశమి బుధ ధనిష్ఠ అన్నప్రాశనో పనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ ప్రవేశ వ్యాపారాదీనాం వృషభోర ఉ.గం.7-25 శతభిష మిథునమపి ర ఉ.గం 10-35 వివాహ గృహారంభ ప్రవేశాదీనాం మీనో ర తె.గం.3-44.

### వైశాఖ మాసము (6-5-2008 నుండి 03-6-2008 వరకు)

మే 7 బుధ. విదియ రోహిణి అన్నప్రాశనస్య వృషభోర ఉ.గం.7-24 మిథునం రాజా ఉ.గం.10-07.

17 శని. త్రయోదశి చిత్ర దోలారోహణస్య కన్యా మతాంర ప.గం.3-07.

18 ఆది. చతుర్దశి స్వాతి అన్నప్రాశనస్య మిథునం మతాం ర ఉ.గం.9-23. దోలారోహణస్య కన్యామతాం ర ప.గం.3-02.

25 ఆది. పంచమి ఉ.షా. దోలారోహణస్య కన్యార ప.గం.2-33.

29 గురు. నవమి ఉ.భా. తులార సా.గం.6-04.

30 శుక్ర. దశమి ఉ.భా. కన్యార ప.గం.2-13.

**జ్యేష్ఠ మాసము (04-6-2008 నుండి 03-7-2008 వరకు)**

జూన్ 12 గురు. నవమి హస్త అన్నప్రాశనస్య మిథునం ర ఉ.గం.7-46.

13 శుక్ర. దశమి చిత్ర అన్నప్రాశనస్య మిథునం మతాం ర ఉ.గం.7-42.

19 గురు. పాడ్యమి మూల డోలారోహణస్య కన్యామతాం ర ప.గం.12-57.

22 ఆది. చవితి శ్రవణ డోలారోహణస్య కన్యామతాం ర ప.గం.12-45. తులా ర ప.గం.3-31.

28 శని. దశమి అశ్విని డోలారోహణస్య తులార ప.గం.3-08.

**ఆషాఢ మాసము (04-7-2008 నుండి 01-8-2008 వరకు)**

జూలై 4 శుక్ర. శు. పాడ్యమి పునర్వసు డోలారోహణస్య కన్యా ర ప.గం.11-59.

16 బుధ. త్రయోదశి మూల కన్యార ప.గం.11-11.

18 శుక్ర. పూర్ణిమ ఉ.షా. అన్నప్రాశనస్య కన్యార ప.గం.11-03.

19 శని. బ.పాడ్యమి శ్రవణ అన్నప్రాశనస్య కన్యార ఉ.గం.11-00.

23 బుధ. పంచమి ఉ.భా. అన్నప్రాశనడోలారోహణాదీనాం కన్యార ఉ.గం.10-43.

**శ్రావణ మాసము (2-8-2008 నుండి 30-8-2008 వరకు)**

ఆగష్టు 6 బుధ. పంచమి హస్త డోలారోహణ క్రయ విక్రయాదీనాం ధనూర సా.గం.4-41 చిత్ర గర్భాధాన గృహప్రవేశాదీనాం మీనో ర రా.గం.9-19 (6 శుక్రః).

8 శుక్ర. సప్తమి స్వాతి అన్నప్రాశన వివాహ గృహారంభాదీనాం కన్యాశుభ నవాంశకాలః ఉ.గం.10-08.

9 శని. అష్టమి అనూరాధ వివాహ గృహారంభ ప్రవేశాదీనాం మిథునం ర రా.గం.3-59.

10 ఆది. నవమి అనూరాధ అన్నప్రాశన వివాహ గృహారంభ వాణిజ్యాదీనాం తులా ర శుభనవాంశ ఉ.గం.10-39 డోలారోహణ క్రయ విక్రయాదీనాం వృశ్చికో మతాంర ప.గం.1-37.

20 బుధ. చవితి రేవతి డోలారోహణక్రయ విక్రయాదీనాం ధనుర్మతాం ర సా.గం.3-47 వివాహ గర్భాధాన యోః మేషోర రా.గం.10-54 (12 చంద్రః).

21 గురు. పంచమి రేవతి డోలారోహణ క్రయ విక్రయాదీనాం వృశ్చికో ర ప.గం.12-53 అశ్విని వివాహ నిషేకాదీనాం మేషోమతాం ర రా.గం.10-50 (లగ్నచంద్రః).

**భాద్రపద మాసము (31-8-2008 నుండి 29-9-2008 వరకు)**

సెప్టెం. 1 సోమ. విదియ ఉత్తర అన్నప్రాశనస్య తులా ర ఉ.గం.10-52.

4 గురు. పంచమి స్వాతి వృశ్చికో మతాం ర ప.గం.12-00.

11 గురు. ఏకాదశి ఉ.షా. డోలారోహణస్య వృశ్చికో ర ఉ.గం.11-30.

12 శుక్ర. ద్వాదశి శ్రవణ. ధనూర ప.గం.2-15.

13 శని. త్రయోదశి ధనిష్ఠ అన్న ప్రాశన డోలారోహణాదీనాం వృశ్చికశ్చేరః ఉ.గం.11-22 ధనూర ప.గం.2-11.

14 ఆది. చతుర్దశి శతభిష డోలారోహణస్య ధనూర ప.గం.2-07.

**ఆశ్వయుజ మాసము (30-9-2008 నుండి 28-10-2008 వరకు)**

అక్టో. 1 బుధ. విదియ స్వాతిడోలారోహణస్య క్రయ విక్రయాదీనాం ధనూర. ప.గం.1-03 వివాహస్య మిథునం ర రా.గం.12-28.

2 గురు. తదియ స్వాతి డోలారోహణ క్రయ విక్రయాదీనాంధనూర శుభనవాంశ ప.గం.12-0.

6 సోమ. సప్తమి మూల అన్న ప్రాశనక్రయ విక్రయాదీనాం వృశ్చికో ర ఉ.గం.9-52.

9 గురు. దశమి శ్రవణ విజయ దశమీత్సేన నూతన దస్త్రవ్యాపారాదీనాం విజయముహూర్త కాలః ప.గం.2-09 వివాహస్య వృషభోర రా.గం.9-08.

10 శుక్ర. ఏకాదశి ధనిష్ఠ వివాహస్య వృషభో మతాంర రా.గం.9-06 మిథునమపి ర. రా.గం.11-55.

11 శని. ద్వాదశి శతభిష డోలారోహణ క్రయ విక్రయాదీనాం ధనూర ప.గం.12-20 వివాహస్య వృషభోర రా.గం.8-58.

13 సోమ. చతుర్దశి ఉ.భా. అన్నప్రాశనస్య వృశ్చికో ర ఉ.గం.9-24.

15 బుధ. పాడ్యమి అశ్విని అన్నప్రాశన వివాహ వాణిజ్యాదీనాం వృశ్చికోర ఉ.గం.9-17 వివాహస్య మిథునమపి ర రా.గం.11-33.

18 శని. చవితి రేవతి డోలారోహణ క్రయ విక్రయాదీనాం ధనుర్మతాం ర ప.గం.11-54. మీనోర సా.గం.4-32 వివాహ గర్భాధానయోః వృషభోర రా.గం.8-32 వివాహస్య కన్యామతాం ర తె.గం.5-01.

19 ఆది. పంచమి మృగశిర వివాహ గర్భాధానయోః వృషభోర రా.గం.8-28 మిథునమపిచోరః రా.గం.11-29

## కార్తీక మాసము (29-10-2008 నుండి 27-11-2008 వరకు)

నవం. 1 శని. తదియ మూల వివాహస్య కన్యార తె.గం.4-05.

2 ఆది. చవితి మూల అన్నప్రాశన వైశ్యోపనయన వివాహ గృహారంభ వాణిజ్యాదీనాం వృశ్చికో ర ఉ.గం.8-05 ధనురపి ఉ.గం.10-54.

5 బుధ. సప్తమి ఉ.షా. అన్నప్రాశన వైశ్యోపనయన గృహారంభ ప్రవేశ వివాహ క్రయ విక్రయాదీనాం వృశ్చికో మతాం ర. ఉ.గం.7-53. ధనురపి, శుభనవాంశకాలః ఉ.గం.9-45 నిలు శ్రవణం వివాహ గర్భాధానయోః వృషభోర రా.గం.7-20 వివాహ గృహారంభ (ప్రవేశ దీనాం కన్యార రా.గం.3-49).

6 గురు. అష్టమి శ్రవణ అన్నప్రాశన వివాహాదీనాం వృశ్చికో ర ఉ.గం.7-49 ధనిష్ఠ వివాహ గృహ ప్రవేశాదీనాం వృషభోర రా.గం.7-16 వివాహ గృహారంభ ప్రవేశాదీనాం కన్యామతాం ర. తె.గం.3-47.

7 శుక్ర. నవమి శతభిష డోలారోహణ క్రయ విక్రయాదీనాం మీనశ్చోరః ప.గం.3-12 వివాహ గర్భాధాన గృహప్రవేశాదీనాం వృషభశ్చోరః రా.గం.7-12.

8 శని. దశమి శతభిష అన్నప్రాశన వైశ్యోపనయన వివాహ గృహారంభ ప్రవేశ క్రయవిక్రయాదేవతా ప్రతిష్ఠాదీనాం ధనూర. ఉ.గం.10-34.

9 ఆది. ఏకాదశి ఉత్తరాభాద్ర వివాహ గృహ ప్రవేశాదీనాం మిథునం మతాం ర రా.గం.9-58.

10 సోమ. ద్వాదశి ఉత్తరాభాద్ర అన్నప్రాశన వైశ్యోపనయన గృహారంభ ప్రవేశ వ్యాపారాదీనాం ధనూరాజా ఉ.గం.10-46, రేవతి గృహప్రవేశస్య మిథునం ర రాత్రి గం. 9-54.

15 శని. విదియ మృగశిర వివాహ గృహప్రవేశాదీనాం మిథునం ర రాత్రి 9-35 వివాహ గృహారంభ ప్రవేశాదీనాం కన్యామతాం ర తె.గం.3-11.

21 శుక్ర. నవమి వివాహ గృహప్రవేశాదీనాం కన్యావసుః రా.గం.2-49 వివాహ గృహారంభాదీనాం తులార తె.గం.5-34.

22 శని. దశమి ఉత్తర డోలారోహణ క్రయ విక్రయాదీనాం మీనోర ప.గం.2-14 వివాహగృహ ప్రవేశాదీనాం మిథునం చోరః రా.గం.9-05 హస్త వివాహస్య కన్యా మతాం ర రా.గం.2-43 (లగ్న చంద్రః) వివాహగృహారంభాదీనాం తులార తె.గం.5-30.

## మార్గశిర మాసము (28-11-2008 నుండి 27-12-2008 వరకు)

29 శని. వివాహస్య తులార తె.గం.5-02.

30 ఆది. తదియ మూల అన్నప్రాశన వివాహ క్రయ విక్రయాదీనాం ధనూర ఉ.గం.9-04.

డిశెం. 3 బుధ. పంచమి శ్రవణ అన్నప్రాశన వివాహ వ్యాపారాదీనాం ధనూర ఉ.గం.8-52 డోలారోహణస్య మీనోవసుః ప.గం.1-31, ధనిష్ఠ వివాహస్య తులార తె.గం.4-46.

4 గురు. షష్ఠి ధనిష్ఠ అన్నప్రాశన వివాహ వ్యాపారాదీనాం ధనుర్వసుః ఉ.గం.8-48 శతభిష వివాహస్య కన్యార రా.గం.1-54.

5 శుక్ర. సప్తమి శతభిష డోలారోహణ వ్యాపారాదీనాం మేషోర ప.గం.3-53, వివాహస్య మిథునం ర రా.గం.8-16.

7 ఆది. నవమి ఉత్తరాభాద్ర డోలారోహణ క్రయ విక్రయాదీనాం మీనో మతాంర ప.గం.1-14 వివాహ గృహ ప్రవేశాదీనాం మిథునం మతాం ర రా.గం.8-5.

8 సోమ. దశమి రేవతి గృహప్రవేశస్య మిథునం ర రా.గం.8-01.

11 గురు. చతుర్దశి రోహిణి వివాహ గృహప్రవేశాదీనాం మిథునం మతాం ర రా.గం.7-50.

12 శుక్ర. పూర్ణిమ రోహిణి ధనూర ఉ.గం.8-16 మృగశిర వివాహ గృహప్రవేశాదీనాం కన్యార రా.గం.1-23.

13 శని. బ.పాడ్యమి మృగశిర దోలారోహణ క్రయ విక్రయాదీనాం మీనోర ప.గం.12-51.

19 శుక్ర. సప్తమి ఉత్తర డోలారోహణ క్రయ విక్రయాదీనాం మేషోర ప.గం.3-00.

**పుష్య మాసము (28-12-2008 నుండి 26-1-2009 వరకు)**

31 బుధ. చవితి ధనిష్ఠ డోలారోహణస్య మీనోర ప.గం.11-41. మేషో ర ప.గం.2-13 వృషభోపి ర ప.గం.3-41.

జన. 3 శని. సప్తమి ఉత్తరాభాద్ర డోలారోహణస్య మీనోగ ఉ.గం.11-28.

9 శుక్ర. త్రయోదశి మృగశిర డోలారోహణస్య వృషభోర ప.గం.3-16.

17 శని. సప్తమి హస్త అన్నప్రాశనస్య మీనో ర ఉ.గం.10-34.

**మాఘ మాసము (27-1-2009 నుండి 25-2-2009 వరకు)**

28 బుధ. విదియ శతభిష వృషభోర ప.గం.1-50, మిథునంర ప.గం.4-41.

29 గురు. తదియ శతభిష డోలారోహణస్య మేషోమతాం ర ప.గం.12-18.

ఫిబ్ర. 5 గురు. దశమి రోహిణి అన్నప్రాశనస్య మీనో ర ఉ.గం.9-19. మృగశిర డోలారోహణస్య వృషభో ర ప.గం.1-19.

11 బుధ. విదియ ఉత్తర వివాహ గృహ ప్రవేశాదీనాం వృశ్చికో ర రా.గం.1-28.

12 గురు. తదియ ఉత్తర మీనో ర ఉ.గం.8-50, హస్త గృహారంభస్య ధనూర తె.గం.4-12.

13 శుక్ర. చవితి హస్త డోలారోహణ క్రయ విక్రయాదీనాం మిథునం వసుః ప.గం.3-36, వివాహ గర్భాధానయోః కన్యార రా.గం.9-14 (లగ్న చంద్రః) చిత్ర గృహప్రవేశస్య వృశ్చికో మతార రా.గం.1-19.

14 శని. పంచమి చిత్ర అన్నప్రాశన గృహారంభ క్రయవిక్రయాదీనాం మేషోర ఉ.గం.11-12, గర్భాధాన గృహప్రవేశాదీనాం కన్యాచోరః రా.గం.9-10, స్వాతి వివాహ గృహారంభాదీనాం ధనుర్మతాం ర తె.గం.4-05.

15 ఆది. షష్ఠి స్వాతి అన్నప్రాశనోపనయనాక్షర స్వీకర వివాహ గృహారంభ క్రయ విక్రయాదీనాం మేషో ర. ఉ.గం.10-58 (7 చంద్ర) డోలారోహణ క్రయ విక్రయాదీనాం మిథునం ర ప.గం.3-28, వివాహస్య వృశ్చికో మతాం ర రా.గం.1-11 (12 చంద్ర).

19 గురు. దశమి మూల వివాహ గర్భాధాన యోః కన్యారాజా రా.గం.8-50 వివాహస్య వృశ్చికో ర రా.గం.12-56, వివాహ గృహారంభాదీనాం ధనూర తె.గం.3-43 (లగ్న చంద్ర).

**ఫాల్గుణ మాసము (26-2-2009 నుండి 26-3-2009 వరకు)**

27 శుక్ర. తదియ ఉత్తరాభాద్ర వివాహ గర్భాధానయోః కన్యార రా.గం.8-19 (7 చంద్రః).

28 శని. చవితి రేవతి డోలారోహణ క్రయ విక్రయాదీనాం మిథునం ర ప.గం.2-39, వివాహ గర్భాధానయోః కన్యార రా.గం.8-15, అశ్విని వివాహ గృహారంభాదీనాం ధనుర్మతాం ర రా.గం.3-07.

మార్చి 1 ఆది. పంచమి అశ్విని అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ యాత్రా క్రయ విక్రయాదీనాం మేషో మతార ఉ.గం.10-13, డోలారోహణ క్రయ విక్రయా దీనాం వృషభోర ఉ.గం.11-42

4 బుధ. అష్టమి రోహిణి అన్నప్రాశన (వివాహ గృహారంభాదీనాం) మేషో వసుః ఉ.గం.10-01. వివాహ గృహ ప్రవేశాదీనాం కన్యార రా.గం.7-59.

5 గురు. నవమి మృగశిర అన్నప్రాశనోపనయనాక్షర స్వీకర వివాహ గృహారంభ ప్రవేశమునకుపారంభ దేవతా ప్రతిష్ఠా క్రయ విక్రయాదీనాం మీనో రాజా ఉ.గం.7-25.

6 శుక్ర. దశమి ఆర్ద్ర అశ్వలాయనోప నయనస్య మీనో ర ఉ.గం.7-21.

**7 శని. ఏకాదశి పునర్వసు అన్నప్రాశనోపనయ నాక్షర స్వీకర గృహారంభ క్రయ విక్రయాదీనాం. డోలారోహణ క్రయ విక్రయాదీనాం వృషభో ర ఉ.గం.11-17 పుష్యమి గర్భాధాన గృహప్రవేశాదీనాం కన్యాచోరః రా.గం.7-46.**

8 ఆది. ద్వాదశి పుష్యమి అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార గృహారంభ ప్రవేశ దేవతా ప్రతిష్ఠా క్రయ విక్రయాదీనా మీనో మతాంర ఉ.గం.7-13, అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార గృహారంభ క్రయ విక్రయాదీనాం మేషో మతాం ర ఉ.గం.9-44, డోలారోహణ క్రయ విక్రయాదీనాం వృషభోర ఉ.గం.11-11.

11 బుధ. పూర్ణిమ ఉత్తర అన్నప్రాశన వివాహ గృహారంభ క్రయ విక్రయాదీనాం మేషో ర ఉ.గం.9-31, వివాహ గృహప్రవేశాదీనాం కన్యార రా.గం.7-29. వివాహ గృహారంభ ప్రవేశాదీనాం ధనూర రా.గం.2-22.

12 గురు. బ.పాడ్యమి ఉత్తర అన్నప్రాశన వివాహ గృహారంభ ప్రవేశ దేవతా ప్రతిష్ఠా కూపారంభ క్రయ విక్రయాదీనాం మినోర ఉ.గం.6-56, హస్త అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ క్రయ విక్రయాదీనాం మేషో ర. ఉ.గం.9-27 (6 చంద్రః) వివాహ గర్భాధానయోః కన్యామతాం ర రా.గం.7-25 వివాహ గృహారంభాదీనాం ధనూర రా.గం.2-29.

13 శుక్ర. తదియ హస్త అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ క్రయ విక్రయాదీనాం మీనో ర ఉ.గం.6-52.

15 ఆది. పంచమి స్వాతి అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ క్రయ విక్రయాదీనాం మేషోమతాం ర ఉ.గం.9-17.

16 సోమ. పంచమి అనూరాధ గర్భాధాన గృహ ప్రవేశాదీనాం వృశ్చికశ్చోరః రా.గం.11-15.

19 గురు. అష్టమి మూల అన్నప్రాశన వివాహ గృహారంభాదీనాం మేషశ్చోరః ఉ.గం.9-01.

20 శుక్ర. నవమి ఉత్తరాషాఢ వివాహ గర్భాదీనాం గృహప్రవేశాదీనాం వృశ్చికోర రా.గం.11-00.

21 శని. దశమి ఉత్తరాషాఢ అన్నప్రాశనోపనయనాక్షర స్వీకార వివాహ గృహారంభ ప్రవేశాదీనాం వృషభోరాజా ఉ.గం.10-32.

* * *

## శుభముహూర్తములకు యోగ్యమగు తిథివార నక్షత్రలగ్నములను తెలుపు చక్రము

ఈ ముహూర్తములకు ఏకవింశతి మహాదోషములు లేక వుండవలెను. పాపగ్రహాక్రాన్త, వేధ, రాహిత్యము గూడా యుండవలెను.

| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషములు |
|---|---|---|---|---|---|
| నిషేకము | 2-3-5-7-10 | సో-బు-గు-శు | ఆ-రో-ఉ.ఫ.-హస్త-స్వా-అనూ-ఉ.షా.-శ్ర-శత-ఉ.భా. | వృ-మి-కట-కన్య-తు-ధ-మీ | లగ్నశుద్ధి మాఘాది పంచకము శుభము |
| గర్భాదానము | 2-3-5-7-10-13 | సో-బు-గు-శు | రో-మృ-పున-పుష్య-ఉ.ఫ.-హ-చి-స్వా-అనూ-ఉ.షా.-శ్ర-ధ-శ-ఉ.భా. | వృష-కట-కన్య-తు-ధ-మీ | 1-8 శుద్ధి పంచపర్వములు కూడవు. |
| పుంసవనము సీమంతము | 2-3-5-7 7-13 శు | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ.ఫ.-హ-చి-స్వా-అనూ-మూ-ఉ.భా. శ్ర-ధ-శత-ఉ.భా.-రే | మే-వృశ్చి-సిం లగ్నములు కాక ఇతర లగ్నములు శుభం | 4-8 మాసములు |
| జాతకర్మనామకరణం | 2-3-5-7 10-13 శు | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పు-ఉ.ఫ.-హ-స్వా-అనూ-ఉ.షా.-శ్ర-ధ-శత-ఉ.భా. | వృ-మి-కటక-కన్య-తుల-ధ-మీ | అష్టమశుద్ధి పక్షచ్ఛిద్రములు కూడదు |
| డోలారోహణం | 2-3-5-7-10-13 | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ.ఫ.-హ-చి-అనూ-ఉ.షా.-ఉ.భా.-రే | వృ-మి-కట-కన్య-తు-ధ-మీ | 1-3-5 మాసములు అష్టమశుద్ధి |
| అన్నప్రాశనం | 2-3-5-7-10-13 | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పు-ఉ.ఫ.-హ-చి-స్వా-అనూ-ఉ.షా. శ్రవ-ధ-శత-ఉ.భా.-రేవతి | వృ-మిథు-కన్య-కట-ధను-మీనం | 10 శుద్ధి పురుషులకు పరిమాసం . స్త్రీలకు బేసిమాసం. |
| కర్ణవేధ | 2-3-5-7-10-13 | సో-బు-గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-ఉ.ఫ.-హస్త-చి-అనూ-ఉ.షా.-శ్ర-ధ-ఉ.భా.రే | వృ-మి-కట-కన్య-ధ-మీనం | అష్టమ శుద్ధి 6-7-8 మాసములు |
| కేశఖండనము | 2-3-5-7-10-13 | సో-బు-గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-హ-చి-స్వా-శ్ర-ధ-శత-రే | వృ-మి-క-కన్య-తు-ధ-మీనం | ఉత్తరాయణం పూర్వయామం |
| అక్షరాభ్యాసము | 2-3-5-7-10 | సో-బు-గు-శు | అశ్వి-పున-పుష్య-హ-చి-స్వా-అనూ-శ్ర-రే | మే-కట-తు-మకర | అష్టమశుద్ధి ఉత్తరాయణం 5వ సం॥ |
| విద్యాభ్యాసము | 2-3-5-7-10 | ఆ-సో-బు-గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-ఆర్ద్ర-ఆశ్రే-హ-చి-స్వా-అనూ-మూ-శ్ర | కట-తుల-మక-మీన-మేషం | అష్టమ శుద్ధి అనధ్యాయరహితం |
| ఉపనయనము | 2-3-5-7-10 2-3-5 | బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉ.ఫ.-హ-చి-స్వా-అనూ ఉ.షా.-శ్ర-ధ-శ-ఉ.భా.-రే | వృష-మిథు-కటక-కన్య-ధను-మీనం | అష్టమ శుద్ధి అనధ్యయన కూడదు కేంద్రమున పాపులుండ కూడదు |
| వివాహం | 2-3-5-7-10-13 | బు-గు-శు | రో-మృ-మఖ-ఉ.ఫ.-హ-స్వా-అనూ-మూ-ఉ.షా.-ఉ.భా.రే | వృ-మి-కట-తు-కన్య-ధ-మీ | సప్తమ శుద్ధి |
| నూతనవస్త్రధారణం | 2-3-5-7-10-13 | బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-ఉ.ఫ.-హ-చి-స్వా-అనూ-మూ ఉ.షా.-శ-ధ-శత-ఉ.భా.-రే | వృష-మిథు-కట-కన్య తుల-ధను-మీనం | తృతీయ శుద్ధి |
| శంకుస్థాపనం | 2-3-5-7-10-13 | బు-గు-శు | అశ్వి-రో-మృ-పు-పుష్య-ఉ.ఫ.-హ-చిత-స్వా-అనూ-ఉ.షా.-శ్ర-ధ-శ-ఉ.భా.-రేవ | వృష-మిథు-కన్య-ధ-మీనం | చతుర్థ శుద్ధి, అష్టమ శుద్ధి |
| గృహప్రవేశం | 2-3-5-7-10-13 | బు-గు-శు | రో-మృ-ఉ.ఫ.-చి-అనూ-ఉ.షా.-ధ-శత-ఉ.భా.-రే | వృష-మిథు-కన్య-ధ-మీనం | వ్యయ, అష్టమశుద్ధి, వృషభకలశ చక్రశుద్ధి, స్థిరలగ్నము. |
| కూపారంభం | 2-3-5-7-10-13 | సో-గు-శు | రో-పుష్య-మృ-ఉ.ఫ.-హ-అనూ-ఉ.షా.-శ్ర-ఉ.భా. | కట-[illegible]-మీనం | లగ్నమున చంద్రశుక్రులు ఉత్తరం తూర్పు ఈశాన్యం శుభం |
| ప్రయాణం | 2-3-5-7-10-13 | సో-బు-గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-హ-అనూ-శ్ర-ధ-రే-మూల | మే-వృ-కట-కన్య-తు-ధ-మీ | వారశూలలు కూడదు. పంచమ శుద్ధి |
| బీజావాపనం | 2-3-5-7-10-13 | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పుష్య-ఉ.ఫ.-హ-స్వా-అనూ-ఉ.షా.-శ్ర-ధ-ఉ.భా.-రేవతి | వృష-మిథు-కట-కన్య-ధను-మీనం | విత్తనముల రంగు ననుసరించిన వారములు మంచివి. |
| క్షౌరం | 2-3-5-7-10 | సో-గు-శు | అశ్వి-మృ-పున-పు-హ-చి-స్వా-శ్ర-ధ-శత | వృష-మిథు-కట-తు-ధను-మీనం | భోజనానన్తరం కూడదు. భార్య 5 మాసముల గర్భవతిగా ఉండకూడదు |
| వాణిజ్యం | 2-3-5-7-10-13 | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పుష్య-హ-చి-అనూ-రేవ-ఉ.ఫ.-ఉ.షా.-ఉ.భా. | వృ-మిథు-కట-కన్య-తు-ధ-మీనం | లాభ స్థానమున శుభగ్రహము గాని, దృష్టిగాని శుభము. |

# అష్టసిద్ధాంతసార శుక్రఘడియలు - వాటి ఫలములు

ప్రతి దినము సూర్యోదయము నుండి 24 నిమిషములు చొప్పున ఫలితమును చూసుకొనవలెను. దీనికి తిథి నక్షత్రములతో పనిలేదు. దీని ననుసరించుట శ్రేయోదాయకమే. ఇచ్చట సూర్యోదయం 6 గంటలకు చూపడమైనది. అవే ఫలితములు తిరిగి సాయంత్రం నుండి మరునాడు ఉదయం వరకు కొనసాగును.

| గం॥ని॥ | గం॥ని॥ | ఆదివారము | సోమవారము | మంగళవారము | బుధవారము | గురువారము | శుక్రవారము | శనివారము |
|---|---|---|---|---|---|---|---|---|
| 6.00 | 6.24 | ప్రయాణకార్యసిద్ధి | కార్యహాని | ధనలాభం | దుర్వార్తలు | ధనలాభం | కార్యసిద్ధి | కార్యహాని |
| 6.24 | 6.48 | విద్యాజయం | రాజపూజ్యత | ప్రయాణజయం | మనఃక్షోభం | మనోభీష్టసిద్ధి | కార్యనాశనము | సౌఖ్యము |
| 6.48 | 7.12 | ఉద్యోగకష్టం | వాహన ప్రాప్తి | దుఃఖము | ధనలాభం | అనారోగ్యం | ధనలాభము | వివాహసిద్ధి |
| 7.12 | 7.36 | శత్రువృద్ధి | స్త్రీ సౌఖ్యము | ధాలభయము | యత్నకార్యసిద్ధి | వాహనప్రాప్తి | రాజానుగ్రహం | మిత్రత్వం |
| 7.36 | 8.00 | చోరభయం | భూలాభము | వాహనప్రాప్తి | కార్యభంగము | వివాహశుభం | అపజయం | ప్రయాణజయం |
| 8.00 | 8.24 | దుఃఖము | స్థానభ్రంశము | పరోపకారము | మహాభయము | సుఖనాశనం | కార్యజయం | వాహనలాభం |
| 8.24 | 8.48 | అభీష్టసిద్ధి | గుప్తధనలాభము | వస్త్ర ప్రాప్తి | మనశ్చాంచల్యం | ఉద్యోగజయం | దుఃఖం-భయం | కార్యజయం |
| 8.48 | 9.12 | సౌఖ్యం-లాభం | వ్యాపారజయం | ప్రయాణ నష్టం | ఉపద్రవములు | స్వామిదర్శనం | ధైర్యం | రాజసన్మానం |
| 9.12 | 9.36 | వివాహాది శుభాని | ఉద్యోగము | వివాదహాని | జయప్రదము | ప్రయాణభంగం | కష్ట-నష్టములు | కార్యనష్టం |
| 9.36 | 10.00 | మిత్రవృద్ధి | ప్రియభోజనం | శత్రుబాధ | ప్రయాణభయము | కార్యసిద్ధి | సౌఖ్యము | ప్రయాణహాని |
| 10.00 | 10.24 | మృత్యుభయం | స్త్రీ లాభము | స్త్రీ లాభము | రాజసన్మానము | వ్యాపారజయం | అనుకూలము | వస్త్ర-స్త్రీలాభాలు |
| 10.24 | 10.48 | ఆరోగ్యం | రాజదర్శనం | కార్యనాశనము | ధనధాన్యవృద్ధి | శత్రునాశం | వస్తువాహనప్రాప్తి | మనశ్చాంచల్యం |
| 10.48 | 11.12 | శుభకార్యజయం | కార్యభంగం | కష్టము | ఉద్యోగజయం | వివాహజయం | క్షేమం - లాభం | మిత్రనష్టం |
| 11.12 | 11.36 | ప్రయత్నఫలం | రోగపీడ | జంతుభయం | లాభము | రోగనాశం | కార్యవిజయం | మిత్రప్రాప్తి |
| 11.36 | 12.00 | విషభయం | కార్యసిద్ధి | అగ్నిబాధ | ప్రయత్నజయం | కలహప్రదం | శస్త్రభయం | స్త్రీ లాభం |
| 12.00 | 12.24 | ఉద్యోగం | శత్రునాశము | రోగపీడ | వస్త్రలాభం | ఉద్యోగ నష్టం | శత్రునాశనం | ధనలాభము |
| 12.24 | 12.48 | జ్వరప్రాప్తి | గో లాభము | పుత్రలాభము | సంతోషం | కోపతీవ్రత | అతిభయము | ప్రయాణజయం |
| 12.48 | 1.12 | రాజసన్మానం | కార్యజయము | కార్యజయము | క్షేమం | కార్యజయం | విద్యాసిద్ధి | ప్రయాణ నష్టం |
| 1.12 | 1.36 | ప్రయాణలాభము | ఆరోగ్యము | చిక్కులు | స్వల్పలాభం | స్థాననాశం | రోగబాధలు | క్షోమం |
| 1.36 | 2.00 | వివాదము | మిత్రత్వము | రాజసన్మానము | కలహము | చోరభయం | దుఃఖము | వాహనయోగం |
| 2.00 | 2.24 | మిత్రత్వము | సౌఖ్యము | ఒమ్మ్రు అగుట | ఇష్టసిద్ధి | వివాహకలహం | వాహనప్రాప్తి | జ్ఞానవృద్ధి |
| 2.24 | 2.48 | జ్వరభయము | కార్యభంగము | కార్యనష్టము | పుత్రలాభము | వివాదజయం | స్త్రీ లాభము | వినోదము |
| 2.48 | 3.12 | ధనలాభము | వివాహజయం | అపజయం | ఉద్యోగజయం | యాత్రాశుభం | స్ఫోటకపీడ | కలహము |
| 3.12 | 3.36 | బంధనం | కార్యప్రాప్తి | శత్రుజయం | ప్రయాణజయం | ధైర్యహాని | విషజంతుభయం | ఉద్యోగనష్టం |
| 3.36 | 4.00 | స్థానభ్రంశము | ధనలాభము | ఉద్యోగహాని | వ్యాపారజయం | కార్యభంగం | ప్రయాణకష్టం | ప్రయత్నజయం |
| 4.00 | 4.24 | విద్యాభంగము | విద్యాలాభము | జయప్రదము | వివాహశుభం | ప్రయాణక్షేమం | శత్రుభయం | మనస్తాపం |
| 4.24 | 4.48 | స్త్రీ భోగం | స్థిరకార్యనాశము | కార్యసిద్ధి | కార్యజయం | వివాహశుభం | కార్యనష్టం | శత్రునాశం |
| 4.48 | 5.12 | ప్రయాణ జయం | ఉద్యోగజయం | కార్యలాభం | మనఃక్లేశము | కలహప్రదం | ప్రయాణసౌఖ్యం | విరోధనాశనం |
| 5.12 | 5.36 | ప్రయాణ నాశము | యాత్రాప్రాప్తి | సుఖసౌఖ్యం | బంధుసమాగమము | జ్వరశస్త్రబాధ | దుఃఖము | ప్రయాణలాభం |
| 5.36 | 6.00 | భూలాభము | రాజభయం | మిత్రత్వము | వాహనప్రమాదం | విద్యాభివృద్ధి | రాజసన్మానం | ప్రియవార్తలు |

శ్రీరామయనమః

శ్రీ వేంకటేశాయనమః

# పంచాఙ్గ విషయ విజ్ఞానమార్గము

భారతదేశమున వేదాంగమగు జ్యోతిశ్శాస్త్రము ప్రతి మానవునకు అవసరమగు సాహాయ్యమును చేయుచున్నది. ఆ జ్యోతిశ్శాస్త్రము జాతకభాగము, ముహూర్తభాగము, సిద్ధాన్తభాగము అని మూడు విధములుగా ప్రచారములో నున్నది. ప్రతి మానవునకు 1. జాతకభాగము. భూతభవిష్యద్వర్తమాన రూపమగు త్రికాల విషయములను చెప్పుచు జీవయాత్రకు తోడ్పడుచున్నది. 2. ముహూర్తభాగము. కార్యసిద్ధిని శుభఫలములను సమకూర్చుచు సాహాయ్య మాచరించుచున్నది. 3. సిద్ధాంతభాగము. పంచాంగరూపముగా నేర్పడి, దైనందినయాత్రలో సర్వవిధముల సాహాయ్య మాచరించుచున్నది.

ఈ భాగములన్నియు కాలమునకు సంబంధించి యున్నవిగా తెలియదగియున్నవి. సమయవేత్తలు, ఆ కాలమును వత్సరము, అయనము, ఋతువు, మాసము, పక్షము, దినము అని ఆరు విధములుగా విభజించి ధర్మాచరణమునకు శ్రేయఃప్రాప్తికీ మార్గమును చూపియున్నారు.

## 1. వత్సరము - అయిదు విధములు

చాంద్రవత్సరము, సౌరవత్సరము, సావనవత్సరము, నాక్షత్రవత్సరము, బార్హస్పత్యవత్సరము.

**1. చాంద్రవత్సరము:** అనగా శుక్లప్రతిపత్ మొదలు దర్శాన్తములగు చైత్రాదిమాసములు 12 కలదై 354 దినములు కలిగియుండును. ఈ చాంద్రవత్సరము ప్రభవాది అరువది నామములు కలదైయున్నది.

**2. సౌరవత్సరము:** అనగా మేషాది ద్వాదశరాశులయందు రవి సంక్రమణముచే ఏర్పడి 365 దినములు కలిగియుండును.

**3. సావనవత్సరము:** అనగా మాసమునకు ముప్పది దినముల చొప్పున 360 దినములు కలదైయుండును. ఇది యుగాద్యంతరాది విభాగక్రమమును తెలియజేయును.

**4. నాక్షత్రవత్సరము:** అనగా అశ్విని మొదలు 27 నక్షత్రముల యందు చంద్రసంచారముచేత యేర్పడిన 12 మాసములు కలదై 324 దినములు కలిగి యుండును.

**5. బార్హస్పత్యవత్సరము:** అనగా మేషాది రాశులయందు బృహస్పతి సంచారముచేత యేర్పడి 361 దినములు కలిగి యుండును.

## 2. అయనము - రెండు విధములు: ఉత్తరాయణము - దక్షిణాయనము

**1. ఉత్తరాయణము:** అనగా సూర్యుని యొక్క మకర సంక్రమణము మొదలు ఆరు రాశులయందు సంచారముచేత యేర్పడునది. అప్పుడు భూమధ్యరేఖకు ఉత్తరముగా సంచరించును. (మాఘమాసము మొదలు ఆషాఢమాసము వరకు).

**2. దక్షిణాయనము:** అనగా సూర్యుని యొక్క కటక సంక్రమణము మొదలు ఆరు రాశులయందు సంచారముచేత యేర్పడునది. అప్పుడు భూమధ్యరేఖకు దక్షిణముగా సంచరించును. (శ్రావణమాసము మొదలు పుష్యమాసము వరకు).

## 3. ఋతువు - రెండు విధములు: సౌరము, చాంద్రము

**1. సౌరము:** అనగా సూర్యుని యొక్క రాశిద్వయ సంచారముచే యేర్పడి వసంతాది ఆరు నామములు కలిగియున్నది.

**2. చాంద్రము:** అనగా చైత్రాదిమాస ద్వయ రూపమై వసంతాది ఆరు నామములు కలిగియున్నది.

1. వసంతర్తువు, 2. గ్రీష్మర్తువు, 3. వర్షర్తువు, 4. శరదృతువు, 5. హేమంతర్తువు, 6. శిశిరర్తువు.

## 4. మాసము-నాలుగు విధములు: చాంద్రము-సౌరము-సావనము-నాక్షత్రము

**1. చాంద్రమాసము:** అనగా శుక్ల ప్రతిపత్ మొదలు దర్శాన్తముగాని కృష్ణప్రతిపత్ మొదలు పూర్ణిమాన్తముగాని చాంద్రమాసము అని రెండు విధములుగా నున్నవి. అది చైత్రాదినామములు కలిగియున్నది.

దర్శాన్తమాసము : ముఖ్య పక్షము : పూర్ణిమాన్తమాసము – వింధ్యకు ఉత్తరదేశము నందు గ్రహింపదగి యున్నది.

**2. సౌరమాసము:** అనగా కొందరు సూర్యుని మీనరాశి సంక్రమణము ప్రారంభించియు, కొందరు మేషరాశి సంక్రమణము ప్రారంబించియు, చైత్రాదిమాసములని చెప్పుచున్నారు.

**3. సావనమాసము:** అనగా ముప్పది దినములు గలదై యుండును.

**4. నాక్షత్రమాసము:** అనగా చంద్రుడు అశ్విని మొదలు 27 నక్షత్రములయందు సంచరించు కాలము.

## 5. పక్షము - రెండు విధములు: శుక్లపక్షము - కృష్ణపక్షము

**1. శుక్లపక్షము:-** అనగా శుక్లప్రతిపత్ మొదలు పూర్ణిమాంత్ర పక్షము (చంద్రునకు కళలు వృద్ధియగు దినములు).

**2. కృష్ణపక్షము:-** అనగా బహుళ ప్రతిపత్ మొదలు దర్శాంతపక్షము (చంద్రునకు కళలు తగ్గిపోవు దినములు).

**6. దినము:-** అనగా అరువది ఘడియల కాలము. అది సూర్యోదయము మొదలు తిరిగి సూర్యోదయము వరకు గల కాలము. ఇటుల ఆరు విధములగు కాలమును తెలియజేయుటకు ప్రవర్తించునది పంచాంగము. ఇది మానవులకు కల్పవృక్షము వంటిది. ఇట్టి పంచాంగమును వివరణములతోను, విశేషములతోను తెలియుటకు మార్గమును చూడుము.

**1. పంచాఙ్గము:** అనగా అయిదు అంగములు కలది. 1. తిథి, 2. వారము, 3. నక్షత్రము, 4. యోగము, 5. కరణము.

**తిథులు 15:-** 1. పాడ్యమి, 2. విదియ, 3. తదియ, 4. చవితి, 5. పంచమి, 6. షష్ఠి, 7 సప్తమి, 8. అష్టమి, 9. నవమి, 10. దశమి, 11. ఏకాదశి, 12. ద్వాదశి, 13. త్రయోదశి, 14. చతుర్దశి, 15. m పూర్ణిమ, 1 అమావాస్య.

**వారములు 7:-** 1. ఆదివారము, 2. సోమవారము, 3. మంగళవారము, 4. బుధవారము, 5. గురువారము, 6. శుక్రవారము, 7. శనివారము.

**నక్షత్రములు 27:-** 1. అశ్విని, 2. భరణి, 3. కృత్తిక, 4. రోహిణి, 5. మృగశిర, 6. ఆర్ద్ర, 7. పునర్వసు, 8. పుష్యమి, 9. ఆశ్లేష (ఆశ్రేష), 10. మఖ (మఘ), 11. పుబ్బ (పూర్వఫల్గుని), 12. ఉత్తర (ఉత్తరఫల్గుని), 13. హస్త, 14. చిత్త (చిత్ర), 15. స్వాతి, 16. విశాఖ, 17. అనూరాధ, 18. జ్యేష్ఠ, 19. మూల, 20. పూర్వాషాఢ, 21. ఉత్తరాషాఢ, (అభిజిత్), 22. శ్రవణం, 23. ధనిష్ఠ, 24. శతభిషం, 25. పూర్వాభాద్రా, 26. ఉత్తరాభాద్రా, 27. రేవతి.

**యోగములు 27:-** 1. విష్కంభం, 2. ప్రీతి, 3. ఆయుష్మాన్, 4. సౌభాగ్యం, 5. శోభనం, 6. అతిగండం, 7. సుకర్మ, 8. ధృతి, 9. శూలం, 10. గండం, 11. వృద్ధి, 12. ధ్రువము, 13. వ్యాఘాతము, 14. హర్షణము, 15. వజ్రము, 16. సిద్ధి, 17. వ్యతీపాత్, 18. వరియాన్, 19. పరిఘ, 20. శివం, 21. సిద్ధం, 22. సాధ్యం, 23. శుభం, 24. శుక్లం, 25. బ్రాహ్మం, 26. ఐంద్రం, 27. వైధృతి.

**కరణములు 11:-** 1. బవ, 2. బాలువ, 3. కౌలువ, 4. తైతుల, 5. గరజి, 6. వణజి, 7. భద్ర, 8. శకుని, 9. చతుష్పాత్, 10. నాగవం, 11. కింస్తుఘ్నం.

**సూచన :** పంచాంగములో ఈ తిథి, వార, నక్షత్ర, యోగ, కరణముల యొక్క ప్రథమాక్షరములను చూచి తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములుగా చదువుకొనవలయును.

### 2. ప్రతి సంవత్సరములందు అయా మాసముల వివరణము:

| చాంద్ర | సౌర | ద్రావిడ | శాలి | | ఇంగ్లీషు | |
|---|---|---|---|---|---|---|
| చైత్రము | మేషం | చిత్తి | చైత్ర | 30 | జనవరి | 31 |
| వైశాఖము | వృషభం | వైయ్యాశి | వైశాఖ | 31 | ఫిబ్రవరి | 28 |
| జ్యేష్ఠము | మిథునం | ఆని | జ్యేష్ఠ | 31 | మార్చి | 31 |
| ఆషాఢము | కర్కాటకం | ఆడి | ఆషాఢ | 31 | ఏప్రియల్ | 30 |
| శ్రావణము | సింహం | ఆవణి | శ్రావణ | 31 | మే | 31 |
| భాద్రపదము | కన్య | పెరటాశి | భాద్రపద | 31 | జూన్ | 30 |
| ఆశ్వయుజము | తుల | అల్పిశి | ఆశ్వన | 30 | జూలై | 31 |
| కార్తికము | వృశ్చికం | కార్తికి | కార్తికి | 30 | ఆగష్టు | 31 |
| మార్గశిరము | ధనుస్సు | మార్గళి | మార్గశీర్ష | 30 | సెప్టెంబరు | 30 |
| పుష్యము | మకరం | తై | పౌష | 30 | అక్టోబరు | 31 |
| మాఘము | కుంభం | మాసి | మాఘ | 30 | నవంబరు | 30 |
| ఫాల్గుణము | మీనం | పంగుని | ఫాల్గుణ | 30 | డిశంబరు | 31 |

**సూచన : శాలి, ఇంగ్లీషు నెలలలో ప్రక్కన గల సంఖ్యలు ఆ నెలలకు గల రోజులుగా తెలియవలెను.**

**3. చాంద్రమాసమున మాసనామనిర్ణయము ఇట్లు యేర్పడెను.**

| | | | |
|---|---|---|---|
| పూర్ణిమయందు | చిత్రా నక్షత్రముకల మాసము | : | చైత్రమాసము |
| ,, | విశాఖా నక్షత్రముకల మాసము | : | వైశాఖమాసము |
| ,, | జ్యేష్ఠ నక్షత్రముకల మాసము | : | జ్యేష్ఠమాసము |
| ,, | పూర్వాషాఢ, ఉత్తరాషాఢ నక్షత్రముకల మాసము | : | అషాఢమాసము |
| ,, | శ్రవణ నక్షత్రముకల మాసము | : | శ్రావణమాసము |
| ,, | పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రముకల మాసము | : | భాద్రపదమాసము |
| ,, | అశ్విని నక్షత్రముకల మాసము | : | ఆశ్వయుజమాసము |
| ,, | కృత్తిక నక్షత్రముకల మాసము | : | కార్తీకమాసము |
| ,, | మృగశిర నక్షత్రముకల మాసము | : | మార్గశిరమాసము |
| ,, | పుష్యమి నక్షత్రముకల మాసము | : | పుష్యమాసము |
| ,, | మఖ నక్షత్రముకల మాసము | : | మాఘమాసము |
| ,, | పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని నక్షత్రముకల మాసము | : | ఫాల్గుణమాసము |

**4. సౌరమాసమున మాసనామనిర్ణయము ఇట్లు యేర్పడెను.**

| | | | | |
|---|---|---|---|---|
| సూర్యుడు | మేషలగ్నమున | ప్రవేశించింది మొదలు | : | మేషమాసము |
| ,, | వృషభలగ్నమున | ,, | : | వృషభమాసము |
| ,, | మిథునలగ్నమున | ,, | : | మిథునమాసము |
| ,, | కర్కాటకలగ్నమున | ,, | : | కర్కాటకమాసము |
| ,, | సింహలగ్నమున | ,, | : | సింహమాసము |
| ,, | కన్యాలగ్నమున | ,, | : | కన్యామాసము |
| ,, | తులాలగ్నమున | ,, | : | తులామాసము |
| ,, | వృశ్చికలగ్నమున | ,, | : | వృశ్చికమాసము |
| ,, | ధనుర్లగ్నమున | ,, | : | ధనుర్మాసము |
| ,, | మకరలగ్నమున | ,, | : | మకరమాసము |
| ,, | కుంభలగ్నమున | ,, | : | కుంభమాసము |
| ,, | మీనలగ్నమున | ,, | : | మీనమాసము |

5. ద్రావిడమాసములు, సౌరమాసమునసనుసరించి సూర్యుడు మేషము, వృషభము మొదలగు లగ్నములయందు ప్రవేశించిన దినములయందే చిత్రి, వైయ్యాశి, మొదలగు మాసములు ప్రారంభమగుచున్నవి. చాంద్రమాసచ్ఛాయ ననుసరించి సామాన్యముగా ఆ మాసముల నామములు యేర్పడుచున్నవిగా భావించవలెను.

6. శాలిశకమాసములు, సౌరమానము ననుసరించి సూర్యుని యొక్క మేషసంక్రమణమునకు ముందుగా మేషాయనము ప్రారంభమగు చున్నది. ఆ మేషాయన ప్రారంభదినమే శాలిశక చైత్రమాస ప్రారంభదినము, ఇటులనే సూర్యుని యొక్క వృషభాది సంక్రమణమునకు ముందుగా వృషభాద్యయనములు ప్రారంభమగుచున్నవి. ఆ వృషభాద్యయన ప్రారంభదినములే శాలిశక వైశాఖాదిమాస ప్రారంభదినములగుచున్నవి. ఇటుల శాలిశక మాసములు సౌరమానము ననుసరించి ప్రారంభమగుట, చాంద్రమానము ననుసరించి చైత్ర వైశాఖాది నామములు యేర్పడుట అని తెలియదగియున్నది. ముఖ్యాంశ మేమన సూర్యుని యొక్క మేషాదిలగ్న సంక్రమణముల ననుసరించి ద్రావిడమాసములు చిత్రి, వైయ్యాశి అను మొదలగు మాసనామములు ప్రారంభమగుచున్నవి. సూర్యుని యొక్క మేషాద్యయనముల ననుసరించి శాలిశక మాసములు చైత్ర, వైశాఖ మొదలగు మాసములు ప్రారంభమగుచున్నవిగా తెలియదగి యున్నది. రెంటికీ మాసముల నామములు చాంద్రమానచ్ఛాయలోనే యేర్పడుచున్నవి గాని వేరుగాదు అని తెలియదగియున్నది.

7. 1. **చైత్రశుద్ధ పాడ్యమి** – చాంద్రమాస సంవత్సర ప్రారంభమగును. 2. మేషమాసము 1వ తేది సూర్యుని మేషసంక్రమణ ప్రారంభమే సౌరమాన సంవత్సర ప్రారంభమగును. 3. చిత్రి నెల 1వ తేది ద్రావిడ సంవత్సర ప్రారంభమగును. 4. సూర్యుని మేషాయన ప్రారంభమే చైత్ర 1వ తేది శాలివాహనశక వత్సరారంభమగును. 5. జనవరి 1వ తేది హూణశకవత్సర ప్రారంభమగును. ఇటులనే భారతదేశమున పలువిధములగు సంవత్సరములు, తత్ప్రారంభములున్నూ కలిగియున్నవి.

8. **విశేషములు** – హూణశక సంవత్సరములను నాలుగుచే భాగించిన శేషము సున్న వచ్చిన యెడల ఆ సంవత్సరమునకు లీప్ సంవత్సరమని పేరు. అట్లు లీప్ సంవత్సరములో ఫిబ్రవరి నెలకు 29 దినములు వచ్చును. శాలివాహనశక వత్సరములను నాలుగుచే భాగించిన శేషము రెండు వచ్చిన లీప్ సంవత్సరమునబడును. అట్లు లీప్ సంవత్సరములో చైత్ర 31 రోజులు – మామూలు సంవత్సరములో ఆచైత్ర 30 రోజులుకలదై యుండును. వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ, భాద్రపద – ఈ ఐదు నెలలలో ఎల్లప్పుడు ప్రతినెలకు 31 రోజులు ఉండును. మిగతా అశ్వీన, కార్తీక, మార్గశీర, పౌష, మాఘ, ఫాల్గుణ – ఈ ఆరు నెలలలో ఎల్లప్పుడు ప్రతినెలకు 30 రోజులుండును.

9. **సంవత్సరములు 60 :**

| | | | |
|---|---|---|---|
| 1. ప్రభవ | 16. చిత్రభాను | 31. హేమలంబి | 46. పరీధావి |
| 2. విభవ | 17. సుభాను | 32. విళంబి | 47. ప్రమాదీ |
| 3. శుక్ల | 18. తారణ | 33. వికారి | 48. ఆనంద |
| 4. ప్రమోద | 19. పార్థివ | 34. శార్వరి | 49. రాక్షస |
| 5. ప్రజాపతి | 20. వ్యయ | 35. ప్లవ | 50. నల |
| 6. ఆంగీరస | 21. సర్వజిత్ | 36. శుభకృత్ | 51. పింగళ |
| 7. శ్రీముఖ | 22. సర్వధారి | 37. శోభకృత్ | 52. కాళయుక్త |
| 8. భావ | 23. విరోధి | 38. క్రోధి | 53. సిద్ధార్థి |
| 9. యువ | 24. వికృతి | 39. విశ్వావసు | 54. రౌద్రి |
| 10. ధాత | 25. ఖర | 40. పరాభవ | 55. దుర్మతి |
| 11. ఈశ్వర | 26. నందన | 41. ప్లవంగ | 56. దుందుభి |
| 12. బహుధాన్య | 27. విజయ | 42. కీలక | 57. రుధిరోద్గారి |
| 13. ప్రమాథి | 28. జయ | 43. సౌమ్య | 58. రక్తాక్షి |
| 14. విక్రమ | 29. మన్మధ | 44. సాధారణ | 59. క్రోధన |
| 15. వృష | 30. దుర్ముఖి | 45. విరోధకృత్ | 60. క్షయ |

ఇవి పురాణప్రసిద్ధములగు సంవత్సరములుగా తెలియవలయును. ఇంగ్లీషు సంవత్సరములలో మార్చి, ఏప్రియల్ నెలలలో ఈ సంవత్సరములు ప్రారంభమగును. ఇంగ్లీషు సంవత్సరములలో మార్చి 22 తేది శాలివాహనశక వత్సరము ప్రారంభమగును.

10. **నవగ్రహములు 9 :** 1. సూర్యుడు, 2. చంద్రుడు, 3. కుజుడు, 4. బుధుడు, 5. గురువు, 6. శుక్రుడు, 7. శని, 8. రాహువు, 9. కేతువు.

11. **ద్వాదశరాశులు 12 :** 1. మేషము, 2. వృషభము, 3. మిథునము, 4. కర్కాటకము, 5. సింహము, 6. కన్య, 7. తుల, 8. వృశ్చికము, 9. ధనుస్సు, 10. మకరము, 11. కుంభము, 12. మీనము. ఈ రాశులను లగ్నములు అనియు, హోరలనియు వ్యవహరించు చున్నారు. ఈ ద్వాదశ రాశులలో 1,4,7,10 చరరాశులు, 2,5,8,11 స్థిరరాశులు, 3,6,9,12 ద్విస్వభావ రాశులుగా తెలియవలెను.

**ఈ ద్వాదశరాశులకధిపతులు :**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 మేషమునకు | 8 వృశ్చికమునకు | = కుజుడు | 5 సింహమునకు | | = | సూర్యుడు |
| 2 వృషభమునకు | 7 తులకు | = శుక్రుడు | 9 ధనుస్సుకు | 12 మీనమునకు | = | గురువు |
| 3 మిథునమునకు | 6 కన్యకు | = బుధుడు | 10 మకరమునకు | 11 కుంభమునకు | = | శని |
| 4 కర్కాటకమునకు | | = చంద్రుడు | | | | |

12. ఈ రాశులు నక్షత్రముల వలన యేర్పడుచున్నవి. ఎట్లు అనగా ఒక్కొక్క నక్షత్రమునకు నాలుగు పాదములు. అందుచే 27X4=108 పాదములు. ఈ పండెండ్రు రాశులకు 108 పాదములు చేర్పవలెను. 12X9=108 పాదములు గాన ఒక్కొక్క రాశికి 9 పాదములు చేరుచున్నవి. అనగా వివరణ మిట్లు:

| | | |
|---|---|---|
| 1. అశ్విని 4, భరణి 4, కృత్తిక 1 | = | 9 పాదములు మేషము |
| 2. కృత్తిక 3, రోహిణి 4, మృగశిర 2 | = | 9 పాదములు వృషభము |
| 3. మృగశిర 2, ఆర్ద్ర 4, పునర్వసు 3 | = | 9 పాదములు మిథునము |
| 4. పునర్వసు 1, పుష్యమి 4, ఆశ్లేష 4 | = | 9 పాదములు కర్కాటకము |
| 5. మఖ 4, పుబ్బ 4, ఉత్తర 1 | = | 9 పాదములు సింహము |
| 6. ఉత్తర 3, హస్త 4, చిత్ర 2 | = | 9 పాదములు కన్య |
| 7. చిత్ర 2, స్వాతి 4, విశాఖ 3 | = | 9 పాదములు తుల |
| 8. విశాఖ 1, అనూరాధ 4, జ్యేష్ఠ 4 | = | 9 పాదములు వృశ్చికము |
| 9. మూల 4, పూర్వాషాఢ 4, ఉత్తరాషాఢ 1 | = | 9 పాదములు ధనుస్సు |
| 10. ఉత్తరాషాఢ 3, శ్రవణం 4, ధనిష్ఠ 2 | = | 9 పాదములు మకరం |
| 11. ధనిష్ఠ 2, శతభిషం 4, పూర్వాభాద్ర 3 | = | 9 పాదములు కుంభము |
| 12. పూర్వాభాద్ర 1, ఉత్తరాభాద్ర 4, రేవతి 4 | = | 9 పాదములు మీనము |

**13. ఈ నక్షత్రముల వలన ఏర్పడు మహాదశలు వివరము :**

| | | | | |
|---|---|---|---|---|
| కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ | = ఈ 3 నక్షత్రములకు | రవిమహాదశ | 6 | సంవత్సరముల కాలము |
| రోహిణి, హస్త, శ్రవణము | = ఈ 3 నక్షత్రములకు | చంద్రమహాదశ | 10 | సంవత్సరముల కాలము |
| మృగశిర, చిత్ర, ధనిష్ఠ | = ఈ 3 నక్షత్రములకు | కుజమహాదశ | 7 | సంవత్సరముల కాలము |
| ఆర్ద్ర, స్వాతి, శతభిషం | = ఈ 3 నక్షత్రములకు, | రాహుమహాదశ | 18 | సంవత్సరముల కాలము |
| పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర | = ఈ 3 నక్షత్రములకు | గురుమహాదశ | 16 | సంవత్సరముల కాలము |
| పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర | = ఈ 3 నక్షత్రములకు | శనిమహాదశ | 19 | సంవత్సరముల కాలము |
| ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి | = ఈ 3 నక్షత్రములకు | బుధమహాదశ | 17 | సంవత్సరముల కాలము |
| మఖ, మూల, అశ్విని | = ఈ 3 నక్షత్రములకు | కేతుమహాదశ | 7 | సంవత్సరముల కాలము |
| పుబ్బ, పూర్వాషాఢ, భరణి | = ఈ 3 నక్షత్రములకు | శుక్రమహాదశ | 20 | సంవత్సరముల కాలము |

మహాదశలు మొత్తము 120 సంవత్సరములుగా తెలియపలసి యున్నది. ఈపై తెలిపిన నక్షత్రములలో జాతకుడు ఏ నక్షత్రములో జన్మించెనో ఆ నక్షత్రము జన్మనక్షత్రము, ఆ నక్షత్రమునకు చెప్పిన దశ జననకాల మహాదశగా తెలియవలయును.

14. భగణము - ద్వాదశరాశ్యాత్మక కాలచక్రము. ఇది రాశి భాగ లిప్త విలిప్తరూపములుగా గుణింపబడుచున్నది. అందు 60 విలిప్తలు 1 లిప్త. 60 లిప్తలు 1 భాగ. 30 భాగలు 1 రాశి, 12 రాశులు 1 భగణము. ఈ భగణము సప్తవింశతి నక్షత్రాత్మకమును అగుచున్నది చూడుము. భగణము = 12 రాశులు మరియు 27 నక్షత్రములు. నక్షత్రమునకు 4 పాదములు చొప్పున 108 పాదములు కలది అగుచున్నది.

(ప్రతిహోరయు సూర్యోదయము మొదలు ఒక్కొక్క గంటకాలము చొప్పున తిరిగి సూర్యోదయము వరకు జరుగుచుండును.)

| వారం | 6 మొ7వ | 7-8 | 8-9 | 9-10 | 10-11 | 11-12 | 12-1 | 1-2 | 2-3 | 3-4 | 4-5 | 5-6 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆది | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| సోమ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| మంగళ | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| బుధ | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |
| గురు | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| శుక్ర | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| శని | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| ఆది | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ |
| సోమ | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు |
| మంగళ | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర |
| బుధ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని |
| గురు | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య |
| శుక్ర | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర |
| శని | బుధ | చంద్ర | శని | గురు | కుజ | సూర్య | శుక్ర | బుధ | చంద్ర | శని | గురు | కుజ |

షరా : చంద్ర, గురు, శుక్రహోరలు శుభఫలమును, బుధ, కుజహోరలు మధ్యమఫలమును, సూర్య, శనిహోరలు అధమ ఫలమును ఇచ్చును. చంద్ర, గురు, శుక్ర హోరలయందు రాహుకాలముగా నుండినను కార్యానుకూలముగా నుండును. క్షీణ చంద్రుడు, పాపసహిత బుధుడు వీరుపాపులు అని తెలియవలసి యున్నది.

ఇటులనే తిథి, నక్షత్ర, యోగ, కరణములు కూడా సూర్య చంద్ర గమన, స్థితి, వైషమ్యముల చేతను, చంద్రస్థితి, గమనాదులచేతను, సూర్యచంద్రగతి స్థిత్యాదులచేతను, సూర్యచంద్రుల స్ఫుటరీతిచేతను యేర్పడుచున్నవి. ఇటుల పంచాంగము యేర్పడి యున్నది.

**విశేషము:** సూర్యుడు ద్వాదశరాశ్యాత్మక భచక్రమును పూర్ణముగా చుట్టివచ్చుటచేత 360 దినములు 12 మాసములు గల ఒక సంవత్సరము యేర్పడుచున్నది. ఇట్టి సంవత్సరములు 4,32,000 సంవత్సరముల పరిమితి గల కాలము కలియుగము, 8,64,000 సంవత్సరముల పరిమితి గల కాలము ద్వాపరయుగము, 12,96,000 సంవత్సరముల పరిమితి కాలము త్రేతాయుగము, 17,28,000 సంవత్సరముల పరిమితి కాలము కృతయుగము, ఈ నాలుగు యుగముల పరిమాణకాలము మొత్తము 43,20,000 సంవత్సరములు. ఇట్టి పరిమాణము గల కాలమును మహాయుగము అని చెప్పుచున్నారు.

ఇట్టి మహాయుగములు 71 అయిన కాలమును ఒక మనువు పరిపాలించుచున్నాడు. దానిని మన్వన్తరము అనుచున్నారు. ఇట్టివి 14 మన్వంతరముల కాలము సృష్టికర్తయగు బ్రహ్మదేవునకు ఒక పగలు అగుచున్నది. ఇటుల బ్రహ్మ యొక్క పగటి కాలము వెయ్యి మహాయుగములు (అనగా 432,00,00,000 సంవత్సరములు). ఇది ఉదయకల్పము అనియు ఇంత పరిమాణము గల రాత్రి కాలమును క్షయకల్పమనియు వ్యవహరించుచున్నారు.

1. ఉదయకల్పము అనగా ప్రపంచ రచనాకాలము (పగటి కాలము), 2. క్షయకల్పము అనగా బ్రహ్మ నిద్రించుకాలము (రాత్రికాలము). ఈ రెండు కల్పముల యొక్క పరిమితి కాలము 864,00,00,000 సంవత్సరములు. ఇట్లు ఉదయ క్షయకల్పములు రెండును సృష్టికర్తయగు బ్రహ్మకు అహోరాత్రమగుచున్నది. అనగా బ్రహ్మకు ఒకదినము. ఇట్టి 360 దినములు బ్రహ్మకు ఒక సంవత్సరమగుచున్నది.

ఇట్టి సంవత్సరములు నూరు (శత సంవత్సరములు) బ్రహ్మకు ఆయుర్భాగ్యము కలిగి యున్నది. అనాదియగు కాలమునందు ఒక సంకేతము ననుసరించి ఈ చతుర్ముఖ బ్రహ్మను 7వ బ్రహ్మగా చెప్పుచున్నారు. శ్రీ భారతమున శాన్తిపర్వమున వేదవ్యాసులవారు

వివరించినట్లు అఖిల హేయప్రత్యనీక కల్యాణ గుణాకరుండును, అఖిలవేదవేదాన్త వేద్యుండును, అఖిల చరాచర సృష్టిస్థితి లయకర్తయునగు శ్రీమన్నారాయణుని సంకల్పము వలన 1 మానవ జన్మ, 2. చాక్షుష జన్మ, 3. వాచిక జన్మ, 4. శ్రావణ జన్మ, 5. నాసిక జన్మ, 6. అండజన్మ గల ఆరుగురు సృష్టికర్తలు బ్రహ్మలు అనాదికాలంలో ఒక సంకేతకాలం నుంచి ఇప్పటికి గతించినారు.

ఇప్పుడు సప్తమ జన్మయగు (పద్మభూః) నాభికమలమున జన్మించిన చతుర్ముఖుడు సృష్టి కర్తృత్వమును స్వీకరించియున్నాడు. ఈ బ్రహ్మకు ఆయుర్భాగ్యమగు నూరు సంవత్సరములలో యేబది సంవత్సరములు గడచినవి. (దీనిని పూర్వపరార్థము అనుచున్నారు). ఇప్పుడు ద్వితీయ పరార్థము ప్రారంభమైనది. అనగా 51వ సంవత్సరము ప్రారంభమైనది. ఆ ప్రథమ సంవత్సరములో ప్రథమమాసము, ప్రథమపక్షము, ప్రథమ దినము జరుగుచున్నది. ఆ ప్రథమదినములో పగటికాలములో (ద్వితీయయామమున తృతీయ ముహూర్తము నందు) 13 ఘడియల 42 విఘడియల కాలము గతించినది.

ఈ సమయములోపల 1 స్వాయంభువ, 2 స్వారోచిష, 3 ఉత్తమ, 4 తామస, 5 రైవత, 6 చాక్షుష అను నామధేయములు గల 6గురు మనువులు ఒక్కొక్కరు 71 మహాయుగముల కాలమును పరిపాలించి గతించినారు. ఇప్పుడు 7వ మనువు అగు వైవస్వతమనువు పరిపాలించుచున్నాడు. ఈ వైవస్వతమనువుకు ఆయుర్భాగ్యముగా నేర్పడియున్న 71 మహాయుగముల కాలములో 28వ మహాయుగములో కలియుగము నడచుచున్నది. 4,32,000 సంవత్సరముల పరిమాణముగల ఆ కలియుగములో వర్తమానమున ఈ సంవత్సరము ప్రారంభమగుచున్నది- అని కాలవిజ్ఞాన సంపన్నులగు మహాశయులు శాస్త్రైకదృక్కులై తెలుసుకొని యున్నారు. ప్రాచీనులగు మన పూర్వులు అంతర్ముఖులై నియమ నిష్ఠాగరిష్ఠులై పరమేశ్వరోపాసన మొనరించి సర్వజ్ఞులగుటయే గాక వారి విజ్ఞానమును శాస్త్రములయందు నిక్షేపించి అర్వాచీనులగు మన పూర్వుల ద్వారా మనకందజేయుటచే నీ విజ్ఞానమును బడయగలుగుచున్నామని మనము సంతోషించవలసి యున్నది.

చాంద్రమాసము నందు యే మాసములు సూర్యుని సంక్రమణము లేక యున్నవో అనగా సౌరమాసము ప్రారంభము కానేరదో, మాసము యొక్క శుక్లపాడ్యమి మొదలు అమావాస్య వరకు సూర్యుడున్న రాశికి చలనములేదో ఆ మాసము అధికమాసముగా తెలియనగును.

చాంద్రమాసము నందు యే మాసమునందు సూర్యుడు రెండురాశుల యందు ప్రవేశించునో, అనగా రెండు సంక్రమణములుండునో ఆ మాసము క్షయ మాసముగా తెలియదగినది. దానిని రెండు మాసములుగా వ్యవహరించుచున్నారు.

సంక్రాన్తి శూన్యమగు మాసము అధికమాసము.

సంక్రాన్తిద్వయముతో కూడిన మాసము క్షయమాసము.

అధికమాసము - పూర్వ అధికమాసము మొదలు ముప్పది మాసములకు పైన 8వ మాసముగాని, 9వ మాసముగాని రాగలదు.

క్షయమాసము - 141 సంవత్సరములకుగాని 19 సంవత్సరములకు గాని రాగలదు. అధికమాసమువలె స్వల్పకాలమున రానేరదు. మరియు నా క్షయమాసము కార్తీకమాసముగాని, మార్గశిర మాసముగాని, పుష్యమాసముగాని కాగలదు. ఇతర మాసములు క్షయమాసములు కానేరవు.

యే సంవత్సరము నందు క్షయమాసము వచ్చుచున్నదో, ఆ క్షయమాసమునకు పూర్వము నందు ఒక అధికమాసమున్నూ పరమునందు ఒక అధికమాసమున్నూ తప్పక రాగలవు అని తెలియవలెను.

## సంక్రమణ పుణ్యకాల విజ్ఞానము

1. మేషరాశి యందు సూర్యుడు ప్రవేశించిన సంక్రమణమునకు విషువమని పేరు. ఈ సంక్రమణమునకు పూర్వము 10 ఘడియలకాలము, పరమునందు 10 ఘడియల కాలము, విషువ పుణ్యకాలము. ఆ పుణ్యకాలమునందు స్నానదానములు చేయుట పుణ్యముగా భావించవలెను.

2. వృషభమునందు సంక్రమణమునకు విష్ణుపదమని పేరు : పూర్వము నందు 16 ఘడియలు పుణ్యకాలము
3. మిథునమందు సంక్రమణమునకు షడశీతియని పేరు : పరము 16 ఘడియలు

4. కటకమునందు సంక్రమణమునకు అయనమని పేరు — పూర్వము 30 ఘడియలు
5. సింహమునందు సంక్రమణమునకు విష్ణుపదమని పేరు — పూర్వము 16 ఘడియలు
6. కన్యయందు సంక్రమణమునకు షడశీతి యని పేరు — పరము 16 ఘడియలు
7. తులయందు సంక్రమణమునకు విషువమని పేరు — పూర్వము 15 ఘడియలు, పరము 15 ఘడియలు
8. వృశ్చికమునందు సంక్రమణమునకు విష్ణుపదమని పేరు — పూర్వము 16 ఘడియలు
9. ధనుస్సుయందు సంక్రమణమునకు షడశీతి యని పేరు — పరము 16 ఘడియలు
10. మకరమునందు సంక్రమణమునకు అయనమని పేరు — పరము 40 ఘడియలు
11. కుంభమునందు సంక్రమణమునకు విష్ణుపదమని పేరు — పూర్వము 16 ఘడియలు
12. మీనమునందు సంక్రమణమునకు షడశీతి యని పేరు — పరము 16 ఘడియలు

ఈ విష్ణుపద, షడశీతి, విషువ, అయన అను నామములుగల సూర్యసంక్రమణ పుణ్యకాలములలో ఉత్తరోత్తరము పుణ్యమధికముగా తెలియవలెను.

**కృష్యారంభమునకు యుక్తకాలము**

**శ్లో ॥ మైత్రార్కత్రయరోహిణీ వసుమఘా దస్రోత్తరాంత్యాసురే ష్వాద్యార్కజ్ఞకవేర్దినేషు శుభదోమధ్యస్తు చాంద్రేదినే ।**
**త్వక్త్వారిక్తదినాని దగ్ధదివసాన్దర్శావమావైధృతి వ్యాఘాతవ్యతిపాతవిష్టిదివసాన్ శేషాః కృషౌ శోభనాః ॥**

**(జ్యోతిషఫలాభిధర్శిని)**

తా॥ అనూరాధ, హస్త, చిత్ర, స్వాతి, రోహిణి, ధనిష్ఠ, మఖ, అశ్విని, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి, మూల – ఈ నక్షత్రములును, భాను, భౌమ, బుధ, శుక్రవారములును, భూమి దున్నుట కారంభించుటచేత శుభము గలుగుననియును, సోమవారము మధ్యమమనియును, రిక్తతిథులును, దగ్ధతిథులును, పాడ్యమియును, అమావాస్యయును, అవమయును, వైధృతి, వ్యాఘాత, వ్యతీపాతయోగములును విష్టిని (భద్రవాకరణమును) అనువానిని విడిచిపెట్టి, మిగిలిన దినములయందు కృషిని చేయుటకు నూతనముగా ప్రవేశించుటచేత శుభములు గలుగును.

**ఏరువాకకు యుక్తకాలము**

**శ్లో ॥ శూర్పారేందుమఘాదితీ విధిహయశ్రీశత్రయత్ర్యుత్తరక్రవ్యాదాంత్యసమీరమిత్రగురుషు క్ష్మాజార్యశీక్ష త్విషామ్ ।**
**వారే స్యాద్ధలకర్మ గోంత్యయుగకన్యాచాపకీటే శుభం తౌళీసక్రఘటాజకర్కిహరిషు ప్రాణఘ్నసస్యక్షయౌ ॥**
**చోరత్రాపపశుఘ్న దాహభుజగత్రాసా భవేయుః క్రమాత్ ॥**

తా॥ విశాఖ, హస్త, మృగశిర, మఖ, పునర్వసు, రోహిణి, అశ్విని, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, రేవతి, స్వాతి, అనూరాధ, పుష్యమి – ఈ 18 నక్షత్రములయందును, కుజ, గురు, భానువారముల యందును, వృషభము, మీనము, మిథునము, కన్య, ధనుస్సు, వృశ్చికము ఈ లగ్నముల యందును కృషి కర్మ నారంభించుటచేత నానా విధములయిన శుభఫలములు గలుగును. తులాలగ్నము నందు కృషి కర్మ నారంభించిన ప్రాణహాని గలుగును. మకరమునందారంభించిన సస్యనాశనమును, కుంభమునందారంభించిన చోరభయమును, మేషము నందారంభించిన పశుహానియు, కర్కాటకము నందారంభించిన దహనమును, సింహమందారంభించిన యెడల సర్పముల వలన మనుష్యులకు భయమును గలుగునని తాత్పర్యము.

**చెఱకు, అరటి, మామిడి చెట్లు వేయుటకు యుక్తకాలము**

**శ్లో ॥ రేవత్యుత్తర రోహిణీ గురుకరాదిత్యేష నక్షంచ రే వాయౌ వారుణ వాజినోశ్చ శశిజేంద్వార్యేషు వారేషు చేత్ ।**
**వృక్షస్థాపన బీజవాపనహల ప్రారంభకార్యే శుభం కన్యాకర్కియుగోక్షిమీనమకరే సంపూర్ణ ధాత్రీఫలమ్ ॥**

తా॥ రేవతి, ఉత్తర, రోహిణి, పుష్యమి, హస్త, పునర్వసు, మూల, స్వాతి, శతభిషం, అశ్విని – ఈ పది నక్షత్రములును, గురు, బుధ, సోమవారములున్ను కన్యా, కర్కట, మిథున, వృషభ, మీన, మకర రాశులును అన్ని విత్తనములు నాటుటకు, కృషికర్మ నారంభించుటకు, విత్తనములు చల్లుటకు ప్రశస్తము లయినవి. పై చెప్పబడిన కార్యములను ముహూర్తములు చూచి ప్రారంభించిన సంపూర్ణముగా సకల సస్యములు ఫలించును.

## ఉల్లితోట వేయుటకు యుక్తకాలము

శ్లో ॥ రేవత్యశ్వినిమైత్రవాయువరుణాదిత్యేంద్రవిష్ణీజ్యమూ లార్కార్యేందుషు భానుసోమగురువారే ష్వేవ వృద్ధిప్రదమ్ ।
పూర్ణాయాం మృగమీనకర్కటధనుః కుంభేషు చార్కోదయే స్థాప్యం గృంజనముక్తమాహురితి వాసిష్ఠాత్రిగార్గ్యాదయః ॥

తా॥ రేవతి, అశ్విని, అనూరాధ, స్వాతి, శతభిషం, పునర్వసు, పుష్యమి. ఉత్తర, హస్త, జ్యేష్ఠ, శ్రవణము. మూల, మృగశీర్ష – ఈ పదమూడు నక్షత్రములున్ను ఆది, గురు, సోమవారములును, పంచమీ, దశమి, పూర్ణిమా తిథులున్ను మకర, మీన, వృశ్చిక, ధనుః కుంభములు – ఈ లగ్నములును ఉల్లి విత్తనములు పాతి పెట్టుటకు మేలని వశిష్ఠాది మహామునులు చెప్పిరని తాత్పర్యము.

## శెనగవిత్తనము మొదలగునవి చల్లుటకును, విత్తనములు కట్టకట్టుటకును యుక్తకాలము

శ్లో ॥ మూలాత్ర్యుత్తర వైష్ణవేంద్వదితివస్వంత్యాజ మైత్రానిలే ష్వేవం కర్కిధనుర్ఘట స్థిరగృహేష్వాహుశ్చ వారే శుభే ।
బీజవాపనమన్వహం చణక గోధూమాఢకానాం శుభం మూలాత్ర్యుత్తర మైత్ర శూర్పమఘ విష్ణ్వంత్యేజ్యభే బంధనమ్ ॥

తా॥ మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శ్రవణము, మృగశిర, పునర్వసు, ధనిష్ఠ, రేవతి, రోహిణి, అనూరాధ, స్వాతి – ఈ 12 నక్షత్రములయందును, కటకము, ధనుస్సు, తుల, వృషభము, సింహము, వృశ్చికము, కుంభము ఈ లగ్నములయందును, బుధ, గురు, శుక్రవారముల యందును శెనగ, గోధుమ, కందులు, ఈ విత్తనములు చేలయందు చల్లుటచేత అధికముగా ఫలించునని యెరుంగవలయును. మరియు మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనూరాధ, విశాఖ, మఖ, శ్రవణము, రేవతి, పుష్యమీ – ఈ పది నక్షత్రములయందు నానాజాతి విత్తనములను మూటలు కట్టిపెట్టుటచే నానా విధములగు శుభములు గలుగునని తాత్పర్యము.

## మౌఢ్యమందు జేయతగని కార్యములు

గురు, శుక్రులలో నెవరయినను అస్తంగతుఁడగుచుండగా బావి, కొలను, చెరువు త్రవ్వుట, యాగము గమనము, క్షురకర్మ, దేవతా ప్రతిష్ఠ, వివాహోపనయనములు, విద్యారంభము, నూతన గృహారంభము, కర్ణవేధ, మహాదానములు, పశువులు స్థాపించుట, పుణ్యతీర్థములు సేవించుట, నూతన మంత్రానుష్ఠానము చేయుట, పట్టాభిషేకములు మొదలయిన సమస్త శుభకర్మములు చేయుట వర్జింపవలయును. వివాహాది శుభకార్యములు క్షయమాసాధిక మాసములయందు కూడా చేయఁగూడదు.

## మౌఢ్యమందు జేయతగిన కార్యములు

ఆశ్లేషా, జ్యేష్ఠా. మూలాది గండనక్షత్రముల శాంతులకును, రోగసంబంధమైన జపహోమాది శాంతులకును, గ్రహశాంతికిని, అభిషేకము, సమస వ్రతములు, ఉత్పాతదోషములు మొదలగువాని శాంతులకును మాస ప్రయుక్తములగు పుంసవనాది కార్యములకును గురు శుక్రమౌఢ్యములు దోషములు కానేరవు.

## వాస్తు కర్తరీ విజ్ఞానము

సూర్యుడు భరణీ నక్షత్రము యొక్క మూడు, నాలుగు పాదములయందు సంచరించుచుండగాను, కృత్తికా నక్షత్రము 1,2,3,4 పాదములయందు సంచరించుచుండగాను, రోహిణీ నక్షత్రము యొక్క మొదటి పాదమునందు సంచరించుచుండగాను, ఆ కాలము కర్తరీ యను పేరుతో వ్యవహరింపబడుచున్నది.

## కర్తరియందు జేయతగని కార్యములు

కర్తరియందు చెట్లు నఱకుట, నారతీయుట, కృష్యారంభము చేయుట, విత్తనములు వేయుట, భూమిని త్రవ్వుట, క్రొత్త గ్రామమును కట్టుట, గృహమును కట్టుట, క్షౌరము చేసికొనుట, తోటలు వేయుట, చెరువులు, బావులు త్రవ్వుట క్రొత్తబండి నెక్కుట ఇట్టి కార్యములు చేయఁగూడదు.

## కర్తరియందు జేయతగిన కార్యములు

శ్లో ॥ మౌంజీబంధే వివాహే చ ప్రవేశే యజ్ఞకర్మణి ।
భరణీ కృత్తికా చైవ న దోషో మంటపాదిషు ॥

తా॥ కర్తరియందు ఉపనయనము, వివాహము, గృహప్రవేశము, యజ్ఞము, మంటపాదులు గట్టుట ఇట్టి కార్యములు చేయవచ్చును అని కొందరి అభిప్రాయము.

## ఆయా మాసములయందు శుభకార్యములకు వర్జించదగు తేదీలు

చిత్రి ౬-౧౫, వైయ్యాశి ౭-౧౬-౧౭, ఆని ౧-౬, ఆడి ౨-౧౦-౨౦, ఆవణి ౨-౯-౨౮, పెరటాశి ౧౬-౨౯, అల్పిశి ౬-౨౦, కార్తికి ౧-౧౦-౧౭, మార్గళి ౬-౯-౧౧, తై ౧-౨-౩-౧౧-౧౭, మాసి ౧౫-౧౬-౧౭, పంగుని ౬-౧౫-౧౭. ఈ తేదులలో పగలు శుభకార్యములు వర్జింపతగినవి. ఇది ద్రావిడాచారము.

## జన్మనక్షత్రమందు చేయతగిన కార్యములు

నిషేకము, యాగము, చౌలము, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, పట్టాభిషేకము, భూసంపాదనము, అక్షరాభ్యాసము – ఇట్టి కార్యములు చేయవచ్చును.

## జన్మనక్షత్రమందు చేయతగని కార్యములు

పుంసవనము, యుద్ధము, సీమంతము, గర్భాధానము, శ్రాద్ధము, క్షౌరము, ఔషధసేవ, ప్రయాణము, వివాహము ఇవి చేయగూడదు. మఱియును స్త్రీలకు వివాహ విషయమందు జన్మనక్షత్రము శ్రేష్ఠమని గ్రంథాంతరమందు జెప్పియుండుట వలన ఈ వివాహ నిషేధము పురుషుని విషయమని తెలియదగినది.

## లగ్నములయందు వదలతగిన కాలము

మేష, వృషభ, ధనుః, కన్యాలగ్నముల ఆదియందు భుజంగమను పేరుతోన్ను మీన, మకర, కర్కట, వృశ్చికముల కడపట రాహువను పేరుతోన్ను మిథున, కుంభ, తులా, సింహముల మధ్య భాగమందు గృధ్రమను పేరుతోను లగ్నత్యాజ్యము కలదు. కనుక త్యాజ్యకాలము అరఘడియ దానిని విడువవలయును. మరియు కాలవిధానమందు.

**శ్లో ॥ లగ్నస్యాదౌ విషం త్యక్త్వా పశ్చాత్కర్మాణి కారయేత్ ।**
**తల్లగ్నం వర్జయేద్ధీమాన్ లగ్నస్యాన్తే విషం యది ॥**

లగ్నమునకు ఆదియందు విషఘడియలు వచ్చినచో ఆ ఘడియలను మాత్రము త్రోసి శుభకర్మలు చేయవచ్చును. కడపట విషఘడియలు తగిలిన లగ్నమునే విడువవలయును.

## వార, తిథి, నక్షత్ర శూలలు

**తూర్పునకు** : మంగళవారం శుభము. శని, సోమవారములు పనికిరావు. 23 ఘడియలపై శూల దోషము లేదు. 1,9 తిథులు, జ్యేష్ఠ, ధనిష్ట నక్షత్రములు, తులా, కుంభ లగ్నములు కూడవు.

**పడమరకు** : బుధ, గురువారములు శుభము. ఆదిత్య, శుక్రవారములు దోషములు. ఈ శూలదోషము 22 ఘడియల తరువాత లేదు. 6,14 తిథులు, పుష్య, రోహిణీ నక్షత్రములు, ధనుస్సు, సింహము లగ్నములు కూడవు.

**ఉత్తరము** : ఆది, శుక్రవారములు శుభము. మంగళ, బుధవారములు దోషము. ఈ దోషము 25 ఘడియలు తరువాత లేదు. 2,10 తిథులు, హస్త, పుబ్బ నక్షత్రములు, వృషభ, కన్యా లగ్నములు కూడవు.

**దక్షిణము** : శని, సోమవారములు శుభము. గురువారము దోషము. ఈ శూల దోషము 22 ఘడియలు తరువాత లేదు. 5,13 తిథులు, శ్రవణం, అశ్వినీ నక్షత్రములు పనికిరావు, మీన, వృశ్చిక లగ్నములు కూడవు.

# వివాహ ప్రకరణము

**వివాహానంతరము చేయతగని కార్యములు**

**శ్లో ॥ కర్ణవేధన మౌంజ్యాది తీర్థయాత్రాది వేశ్మని । వ్రతోద్యాపనకర్మాణి నిందితాని మహర్షిభిః ॥**

కుటుంబమునందొకరికి వివాహము జరిగిన ఆరు మాసములలోగా చెవులు కుట్టుట, ఉపనయనము, తీర్థయాత్ర, వ్రతములు, ఉద్యాపనము మొదలైన కార్యములు పనికిరావు.

## వివాహ చక్రము - ఫలములు

| | | |
|---|---|---|
| ఈశాన్యం సకల సంపదలు | తూర్పు శుభము | ఆగ్నేయం వంశహాని |
| ఉత్తరం ధనము ధాన్యము | మధ్య దంపతులకు మరణం | దక్షిణం వైధవ్యం |
| వాయవ్యం స్త్రీ వ్యభిచారిణి | పశ్చిమం ఋణం, వ్యాధి | నైఋతి కులవృద్ధి |

**రేఖాస్తూర్ధ్వముఖాశ్చతస్ర ఉదితా, స్తద్వచ్చతిర్యఙ్ముఖాః**
**చక్రం స్యాన్నవకోష్ఠకం పరిణయేసూర్యాద్విధోర్భాంతకమ్ ।**
**మధ్యేప్రాగనలాది దిక్షువిలి ఖేత్రీణి క్రమాత్రీణి వై**
**తన్మధ్య స్థితికోష్ఠగ త్రయగతం హంత్యాశు తౌదంపతీ ॥**
**ప్రాగాద్యష్ట సుతత్క్రమాదతి శుభం తద్వంశ హానింతతో**
**వైధవ్యంకులవర్ధనం బహురుణవ్యాధి స్త్రియం జారిణీమ్ ॥**
**ధాన్యార్థేఽఖిల సంపదశ్చ కురుతేవైవాహికం చాంద్రభం**
**దైవం చక్రకదంబ మంత్రిపతినా శ్రీనందినే భాషితమ్ ॥**

తా॥ నిడుపుగా నాలుగు రేఖలును, అడ్డముగా నాలుగు రేఖలును లిఖింపగా తొమ్మిది గడులుగల వివాహ చక్రమేర్పడును. ఆ చక్రమునందు సూర్యుడున్న నక్షత్రము మొదలుకొని, మధ్యం, ప్రాక్, ఆగ్నేయాది క్రమముగా గడికి మూడు నక్షత్రముల చొప్పున 9 గడులకు (9X3=27) నక్షత్రములు లిఖించవలయును. అప్పుడు చంద్రుడున్న నక్షత్రము అనగా వివాహ ముహూర్త కాలిక చంద్ర నక్షత్రము, యే దిక్కున గడిలో నున్నదో తెలుసుకొనవలయును. ఆ దిక్కున ఏ ఫలము ఈ ఫల చక్రమున చూపబడినదో చూడుము. అది శుభఫలమేని, ఆ నక్షత్రమున వివాహము శుభప్రదము. ఈ చక్రమును, ఫలములను శివుడు నందికేశ్వరునకు చెప్పినాడు అని కాళిదాసు చెప్పుచున్నాడు.

**శ్లో ॥ అహిర్బుధ్న్య ద్వయేచైవ ప్రాజాపత్యత్రయే తథా ।**
**కృత్తి పుష్య విశాఖాసు నాడీదోషాన విద్యతే ॥**

ఉత్తరాభాద్ర, రేవతి, రోహిణీ, మృగశిర, ఆర్ద్ర, శ్రవణ, పుష్యమి, విశాఖా - ఈ నక్షత్రముల కేకనాడీ దోషములేదు. స్త్రీ పురుషులు కేకనాడీ కూడదు. రాక్షస వధువునకును, మానుష వరునకు వివాహము చేయవచ్చునను ప్రమాణములు.

***శ్లో ॥ యదిరక్షోగణో కన్యావరశ్చేన్మృగణోభవేత్, తదోద్వాహో గుణాధిక్యే కార్యస్త్వావశ్యకేసతి,***
***ద్విద్వాదశేవా నవపంచమేవా షష్ఠాష్టక రాక్షసకన్యకాయాః,***
***ఏకాధిపత్యే వృభయోస్సుహృత్త్వే పాణిగ్రహో మంగళమాతనోతి॥***

## వధూవరులకొకే నక్షత్రమైననూ వివాహము చేయదగిన నక్షత్రములు

రోహిణీ, ఆర్ద్ర, మఘ, విశాఖ, పుష్య, శ్రవణం, రేవతి, ఉత్తరాభాద్ర - ఈ నక్షత్రములు వధూవరులకొకే నక్షత్రమైననూ వివాహము చేయవచ్చును.

**అశ్వినీ, భరణి, ఆశ్లేష, పుబ్బ, స్వాతి, అనూరాధ, శతభిషం, మూల - ఇవి మధ్యమములు, మిగిలిన నక్షత్రములొక్కటి యైనచో జాయాపతికి నాశనము కలుగును.**

## వధూవరుల పొంతనములు

| నామాద్యక్షరములు | నక్షత్రము | పాదము | రాశులు | రాశ్యాధి పతులు | గణము | జంతువులు | నాడి | రజ్జు |
|---|---|---|---|---|---|---|---|---|
| చూ చే చో ల | అశ్విని | 4 | మేషం | కుజ | దేవ | గుఱ్ఱం | ఆది | పాద |
| లీ లూ లే లో | భరణి | 4 | మేషం | కుజ | మను | ఏనుగు | మధ్య | కటి |
| అ ఈ ఉ ఏ | కృత్తిక | 1-3 | మే-వృష | కు-శు | రాక్షస | మేక | అంత్య | ఉదర |
| ఓ వా వీ వూ | రోహిణి | 4 | వృషభం | శుక్ర | మను | పాము | అంత్య | కంఠ |
| వే వో కా కి | మృగశిర | 2-2 | వృష-మిథు | శు-బు | దేవ | పాము | మధ్య | శిరస్సు |
| కూ ఖ ఙ ఛ | ఆర్ద్ర | 4 | మిథునం | బుధ | మను | కుక్క | ఆది | కంఠ |
| కే కో హా హీ | పునర్వసు | 3-1 | మిథు-కట | బు-చం | దేవ | పిల్లి | ఆది | ఉదర |
| హూ హే హో డా | పుష్యమి | 4 | కటకం | చంద్ర | దేప | మేక | మధ్య | కటి |
| డి డూ డే డో | ఆశ్లేష | 4 | కటకం | చంద్ర | రాక్షస | పిల్లి | అంత్య | పాద |
| మా మీ మూ మే | మఖ | 4 | సింహం | రవి | రాక్షస | ఎలుక | అంత్య | పాద |
| మో టా టీ టూ | పుబ్బ | 4 | సింహం | రవి | మను | ఎలుక | మధ్య | కటి |
| టే టో పా పీ | ఉత్తర | 1-3 | సింహం-కన్య | రవి-బు | మను | గోవు | ఆది | ఉదర |
| పూ ష ణ ఢ | హస్త | 4 | కన్య | బుధ | దేవ | ఎనుము | ఆది | కంఠ |
| పే పో రా రీ | చిత్ర | 2-2 | కన్య-తుల | బు-శు | రాక్షస | పులి | మధ్య | శిరస్సు |
| రూ రే రో త | స్వాతి | 4 | తుల | శుక్ర | దేవ | దున్న | అంత్య | కంఠ |
| తి తూ తే తో | విశాఖ | 3-1 | తుల-వృశ్చి | శు-కు | రాక్షస | పులి | అంత్య | ఉదర |
| నా నీ నూ నే | అనూరాధ | 4 | వృశ్చికం | కుజ | దేవ | జింక | మధ్య | కటి |
| నో యా యీ యూ | జ్యేష్ఠ | 4 | వృశ్చికం | కుజ | రాక్షస | జింక | ఆది | పాద |
| యే యో బా బీ | మూల | 4 | ధనుస్సు | గురు | రాక్షస | కుక్క | ఆది | పాద |
| బూ ధా భా ఢా | పూ.షా. | 4 | ధనుస్సు | గురు | మను | కోతి | మధ్య | కటి |
| బే బో జా జీ | ఉ.షా. | 1-3 | ధను-మక | గు-శని | మను | ముంగిస | అంత్య | ఉదర |
| జూ జే జో ఖా | అభిజిత్ | | మకరం | శని | 0 | ముంగిస | 0 | 0 |
| ఖీ ఖూ ఖే ఖో | శ్రవణం | 4 | మకరం | శని | దేవ | కోతి | అంత్య | కంఠ |
| గా గీ గూ గే | ధనిష్ఠ | 2-2 | మక-కుంభ | శని-శని | రాక్షస | సింహం | మధ్య | శిరస్సు |
| గో సా సీ సూ | శతభిషం | 4 | కుంభం | శని | రాక్షస | గుఱ్ఱం | ఆది | కంఠ |
| సే సో దా దీ | పూ.భా. | 3-1 | కుంభ-మీన | శ-గురు | మను | సింహం | ఆది | ఉదర |
| దు శం ఛా థా | ఉ.భా. | 4 | మీనం | గురు | మను | గోవు | మధ్య | కటి |
| దే దో చా చీ | రేవతి | 4 | మీనం | గురు | దేవ | ఏనుగు | అంత్య | పాద |

కృష్ణ - మృగ 3, విష్ణు-స్వాతి ౧, శ్రీధరః-చిత్త ౪, క్షేత్రపాల-హస్త ౨, జ్ఞాన-ఆర్ద్రా ౩, భీమ-మూల ౩, భైరవ-పూ.షా. ౨, బ్రహ్మ-చిత్ర ౩-౪, ద్రోణ-స్వాతి ౧, ప్రభాకర-చిత్ర ౩-౪, ప్రహ్లాద-చిత్ర ౩-౪, ప్రాణ-ఉత్తర ౩, ద్రౌపది-స్వాతి ౩-ఇవి నామ నక్షత్రములు.

**షరా:** ఈ వధూవరుల పొంతనములు జన్మనక్షత్రముల ననుసరించి చూచుట యుక్తముగా భావించవలెను. జన్మ నక్షత్రములు లభించనప్పుడు నామ నక్షత్రములను ఉపయోగించవచ్చును. 30 సంవత్సరములకు పైన నామనక్షత్రములు ఫలదాయకములు అని శాస్త్రములు పక్షాంతరముగ చెప్పుచున్నవి. గాన వధూవరులను గూర్చి జన్మనక్షత్రములే పూర్తిఫలము లిచ్చును. నామనక్షత్రములైనను మానవుల అదృష్టానుసారముగా నామములేర్పడి నందువలన నక్షత్రము లేర్పడుచున్నవి గాని వేరు కాదు అని విచారించి పెద్దలు ఆ నామనక్షత్రములకు ఉపయోగమును చెప్పిరి.

# వధూవరగుణమేళన చక్రము (వరనక్షత్రము)

| వధూ నక్షత్రం | అశ్వి | భ | కృ 1 | కృ 3 | రో | మృ 2 | మృ 2 | ఆర్ద్ర | పున 3 | పున 1 | పుష్య | ఆశ్లే | మ | పు | ఉ.ఫ. 1 | ఉ.ఫ. 3 | హ | చి 2 | చి 2 | స్వా | వి 3 | వి 1 | అనూ | జ్యే | మూల | పూ.షా. | ఉ.షా. 1 | ఉ.షా. 3 | శ్ర | ధ 2 | ధ 2 | శ | పూ.భా. 3 | పూ.భా. 1 | ఉ.భా. | రే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 28 | 33 | 28 | 18 | 21 | 22 | 26 | 17 | 18 | 22 | 31 | 27 | 21 | 26 | 17 | 11 | 9 | 13 | 22 | 26 | 22 | 19 | 26 | 15 | 13 | 27 | 24 | 26 | 24 | 21 | 21 | 15 | 16 | 14 | 24 | 26 |
| భరణి | 34 | 28 | 29 | 19 | 22 | 15 | 18 | 26 | 26 | 30 | 23 | 24 | 21 | 19 | 28 | 21 | 19 | 6 | 14 | 29 | 22 | 19 | 17 | 19 | 20 | 20 | 27 | 28 | 26 | 10 | 10 | 20 | 24 | 22 | 16 | 28 |
| కృత్తిక 1 | 27 | 27 | 28 | 17 | 9 | 15 | 19 | 20 | 21 | 25 | 26 | 23 | 17 | 21 | 22 | 15 | 15 | 18 | 27 | 15 | 19 | 16 | 20 | 26 | 24 | 19 | 14 | 15 | 10 | 25 | 25 | 27 | 19 | 17 | 19 | 11 |
| కృత్తిక 3 | 18 | 18 | 19 | 28 | 19 | 25 | 16 | 17 | 18 | 22 | 23 | 20 | 19 | 23 | 24 | 21 | 21 | 23 | 22 | 10 | 14 | 21 | 25 | 31 | 20 | 13 | 9 | 14 | 10 | 23 | 29 | 31 | 23 | 20 | 22 | 14 |
| రోహిణి | 23 | 23 | 10 | 19 | 28 | 36 | 27 | 23 | 23 | 27 | 26 | 13 | 12 | 26 | 28 | 25 | 26 | 20 | 19 | 15 | 9 | 16 | 30 | 24 | 14 | 20 | 11 | 17 | 18 | 20 | 26 | 24 | 30 | 27 | 26 | 19 |
| మృగశిర 2 | 22 | 13 | 15 | 27 | 34 | 28 | 20 | 25 | 23 | 26 | 19 | 22 | 21 | 17 | 25 | 23 | 27 | 13 | 10 | 25 | 17 | 23 | 22 | 25 | 15 | 11 | 18 | 21 | 24 | 13 | 19 | 27 | 29 | 26 | 17 | 27 |
| మృగశిర 2 | 27 | 18 | 21 | 18 | 25 | 20 | 28 | 33 | 31 | 19 | 10 | 15 | 24 | 20 | 28 | 30 | 34 | 21 | 14 | 27 | 19 | 14 | 11 | 13 | 23 | 18 | 24 | 20 | 25 | 12 | 13 | 21 | 23 | 27 | 17 | 27 |
| ఆర్ద్ర | 19 | 27 | 21 | 18 | 24 | 26 | 34 | 28 | 25 | 13 | 20 | 13 | 23 | 29 | 22 | 24 | 24 | 27 | 20 | 27 | 20 | 13 | 17 | 4 | 16 | 27 | 27 | 22 | 22 | 17 | 18 | 11 | 13 | 19 | 27 | 27 |
| పునర్వసు 3 | 19 | 26 | 22 | 19 | 23 | 24 | 32 | 24 | 28 | 16 | 23 | 16 | 22 | 27 | 21 | 23 | 24 | 25 | 18 | 27 | 21 | 13 | 20 | 5 | 13 | 26 | 27 | 27 | 23 | 17 | 18 | 11 | 17 | 19 | 27 | 28 |
| పునర్వసు 1 | 21 | 28 | 23 | 20 | 24 | 25 | 19 | 10 | 14 | 28 | 35 | 28 | 15 | 20 | 14 | 18 | 18 | 20 | 20 | 27 | 20 | 19 | 26 | 10 | 8 | 20 | 21 | 28 | 27 | 21 | 12 | 7 | 11 | 17 | 25 | 25 |
| పుష్యమి | 30 | 21 | 26 | 23 | 24 | 17 | 10 | 18 | 21 | 35 | 28 | 30 | 18 | 14 | 23 | 26 | 27 | 12 | 11 | 26 | 21 | 20 | 19 | 22 | 17 | 11 | 22 | 26 | 25 | 13 | 4 | 14 | 18 | 24 | 18 | 27 |
| ఆశ్లేష | 25 | 23 | 22 | 19 | 12 | 21 | 13 | 12 | 15 | 28 | 28 | 28 | 15 | 15 | 17 | 20 | 20 | 26 | 25 | 11 | 16 | 15 | 20 | 26 | 22 | 16 | 8 | 12 | 13 | 27 | 18 | 18 | 12 | 18 | 20 | 12 |
| మఖ | 21 | 21 | 17 | 18 | 11 | 19 | 22 | 22 | 21 | 16 | 18 | 16 | 28 | 30 | 26 | 16 | 16 | 22 | 25 | 11 | 17 | 24 | 26 | 34 | 24 | 21 | 11 | 5 | 4 | 18 | 24 | 25 | 18 | 17 | 18 | 12 |
| పుబ్బ | 27 | 19 | 21 | 22 | 25 | 17 | 20 | 28 | 27 | 22 | 16 | 16 | 30 | 28 | 34 | 24 | 22 | 8 | 11 | 25 | 19 | 26 | 24 | 24 | 19 | 19 | 27 | 21 | 18 | 4 | 11 | 19 | 24 | 23 | 16 | 24 |
| ఉ.ఫల్గుని 1 | 18 | 27 | 22 | 23 | 27 | 25 | 28 | 21 | 21 | 16 | 25 | 18 | 26 | 34 | 28 | 18 | 16 | 14 | 17 | 26 | 17 | 24 | 32 | 19 | 10 | 27 | 28 | 22 | 20 | 11 | 18 | 12 | 16 | 15 | 26 | 24 |
| ఉ.ఫల్గుని 3 | 13 | 21 | 16 | 21 | 25 | 23 | 30 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 25 | 19 | 28 | 25 | 24 | 16 | 25 | 16 | 18 | 27 | 13 | 15 | 28 | 29 | 26 | 25 | 16 | 16 | 10 | 14 | 18 | 29 | 27 |
| హస్త | 11 | 20 | 16 | 21 | 26 | 26 | 33 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 22 | 17 | 26 | 28 | 27 | 19 | 26 | 17 | 19 | 26 | 12 | 14 | 26 | 27 | 23 | 24 | 19 | 19 | 7 | 14 | 19 | 27 | 27 |
| చిత్త 2 | 13 | 6 | 19 | 25 | 20 | 12 | 19 | 26 | 24 | 20 | 12 | 26 | 23 | 9 | 15 | 24 | 27 | 28 | 20 | 19 | 26 | 28 | 11 | 25 | 28 | 13 | 21 | 17 | 19 | 18 | 18 | 24 | 18 | 22 | 11 | 21 |
| చిత్త 2 | 22 | 15 | 28 | 23 | 20 | 12 | 13 | 20 | 18 | 20 | 12 | 26 | 25 | 10 | 17 | 17 | 20 | 21 | 28 | 27 | 34 | 24 | 7 | 21 | 28 | 13 | 21 | 25 | 27 | 26 | 20 | 26 | 20 | 15 | 4 | 13 |
| స్వాతి | 27 | 29 | 17 | 12 | 16 | 27 | 27 | 26 | 26 | 28 | 28 | 15 | 13 | 25 | 25 | 25 | 27 | 21 | 28 | 28 | 20 | 10 | 23 | 18 | 23 | 26 | 18 | 22 | 23 | 27 | 21 | 20 | 25 | 19 | 20 | 13 |
| విశాఖ 3 | 22 | 22 | 20 | 15 | 10 | 8 | 19 | 21 | 21 | 22 | 21 | 19 | 17 | 19 | 18 | 17 | 18 | 27 | 34 | 18 | 28 | 18 | 17 | 21 | 28 | 21 | 13 | 17 | 17 | 32 | 26 | 26 | 22 | 16 | 13 | 5 |
| విశాఖ 1 | 16 | 16 | 14 | 19 | 14 | 22 | 13 | 14 | 14 | 19 | 18 | 15 | 21 | 23 | 21 | 18 | 19 | 28 | 23 | 8 | 17 | 28 | 27 | 31 | 23 | 17 | 9 | 12 | 12 | 27 | 27 | 26 | 22 | 21 | 18 | 9 |
| అనూరాధ | 24 | 14 | 19 | 24 | 27 | 20 | 11 | 16 | 21 | 26 | 18 | 21 | 24 | 20 | 29 | 26 | 27 | 12 | 7 | 22 | 17 | 28 | 28 | 31 | 16 | 14 | 22 | 25 | 26 | 12 | 12 | 22 | 24 | 24 | 18 | 27 |
| జ్యేష్ఠ | 12 | 18 | 24 | 29 | 22 | 22 | 13 | 3 | 6 | 10 | 20 | 26 | 31 | 23 | 16 | 13 | 12 | 25 | 20 | 17 | 20 | 31 | 30 | 28 | 15 | 17 | 17 | 20 | 20 | 25 | 25 | 18 | 11 | 9 | 21 | 21 |
| మూల | 12 | 20 | 24 | 19 | 13 | 14 | 21 | 15 | 12 | 8 | 17 | 24 | 25 | 19 | 9 | 13 | 13 | 27 | 27 | 21 | 27 | 24 | 26 | 16 | 28 | 27 | 25 | 15 | 15 | 21 | 25 | 21 | 11 | 17 | 25 | 27 |
| పూ.షా. | 27 | 20 | 19 | 13 | 20 | 12 | 18 | 26 | 26 | 23 | 13 | 17 | 21 | 19 | 27 | 27 | 26 | 11 | 11 | 26 | 19 | 18 | 18 | 19 | 27 | 28 | 34 | 24 | 23 | 8 | 15 | 22 | 29 | 32 | 23 | 32 |
| ఉ.షా. 1 | 25 | 27 | 14 | 8 | 11 | 18 | 24 | 26 | 26 | 23 | 24 | 9 | 11 | 27 | 28 | 28 | 27 | 20 | 20 | 19 | 12 | 11 | 25 | 19 | 25 | 34 | 28 | 18 | 15 | 15 | 22 | 22 | 28 | 31 | 32 | 23 |
| ఉ.షా. 3 | 28 | 29 | 16 | 14 | 17 | 22 | 20 | 22 | 22 | 27 | 28 | 13 | 6 | 22 | 23 | 26 | 25 | 17 | 24 | 23 | 16 | 14 | 28 | 22 | 16 | 25 | 19 | 28 | 25 | 25 | 17 | 17 | 23 | 30 | 32 | 23 |
| శ్రవణం | 27 | 26 | 13 | 10 | 17 | 26 | 23 | 21 | 23 | 28 | 26 | 15 | 17 | 18 | 20 | 23 | 25 | 18 | 25 | 23 | 16 | 14 | 28 | 23 | 17 | 25 | 15 | 24 | 28 | 30 | 20 | 18 | 23 | 32 | 31 | 24 |
| ధనిష్ఠ 2 | 20 | 10 | 26 | 23 | 20 | 12 | 8 | 17 | 17 | 22 | 13 | 28 | 18 | 5 | 12 | 16 | 18 | 16 | 24 | 26 | 30 | 28 | 14 | 28 | 21 | 9 | 16 | 25 | 21 | 28 | 18 | 23 | 21 | 26 | 15 | 22 |
| ధనిష్ఠ 2 | 20 | 11 | 26 | 30 | 27 | 19 | 10 | 19 | 19 | 14 | 5 | 20 | 25 | 11 | 19 | 17 | 21 | 18 | 19 | 22 | 25 | 28 | 12 | 26 | 29 | 16 | 13 | 18 | 21 | 20 | 28 | 33 | 28 | 18 | 7 | 14 |
| శతభిషం | 15 | 21 | 28 | 32 | 25 | 25 | 18 | 10 | 10 | 7 | 15 | 20 | 26 | 20 | 13 | 11 | 8 | 26 | 26 | 19 | 26 | 26 | 21 | 19 | 22 | 23 | 23 | 18 | 18 | 25 | 33 | 28 | 19 | 9 | 17 | 16 |
| పూ.భా. 3 | 18 | 25 | 20 | 24 | 31 | 31 | 24 | 17 | 17 | 13 | 20 | 14 | 19 | 25 | 17 | 15 | 17 | 18 | 19 | 28 | 21 | 21 | 27 | 12 | 15 | 30 | 29 | 24 | 25 | 20 | 27 | 19 | 28 | 18 | 23 | 20 |
| పూ.భా. 1 | 14 | 21 | 16 | 19 | 26 | 26 | 25 | 18 | 18 | 18 | 25 | 18 | 16 | 22 | 14 | 16 | 18 | 19 | 12 | 20 | 14 | 21 | 27 | 11 | 15 | 31 | 30 | 28 | 30 | 25 | 17 | 7 | 16 | 28 | 33 | 30 |
| ఉ.భా. | 24 | 15 | 18 | 21 | 25 | 17 | 16 | 25 | 27 | 26 | 19 | 20 | 17 | 15 | 25 | 27 | 26 | 9 | 3 | 19 | 12 | 19 | 20 | 22 | 24 | 22 | 31 | 29 | 29 | 14 | 6 | 16 | 21 | 33 | 28 | 34 |
| రేవతి | 25 | 24 | 11 | 14 | 17 | 26 | 25 | 24 | 25 | 24 | 27 | 13 | 12 | 22 | 22 | 24 | 26 | 20 | 13 | 11 | 5 | 12 | 27 | 22 | 27 | 30 | 21 | 19 | 22 | 22 | 14 | 16 | 18 | 29 | 33 | 28 |

బ్రాహ్మణులకు గ్రహమైత్రియును, క్షత్రియులకు గణకూటమును, వైశ్యులకు రాశికూటము లేక స్త్రీ దీర్ఘ కూటము, శూద్రులకు యోనిపొంతనము శుభముగా నుండి 18 గుణములపైన వచ్చినచో

## వింశతి (కూట) వర్గములు

దైవజ్ఞులు వివాహప్రకరణమున వధూవరుల పొంతనములను గూర్చి కొందరు వింశతి వర్గములనియు, కొందరు ద్వాదశ వర్గములనియు, కొందరు దశవర్గములనియు, కొందరు అష్టవర్గములనియు, కొందరు షడ్వర్గములు ప్రధానమనియు, కొందరు చతుర్వర్గములు ప్రధానమనియు చెప్పుచున్నారు.

శాస్త్రముల అభిప్రాయము ననుసరించి ఇరువది వర్గములు ఈ క్రింద వివరించబడుచున్నవి. చూడుడు.

### వింశతివర్గ నామములు

1. గ్రహమైత్రవర్గము
2. గణవర్గము
3. స్త్రీ దీర్ఘ వర్గము
4. యోనివర్గము
5. నాడీవర్గము
6. రాశివర్గము
7. మహేంద్రవర్గము
8. గణితగతాయుష్యవర్గము
9. ఆయవర్గము
10. వశ్యవర్గము
11. దినవర్గము
12. జాతివర్గము
13. వేదావర్గము
14. పక్షివర్గము
15. రజ్జువర్గము
16. యోగినీవర్గము
17. లింగవర్గము
18. భూతవర్గము
19. చంద్రయోగవర్గము
20. గోత్రవర్గము

**1. గ్రహమైత్రవర్గః వివరణము**

| గ్రహములు | రవికి | చంద్రునకు | కుజునకు | బుధునకు | గురునకు | శుక్రునకు | శనికి |
|---|---|---|---|---|---|---|---|
| మిత్రులు | చం-కు-గు | ర-బు | ర-చం-గు | ర-శు | ర-చం-కు | బు-శ | బు-శు |
| సములు | బు | కు-గు-శు-శ | శు-శ | గు-శ | శ | కు-గు | గు |
| శత్రువులు | శు-శ | లేరు | బు | కు-చం | బు-శు | ర-చం | ర-చం-కు |

ఈ చక్రము నైసర్గికమగు (స్వభావసిద్ధముగు) శత్రుత్వమును, మిత్రత్వమును, సమత్వమును తెలియ చేయుచున్నది.

### విశేషములు

రాశిచక్రమునందు గ్రహమునకు 2-3-4-10-11-12 స్థానములయందుగల గ్రహములు తాత్కాలిక మిత్రులగుచున్నారు. 1-5-6-7-8-9 స్థానములయందు గల గ్రహములు తాత్కాలిక శత్రువులగుచున్నారు.

నైసర్గిక మిత్రులు తాత్కాలిక మిత్రులయిన, అధి మిత్రులగుచున్నారు.

నైసర్గిక శత్రువులు తాత్కాలిక శత్రువులైన అధి శత్రువులగుచున్నారు.

నైసర్గిక మిత్రులు తాత్కాలిక శత్రువులైనను, నైసర్గిక శత్రువులు తాత్కాలిక మిత్రులైనను సములు అగుచున్నారు.

నైసర్గిక సములు తాత్కాలిక శత్రువులైన, శత్రువులుగానే అగుచున్నారు. తాత్కాలిక మిత్రులైన మిత్రులుగానే అగుచున్నారు అని తెలియదగియున్నది.

**ఫలం :** వధూవరులయొక్క జన్మరాశ్యాధిపతులు మిత్రులైనను, ఏకరాశ్యాధిపత్యము కలిగియున్నను శుభప్రదము. శత్రువులైన వధూవరులు పరస్పరము కలహము కలవారగుదురు.

**2. గణవర్గః॥** పునర్వసు, పుష్యమి, స్వాతి, హస్త, శ్రవణం, రేవతి, అనూరాధ, మృగశిర, అశ్విని – ఈ తొమ్మిది నక్షత్రములు దేవగణ నక్షత్రములు.

రోహిణి, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, ఆర్ద్ర, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర – ఈ తొమ్మిది నక్షత్రములు మనుష్యగణ నక్షత్రములు.

కృత్తిక, ఆశ్లేష, మఖ, చిత్ర, విశాఖ, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం – ఈ తొమ్మిది నక్షత్రములు రాక్షసగణ నక్షత్రములు.

**శ్లో॥ స్త్రీ రాక్షసగణాజ్జాతా హంతి మర్త్యగణం పరమ్ ।**

**ఫలం॥ వధూవరుల నక్షత్రములు ఏకగణమైన ఉత్తమం, దేవమనుష్యగణములలో చేరిన మధ్యమం, దేవరాక్షసగణములో చేరిన అశుభం, మనుష్యరాక్షస గణములలో చేరిన మరణం అని తెలియదగినది.**

**3. స్త్రీ దీర్ఘవర్గః** వధూ నక్షత్రమారభ్య వరభంచోర్వ సంస్థితమ్ । వరభం శుభదం ప్రోక్తమితిదైవవిదాంవరైః ॥

**ఫలం తా॥** వధూ నక్షత్రము మొదలు వరనక్షత్రము వరకు లెక్కింపగా ప్రథమ నవకములో చేరియున్న అశుభం, సదాకలహప్రదము అనియు, రెండవనవకములో చేరియున్న మధ్యమఫలము అనియు, మూడవ నవకములో చేరియున్న శుభదాయకము, సుఖదాయకము అనియు దైవజ్ఞులలో కొందరు చెప్పుచున్నారు. మరికొందరు అట్లు లెక్కించుటలో వరనక్షత్రము వధూనక్షత్రము నుంచి 13 నక్షత్రములకు పైనయున్న అత్యంత శుభదాయకమని చెప్పుచున్నారు. మరికొందరు వర నక్షత్రము వధూనక్షత్రమునకు పై సంఖ్యలో నున్న శుభకరమేననియు చెప్పుచున్నారు.

**4. యోనివర్గః** అశ్విని-శతభిషం: గుఱ్ఱములు, భరణి-రేవతి: యేనుగులు, కృత్తిక-పుష్యమి: మేకలు, రోహిణి-మృగశిర: సర్పములు, ఆర్ద్ర-మూల: కుక్కలు, పున-ఆశ్లేష: పిల్లులు, మఖ-పుబ్బ: ఎలుకలు, హస్త-స్వాతి: ఎనుములు, చిత్త-విశాఖ: పులులు, అనూ.-జ్యేష్ఠ: జింకలు, ఉ.ఫ.-ఉ.భా.: ఆవులు, అభి-ఉ.షా.: ముంగిసలు, పూ.భా.-ధని: సింహములు, పూ.షా.-శ్రవకోతులు. ఈ నక్షత్రముల జంటలలో మొదటి నక్షత్రము పురుష నక్షత్రము గాను రెండవ నక్షత్రము స్త్రీ నక్షత్రముగాను తెలియదగియున్నది.

**ఫలం తా॥** స్త్రీ పురుషులు ఏక యోనివర్గములో చేరియున్న సంపద కలుగును. వేరు వేరు యోనివర్గములలో నున్న మధ్యమఫలము. శత్రుత్వముగల యోనివర్గములలో చేరిన అశుభప్రదము మరియు స్త్రీ తారలకు స్త్రీ తారల తోటి సంబంధము కలుగకూడదు. అట్లు జరిగెనేని మధ్యమ ఫలము, పురుషతారలకు పురుషతారలతోటి సంబంధము కలిగిన దాంపత్యము, సర్వకాల సర్వావస్థలయందును కలహములు కలదై అశుభమును పొందుచున్నది.

**నైసర్గిక విరోధములు కల జంటలు వివరము**

1. గో-వ్యాఘ్రములు, 2. గజ-సింహములు, 3. అశ్వ-మహిషములు, 4. శునక-హరిణములు, 5. నకుల-సర్పములు, 6. వానర-మేషములు, 7. మార్జాల-మూషకములు.

ఇటుల యే నక్షత్రములకు పరస్పర విరోధము స్వతస్సిద్ధమో అట్టి విరుద్ధ నక్షత్రముల సంబంధము కలిగిన వధూవరులు సదా వైరములు కలవారై యుందురు అని తెలియదగి యున్నది.

**5. నాడీవర్గః** (18) చతుష్పాన్నక్షత్రములు - ఈ నక్షత్రముల యందు బుట్టిన స్త్రీకి అశ్విన్యాదిగ మూడు వ్రేళ్ళయందును, (6) త్రిపాన్నక్షత్రములు - ఈ నక్షత్రముల యందు బుట్టిన స్త్రీకి కృత్తిక మొదలుగా నాలుగు వ్రేళ్ళయందును, (3) ద్విపాన్నక్షత్రములు - ఈ నక్షత్రముల యందు బుట్టిన స్త్రీకి మృగశిర మొదలుగా అయిదు వ్రేళ్ళయందును లెక్కించగా కన్యాజన్మ నక్షత్రము వరుని జన్మనక్షత్రమున్న వ్రేలియందు కాక మరియొక వ్రేలియందున్న శుభకరమున్నూ సౌభాగ్య ప్రదాయకమున్నూ అగుచున్నది అని తెలియవలెను.

**6. రాశివర్గః**

| | | | | |
|---|---|---|---|---|
| స్త్రీరాశికి | - | పురుష రాశి | 12 అయిన | దీర్ఘాయుష్యం |
| **ఫలం ॥** పురుషరాకి | - | స్త్రీ రాశి | 2 అయిన | |
| వ్యుత్క్రమముగా | | | | |
| స్త్రీరాశికి | - | పురుష రాశి | 2 అయిన | మృత్యువు |
| పురుషరాశికి | - | స్త్రీరాశి | 12 అయిన | |

ఇటులనే పై భాగములను తెలియదగి యున్నది.

అనగా స్త్రీ రాశికి పురుషరాశి 12-11-10-9-8 అయిన క్రమముగా దీర్ఘాయుష్యం, సౌఖ్యం ధనసమృద్ధి, శుభము, పుత్రసంపదలు గలుగును. శుభకరములు, అని తెలియవలయును.

స్త్రీ రాశికి పురుషరాశి 2-3-4-5-6 అయిన క్రమముగా మరణము, దుఃఖము, దారిద్ర్యము, అశుభము, పుత్రనాశనము కలుగును గాన అశుభకరమని తెలియదగియున్నది.

స్త్రీ రాశి పురుషరాశి ఒక్కటియైనను సమ సప్తక రాశులైనను అత్యుత్తమము. అనగా పుత్రలాభము, అన్యోన్యానురాగము, మాంగల్యము, సర్వసంపదలు లభించును. శుభదాయకము అని తెలియదగియున్నది.

**7. మహేంద్రవర్గః॥ ఫలం :** వధూ నక్షత్రం మొదలు వరనక్షత్రం వరకు గణనముచేయగా 4-7-10-13-16-19-22-25 ఈ యెనిమిది వర్గములు మహేంద్రవర్గములు. ఈ సంఖ్యలు వచ్చెనేని దంపతులకు సుపుత్ర ప్రదములు. ఇతర వర్గములు (అనగా 1-2-3-5-6-8-9-11-12-14-15-17-18-20-21-23-24-26-27) ఈ సంఖ్యలు వచ్చెనేని దంపతులకు కలహ ప్రదములు అని తెలియవలెను.

**8. గణితగతాయుష్య వర్గః॥** వధూవరుల జన్మనక్షత్రములలో వధూనక్షత్రము మొదలు వరనక్షత్రము వరకు (అభిజిత్తుతో లెక్కించవలెను) లెక్కించి ఆ సంఖ్యను 7చే గుణించి 28చే భాగించగా మిగిలిన శేషము వధూశేషము. తిరిగి ఇటులనే వరనక్షత్రము మొదలు వధూనక్షత్రము వరకు (అభిజిత్తుతో లెక్కించవలెను) లెక్కించి ఆ సంఖ్యను 7చే పెంచి 28చే భాగించగా మిగిలిన శేషము వరశేషము.

**ఫలం॥** ఈ వరశేషము వధూశేషము కంటే తక్కువ అగునెడల దంపతులలో ముందు పురుషునకు మరణంకలుగును. వరశేషమధికమాయెనేని ముందు స్త్రీకి మరణం కలుగును అని తెలియవలెను.

**9. ఆయవర్గః॥**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తూర్పు | - | ధ్వజ | అశ్విని | ఆశ్లేష | అనూరాధ | పూర్వాభాద్ర |
| ఆగ్నేయం | - | ధూమ | భరణి | మఖ | జ్యేష్ఠ | ఉత్తరాభాద్ర |
| దక్షిణం | - | సింహ | కృత్తిక | పుబ్బ | మూల | రేవతి |
| నైఋతి | - | శునక | రోహిణి | ఉత్తర | పూర్వాషాఢ | |
| పడమర | - | వృషభ | మృగశిర | హస్త | ఉత్తరాషాఢ | |
| వాయవ్యం | - | ఖర | ఆర్ద్ర | చిత్త | శ్రవణం | |
| ఉత్తరం | - | గజ | పునర్వసు | స్వాతి | ధనిష్ఠ | |
| ఈశాన్యం | - | కాక | పుష్యమి | విశాఖ | శతభిషం | |

**ఫలం॥** వధూవరుల జన్మనక్షత్రములలో పురుష జన్మనక్షత్రము యే ఆయముగల నక్షత్రములలో నున్నదో తెలుసుకొని ఆ ఆయమునకు అయిదవ ఆయముగల నక్షత్రముల యందు స్త్రీ జన్మనక్షత్రముండెనేని నిత్యము వధూవరులు కలహములు కలిగియుందురు.

**10. వశ్యవర్గః॥**

| | | | |
|---|---|---|---|
| మేషరాశికి సింహ వృశ్చికరాశులు | వశ్యములు | తులారాశికి మకర కన్యారాశులు | వశ్యములు |
| వృషభరాశికి కటక తులారాశులు | వశ్యములు | వృశ్చికరాశికి కటకరాశి | వశ్యము |
| మిథునరాశికి కన్యారాశి | వశ్యము | ధనూరాశికి మీనరాశి | వశ్యము |
| కటకరాశికి వృశ్చిక ధనూరాశులు | వశ్యము | మకరరాశికి మేష కుంభరాశులు | వశ్యములు |
| సింహ రాశికి తులారాశి | వశ్యము | కుంభరాశికి మేషరాశి | వశ్యము |
| కన్యారాశికి మీన మిథున రాశులు | వశ్యము | మీనరాశికి మకరరాశి | వశ్యము |

**శ్లో ॥ "వశ్యయోగాచ్ఛుభం ప్రోక్తం స్త్రీరాశేః పురుషస్య చ"**

**ఫలం. తా ॥** స్త్రీ రాశికి పురుషరాశికి వశ్యయోగము కలుగుట వలన శుభమని తెలియదగినది.

**11. దినవర్గః శ్లో ॥ కన్యాదివరభాన్తం గణయేన్నవభాజితమ్। శిష్టం సమంయది శుభం విషమంచేదరిష్టదమ్ ॥**

**ఫలం. తా॥** వధూనక్షత్రం మొదలుకొని వరనక్షత్రం వరకు లెక్కించి 9చే భాగించగా శేషం 1 మృత్యువు, 2 ప్రేమ, 3 ఆపద, 4 సుఖం, 5 పీడ, 6 పశులాభం, 7 రోగప్రాప్తి, 8 ప్రజావృద్ధి, 9 శత్రువృద్ధి గాన సరిసంఖ్య శుభదాయకమనియు విషమ సంఖ్య అశుభదాయకము అనియు తెలియవలెను.

**12. జాతివర్గః॥**

| | | | | |
|---|---|---|---|---|
| కటకరాశి | మీనరాశి | వృశ్చికరాశి | - | బ్రాహ్మణజాతి |
| సింహరాశి | ధనూరాశి | మేషరాశి | - | క్షత్రియజాతి |
| తులారాశి | మిథునరాశి | కుంభరాశి | - | వైశ్యజాతి |
| వృషభరాశి | కన్యారాశి | మకరరాశి | - | శూద్రజాతి |

**శ్లో॥ న దద్యాద్వర్ణహీ నస్య వర్ణశ్రేష్ఠాం తు కన్యకామ్ ॥**

**ఫలం. తా ॥** వధూవరుల రాశులొకవర్గము కలవైయున్న శుభకరం, పరరాశికంటె వధూరాశి అధికవర్గము కలదైయున్న అశుభకరం, హీనరాశియైయున్న మధ్యమఫలము అని తెలియదగి యున్నది.

**13. వేధావర్గః॥** అశ్విని-జ్యేష్ఠ, భరణి-అనూరాధ, కృత్తిక-విశాఖ, రోహిణి-స్వాతి, ఆర్ద్ర-శ్రవణం, పునర్వసు-ఉత్తరాషాఢ, పుష్యమి-పూర్వాషాఢ, ఆశ్లేష-మూల, మఖ-రేవతి, పుబ్బ-ఉత్తరాభాద్ర, ఉత్తర-పూర్వాభాద్రా, హస్త-శతభిషం.

**ఫలం ॥** ఈ జంట నక్షత్రములు పరస్పర విరోధములు కలవి. చిత్త, మృగశిర, ధనిష్ఠ ఈ ద్విపాన్నక్షత్రములు మూడు అన్యోన్య విరోధములు కలవి కాన ఈ నక్షత్రముల జంటలలో నొకజంట దంపతుల జన్మనక్షత్రద్వయమై యుండెనేని దంపతులకు సదా విరోధము సిద్ధమై యుండును.

**14. పక్షివర్గః॥** 1. గరుడ పక్షి, 2. పింగళపక్షి, 3. కాకి, 4. కోడి, 5. నెమలి. ఇవి అయిదు పక్షులు.

| | | | |
|---|---|---|---|
| అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర కు | - | గరుడపక్షి | అధిపతి |
| ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బకు | - | పింగళపక్షి | అధిపతి |
| ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధకు | - | కాకి | అధిపతి |
| జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం | - | కోడి | అధిపతి |
| ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి | - | నెమలి | అధిపతి |

**ఫలం ॥** వధూవరుల జన్మనక్షత్రములు, ఒక పక్షి ఆధిపత్యములో యున్న అన్యోన్యము, ప్రీతికలవారై యుందురు. ఆ నక్షత్రములు వేరువేరు పక్షుల ఆధిపత్యములలో యున్న నిత్యము కలహముకలవారై యుందురు.

**15. రజ్జువర్గః॥**

| | | |
|---|---|---|
| అశ్విని, ఆశ్లేష, మఖ, జ్యేష్ఠ, మూల, రేవతి | - | ఈ ఆరు పాదరజ్జు నక్షత్రములు |
| భరణి, పుష్యమి, పుబ్బ, అనూరాధ, పూ.షా. ఉ.భా. | - | ఈ ఆరు కటిరజ్జు నక్షత్రములు |
| కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉ.షా. పూ.భా. | - | ఈ ఆరు ఉదరరజ్జు నక్షత్రములు |
| రోహిణి, ఆర్ద్ర, హస్త, స్వాతి, శ్రవణం, శతభిషం | - | ఈ ఆరు కంఠరజ్జు నక్షత్రములు |
| మృగశిర, చిత్ర, ధనిష్ఠ | - | ఈ మూడు శిరోరజ్జు నక్షత్రములు |

**శ్లో॥ ఏకరజ్జుర్మృత్యుకరీ భిన్నరజ్జుశ్శుభావహా ॥**

**ఫలం. తా ॥** స్త్రీ పురుష నక్షత్రములు, శిరోరజ్జువు యందున్న భర్తను, కంఠరజ్జువుయందున్న భార్యను, ఉదరరజ్జువు యందున్న కుమారులను నశింపచేయును. కటిరజ్జువుయందున్న దారిద్ర్యమును, పాదరజ్జువుయందున్న వ్యభిచారమును కలుగచేయును అని తాత్పర్యము.

**16. యోగినీవర్గః॥** బ్రాహ్మణి, 2. కౌమారీ, 3. వారాహీ, 4. సిద్ధా, 5. వైష్ణవీ, 6. మాహేంద్రీ, 7. చాముండీ, 8. మాహేశ్వరీ, అను యెనిమిది దిక్కుక్కులు కలవు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| బ్రాహ్మణీ | : | తూర్పు | - | అశ్విని | ఆశ్లేష | అనూరాధ | పూర్వాభాద్ర |
| కౌమారీ | : | ఆగ్నేయం | - | భరణి | మఖ | జ్యేష్ఠ | ఉత్తరాభాద్ర |
| వారాహీ | : | దక్షిణం | - | కృత్తిక | పుబ్బ | మూల | రేవతి |
| సిద్ధా | : | నైఋతి | - | రోహిణి | ఉత్తర | పూర్వాషాఢ | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| వైష్ణవీ | : | పడమర | - | మృగశిర | హస్త | ఉత్తరాషాఢ |
| మాహేంద్రీ | : | వాయవ్యం | - | ఆర్ద్ర | చిత్ర | శ్రవణం |
| చాముండీ | : | ఉత్తరం | - | పునర్వసు | స్వాతి | ధనిష్ఠ |
| మాహేశ్వరీ | : | ఈశాన్యం | - | పుష్యమి | విశాఖ | శతభిషం |

**ఫలం ॥** వధూవరుల జన్మనక్షత్రములు ఒకే శక్తి నక్షత్రములలో యున్న యెడల అన్యోన్య ప్రేమ కలవారై యుందురు. భిన్న శక్తుల నక్షత్రములలో యున్న యెడల పరస్పరము కలహము కలవారై యుందురు.

**17. లింగవర్గః॥** భరణి, ఆర్ద్ర, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, చిత్ర, స్వాతి, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, రేవతి - ఈ 14 నక్షత్రములు స్త్రీ లింగములు.

మృగశిర, మూల, శతభిషం - ఈ 3 నక్షత్రములు నపుంసకలింగములు.

అశ్విని, కృత్తిక, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త, అనూరాధ, శ్రవణం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర - ఈ పది నక్షత్రములు పుంలింగములు.

**ఫలం ॥** వధూవరుల జన్మనక్షత్రములు ఏకలింగము కలవైయున్న పరస్పరము ప్రేమకలవారై యుందురు. భిన్న లింగము కలవైయున్న పరస్పరము కలహము కలవారై యుందురు.

**18. భూతవర్గః॥**

| | | |
|---|---|---|
| పృథివీ | - | అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర |
| జలం | - | ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ |
| అగ్ని | - | ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ |
| వాయువు | - | జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం |
| ఆకాశం | - | ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి |

**ఫలం ॥** వధూవరుల జన్మనక్షత్రములలో నొకటి జలవర్గములోను, మరియొకటి అగ్నివర్గములోను చేరిన వధూవరులకు మరణము సంభవించును. మిగిలిన నక్షత్రములు శుభకరంబులగును.

**19. చంద్రయోగవర్గః॥**

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| **తూర్పు-ఇంద్రుడు** | **పాడ్యమి-నవమి** | **అశ్విని** | **ఆశ్లేష** | **అనూరాధ** | **పూర్వాభాద్ర** | **సూర్యః** |
| **ఆగ్నేయం-అగ్ని** | **విదియ-దశమి** | **భరణి** | **మఖ** | **జ్యేష్ఠ** | **ఉత్తరాభాద్ర** | **చంద్రః** |
| **దక్షిణము-యముడు** | **తదియ-ఏకాదశి** | **కృత్తిక** | **పుబ్బ** | **మూల** | **రేవతి** | **కుజః** |
| **నైఋతి-నిర్ఋతి** | **చవితి-ద్వాదశి** | **రోహిణి** | **ఉత్తర** | **పూర్వాషాఢ** | | **బుధః** |
| **పశ్చిమం-వరుణుడు** | **పంచమి-త్రయోదశి** | **మృగశిర** | **హస్త** | **ఉత్తరాషాఢ** | | **గురుః** |
| **వాయవ్యం-వాయువు** | **షష్ఠి-చతుర్దశి** | **ఆర్ద్ర** | **చిత్ర** | **శ్రవణం** | | **శుక్రః** |
| **ఉత్తరం-కుబేరుడు** | **సప్తమి-పూర్ణిమ** | **పునర్వసు** | **స్వాతి** | **ధనిష్ఠ** | | **శనిః** |
| **ఈశాన్యం-ఈశానుడు** | **అష్టమి-అమావాస్య** | **పుష్యమి** | **విశాఖ** | **శతభిషం** | | **రాహుః** |

**ఫలం॥** వధూవరుల జన్మనక్షత్రములలో పురుషుని జన్మనక్షత్రము ఏ దిక్కున యున్నదో ఆ దిక్కున గల దినాధిపతిని, నక్షత్రాధిపతిని, గ్రహాధిపతిని, దిక్పతిని తెలుసుకొని వారికినీ, స్త్రీ జన్మనక్షత్రమే దిక్కున యున్నదో, ఆ దిక్కునగల దినాధిపతిని, నక్షత్రాధిపతిని, గ్రహాధిపతిని, దిక్పతిని తెలుసుకొని వీరికిని, మిత్రత్వమున్న దంపతులకు మిత్రత్వమును, శత్రుత్వమున్న దంపతులకు శత్రుత్వమును, సమత్వమున్న దంపతులకు సమత్వమును ఉండునని తెలియవలెను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| **20. గోత్రవర్గః॥** | **మరీచిః** | **అశ్విని** | **భరణి** | **కృత్తిక** | **రోహిణి** |
| | **అత్రిః** | **మృగశిర** | **ఆర్ద్ర** | **పునర్వసు** | **పుష్యమి** |
| | **వశిష్ఠః** | **ఆశ్లేష** | **మఖ** | **పుబ్బ** | **ఉత్తర** |
| | **అంగిరాః** | **హస్త** | **చిత్ర** | **స్వాతి** | **విశాఖ** |
| | **పౌలస్త్యః** | **అనూరాధ** | **జ్యేష్ఠ** | **మూల** | **పూర్వాషాఢ** |
| | **పులహః** | **ఉత్తరాషాఢ** | **అభిజిత్** | **శ్రవణం** | **ధనిష్ఠ** |
| | **క్రతుః** | **శతభిషం** | **పూర్వాభాద్ర** | **ఉత్తరాభాద్ర** | **రేవతి** |

అశ్విన్యాది నాలుగు నక్షత్రములు మరీచి గోత్రమునకు చెందియున్నది. మృగశీర్షాది నాలుగు నక్షత్రములు అత్రిగోత్రమునకు చెందియున్నవి. ఇటులనే పై నక్షత్రముల గోత్రములను కూడా తెలియపలెను.

**ఫలం ॥ వధూవరుల జన్మనక్షత్రములు ఒక గోత్రమునకు చెందియున్న యెడల వధూవరులు నిత్యము కలహము కలవారై యుందురు. భిన్నగోత్రములకు చెందియున్న యెడల శుభప్రదము.**

ఈ పైన వివరింపబడిన వింశతి వర్గములు వధూవరుల పొంతనములను గూర్చి ముఖ్యములైనవి. ఈ ఇరువది వర్గములయందు అనుకూల్యమును చూచి స్త్రీ పురుషులకు దాంపత్యమును సమకూర్చుట ఉత్తమోత్తమము అయియున్నది. ఇది దుర్లభము. అదృష్టాయత్తము కూడ అయియున్నది. మొదటి ఆరువర్గములు వివాహ సమయమున ముఖ్యతరములనియు, మిగిలిన 14 వర్గములు అముఖ్యులైనను అభ్యుచ్ఛయములుగా కాలజ్ఞులు చెప్పుచున్నారు. గాన ఆ ఆరు వర్గములయందు అనుకూల్యమును చూచి దాంపత్యమును నిర్ణయించుట ఉత్తమము.

**శ్లో॥ గ్రహమైత్రం ద్విజాతీనాం క్షత్రియాణాం గణస్తథా ।**
**కన్యాదూరం తు వైశ్యానాం శూద్రాణాం యోనిరేవ చ ॥ ఇత్యాది**

తా॥ ప్రమాణముచే బ్రాహ్మణులు గ్రహమైత్రవర్గమును, క్షత్రియులు గణవర్గమును, వైశ్యులు స్త్రీ దీర్ఘ వర్గమును, శూద్రులు యోనివర్గమును నియతముగా విచారించి స్త్రీ పురుషులకు దాంపత్యమును నిర్ణయించవలెను. ఇతర వర్గములు అప్రధానములు, అభ్యుచ్ఛయ సాధనములుగా భావించవలెను. ఇతర వర్గములు దేశభేదముచే ప్రత్యేకముగా ప్రాధాన్యము నొందుచూ సాఫల్యమును గడించుచునే యున్నవి. వైఫల్యమే మాత్రమును లేదు అని సమయశాస్త్ర పారదృశ్యులు చెప్పుచున్నారు.

## పంచకరహితమును చేయుట

పంచకము ॥ ప్రతిపదాది తిథులు, భానువారాది వారములు, అశ్విన్యాది నక్షత్రములు, మేషాది లగ్నములను జేర్చి ఆ సంఖ్యను తొమ్మిదితో భాగించగా మిగిలిన సంఖ్య 1 మృత్యు, 2 అగ్ని, 4 రాజ, 6 చోర, 8 రోగపంచకములు అనబడును. ఇవి అశుభములు. చోర రోగములు రాత్రియందును, రోగాగ్నులు పగటియందును, మృత్యువు దివారాత్రములయందును పనికిరానేరవు. అవసరమై ఆచరించ వలసి వచ్చినప్పుడు 1-2-4-6-8 పంచకములకు క్రమముగా రత్నములు, చందనము, నిమ్మపండ్లు, దీపము, ధాన్యము దానముచేసిన దోషపరిహారమగును అని కొందరిమతము.

## పంచకరహితములో విశేషములు

సుముహూర్త నిర్ణయమునందు తిథి, వార, నక్షత్రలగ్నములు కాక ధ్రువకమును కూడా చేర్చిన పంచకమగును. అప్పుడు పంచకరాహితమును చేయవలెను అని కొందరి మతము.

ధ్రువకమనగా- శ్రుతిః బాణః ఋతుః పంచవేద త్రీణి ద్వి చంద్రమాః ।
గగనేందు ద్వయం త్రీణి ధ్రువకంచే త్యనుక్రమాత్ ॥ ఇతి.

తా॥ ధ్రువక సంఖ్య మేషమునకు 4, వృషభమునకు 5, మిధునమునకు 6, కటకమునకు 5, సింహమునకు 4, కన్యకు 3, తులకు 2, వృశ్చికమునకు 1. ధనుస్సుకు 0, మకరమునకు 1, కుంభమునకు 2, మీనం 3 గా తెలియవలెను. పై నాలుగు సంఖ్యలతో ధ్రువకసంఖ్యను కూడా చేర్చి పంచకరాహిత్యము చేయవలెను.

**తారాబలమును చూచుట**

**శ్లో॥ జన్మనక్షత్రమారభ్య నిత్యభాంతం చ గణ్యతే । నవసంఖ్యాహృతంభాగం నవతారాః ప్రకీర్తితాః ।**
**జన్మభం దేహనాశాయ సంపత్సంపద ఏవ చ । విపచ్చ కార్యనాశాయ క్షేమం క్షేమకృతోభవేత్ ।**
**ప్రత్యక్చ కార్యనాశాయ సాధనం కార్యసాధనే । నైధనం నిధనే-పిస్యాన్మిత్రం చ సుఖసంపది ॥**
**పరమమైత్రం సుఖే విద్యాత్తారాబలమితి క్రమాత్ ॥**

తారాబలము ॥ జన్మనక్షత్రము (లేక నామనక్షత్రము) మొదలు దిననక్షత్రము వరకు ఎంచి ఆ సంఖ్యను తొమ్మిదిచే భాగించగా మిగిలిన సంఖ్య 1 జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6 సాధసతార, 7 నైధనతార, 8 మిత్రతార, 9 పరమమైత్రతార.

పై చెప్పబడిన తొమ్మిది తారలలో జన్మతారవలన దేహనాశమును, సంపత్తారవలన సంపదయును, విపత్తారవలన కార్యనాశమును, క్షేమతారవలన క్షేమమును, ప్రత్యక్తార వలన కార్యహానియు, సాధనతార వలన కార్యసాధనమును, నైధనతార వలన మరణమును, మిత్రతారవలన సుఖసంపద్వృద్ధియు, పరమమైత్రతార వలన దేహ సౌఖ్యమును కలుగును.

**శుభతారలు: సంపత్ - క్షేమ - సాధన - మిత్ర - పరమమైత్రములు.**

అశుభతారలకు దానములు : జన్మతారకు శాకము, విపత్తారకు గుడము, ప్రత్యక్తారకులవణము, నైధనతారకు తిలసహిత కాంచనము. అశుభతారలయందు మిక్కిలి క్రూరకాలము - జన్మతారయందు 3 పాదము, విపత్తారయందు 1 పాదము, ప్రత్యక్తారయందు 4 పాదము, నైధనతారయందు 2 పాదము.

**శ్లో ॥ ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేతు తృతీయకం ।**
**తృతీయే పంచమంత్యాజ్యం నైధనం త్రిషువర్జయేత్ ॥**

తా॥ పరిగణనమున 1వ పర్యాయము జన్మతారయు, 2వ పర్యాయము విపత్తారయు, 3వ పర్యాయము ప్రత్యక్తారయు, మూడు పర్యాయములయందు నై ధనతారయు పనికిరానేరవు.

**చంద్రబలమును చూచుట**

**చంద్రబలము॥** జన్మరాశి (లేక నామరాశి) మొదలు 1-3-6-10-11 రాశులయందు చంద్రుడు శుభుడు. 2-4-5-8-12 రాశులయందు అశుభుడు. శుక్లపక్షమున 2-5-9 రాశులయందును, కృష్ణపక్షమున 4-8-12 రాశులయందును శుభుడు.

**కుజదోషము - అపవాదములు - పరిహారము**

**శ్లో॥ ధనేవ్యయేచ పాతాళే జామిత్రే చాష్టమే కుజే । స్త్రీణాం భర్తృవినాశాయ పుంసాం భార్యా వినాశనమ్ ॥**
**ఆరోఽగ్ని, క్రూరదృగ్వక్రీకుజః పాపఫలప్రదః స్వాధిష్టితం స్వదృష్టంచ భావం నాశయతి ధృవం ॥**

**శ్లో॥ ద్వితీయే భౌమదోషస్తు యుగ్మకన్యకయోర్వినా । ద్వాదశే భౌమదోషస్తు వృషతౌళికయోర్వినా ।**
**చతుర్థే భౌమదోషస్తు మేష వృశ్చికయోర్వినా । సప్తమే భౌమదోషస్తు నక్ర కర్కటయోర్వినా ।**
**అష్టమేభౌమ దోషస్తు ధనుర్మీనద్వయోర్వినా । కుంభే సింహే న దోషస్స్యాత్ప్రత్యక్షం దేవకేరళే ॥**

కటక సింహరాశులలోను, మకరరాశియందును, కుజునికి మిత్రక్షేత్రములందును జన్మించినవారలకు ఈ కుజదోషము లేదు.

తా॥ కుజుడు రెండవస్థానమునందుండెడి కుజదోషము మిథున కన్యలలో నుండునప్పుడు లేదు. అటులనే పంద్రెండవ స్థానము వృషభతులలైనను, నాల్గవస్థానము మేషవృశ్చికములైనను, ఏడవ స్థానము మకర కర్కాటకములైనను, అష్టమస్థానము ధనుర్మీనములైనను కుజదోషము లేదు. కుంభసింహములందున్న కుజదోషము లేదు. కుజుడు బృహస్పతితో చేరినపుడును, చంద్రునితో చేరినప్పుడును కుజదోషము లేదు.

వధూవరులకు పైన చెప్పినట్లు 2-4-7-8-12. ఈ స్థానములలో ఉభయులకు కుజుదుండిన యెడల దోషము లేదు. దీర్ఘకాలము దాంపత్య సుఖమనుభవించి పుత్రపౌత్రాది ధన క్షేత్రాదులతో సుఖింతురు. ఒకరి జాతకమందే యుండిన యెడల కష్టనష్టములు కల్గును. ఇట్లని దేవ కేరళమందు చెప్పిబడినది.

పురుషులకు 2, 12 యందును స్త్రీలకు 4,7 యందును ఉభయులకు అష్టమమందును కుజుదుండెనేని కుజదోషము తప్పదని పెద్దల అభిప్రాయము.

**వధూవరులకు కుజదోషము:** వధూవరులు ఇద్దరి జాతకమందును లగ్నము నుండియు, చంద్రుని నుండియు, శుక్రుని నుండియు 1-2-4-7-8-12 స్థానములలో అంగారకుడు వున్నచో - ఆ దంపతులు దీర్ఘకాలము సుఖించెదరు. సంతాన సంపత్తి కల్గి యుందురు. కావున - కుజ దోషముగల వరునకు కుజదోషము గల కన్యనిచ్చి పెండ్లి చేసినచో శుభమగును. అట్లుగాక, ఒక జాతకమున కుజదోషముండి మరియొకరి జాతకము కుజదోషములేనిదైనచో ఆ దాంపత్యము వర్ధిల్లదు. పుత్రనాశనము, మరణభయము కల్గును. వధూవరు లిరువురకు కుజదోషమున్న శుభమే గాని - వివాహముహూర్తమునకు మాత్రము కుజుడు అష్టమమందుండరాదు. ఆ ముహూర్తం నిషిద్ధం.

**1. వధూవరులకు చూడవలసిన నాడీకూటమి, వయస్సు:** అశ్విని మొదలు మూడు వ్రేళ్ళయందు మూడేసి చొప్పున లెక్కించగా వధూవరుల నక్షత్రములు ఒకే వ్రేలిపైకి రారాదు. వచ్చినచో అశుభమందురు. పురుషునకు 21వ సంవత్సరము నుండి తదుపరి బేసి సంవత్సరములు, కన్యకు 18వ సంవత్సరము నుండి సరి సంవత్సరములందు వివాహమునకు యుక్తవయస్సుగా చెప్పబడినది.

**2. త్రిజ్యేష్ఠ:** వివాహమున వధూవరులకు త్రిజ్యేష్ఠ శబ్దము రాకూడదు. అనగా వధూవరులిరువురు జ్యేష్ఠ సంతానములై జ్యేష్ఠ మాసముగాని, జ్యేష్ఠా నక్షత్రముగాని కారాదు. అట్లే ఇరువురకు జ్యేష్ఠ జన్మనక్షత్రమై - ఒకరు జ్యేష్ఠులైనచో త్రిజ్యేష్ఠ యగును. ఒకరి జన్మతార జ్యేష్ఠయై, ఇరువురును జ్యేష్ఠ జన్ములైన అదియు త్రిజ్యేష్ఠయే. అట్లే ఒక జన్మతార జ్యేష్ఠయై, మరొకరు జ్యేష్ఠులై, జ్యేష్ఠమాసమైననూ త్రిజ్యేష్ఠయే. ఈ విధముగా చూచుకొని త్రిజ్యేష్ఠను తప్పనిసరిగా వదలివేయవలెను. జ్యేష్ఠులనగా స్త్రీపురుష సంతానములలో తొలివారిగా లెక్కించవలెను. వీరికన్న ముందరివారు ఎవ్వరైనను మృతులైనచో బ్రతికినవారిలో జ్యేష్ఠులుగా లెక్కించరాదు.

**3. సగ్రహచంద్ర దోషము:** చంద్రుడితర గ్రహములు వేనితోనూ కల్సియుండరాదు. ఏలననగా - ముహూర్త సమయమునకు చంద్రుడు రవితో కలిసినచో దరిద్రము, కుజుని కూడిన మృత్యుభీతి, బుధ సంబంధీకుడైన సంతానహీన కష్టములు, గురుసంయోగమున ధననష్టాదులు, శుక్రసంపర్కంవల్ల భార్యా విరోధము - ఎడబాటు, శనితో కలయికవలన దరిద్రము కలుగును. అందుచే చంద్రుడు ఏ గ్రహముతోటీ కలవకుండునట్లు చూడవలెను.

**4. జామిత్రస్థానం:** ముహూర్త లగ్నమునకు సప్తమస్థానము శుద్ధిగా ఉండవలెను. వివాహ ముహూర్తమునకిది అత్యంత ప్రధానం.

**5. పాప షడ్వర్గు:** లగ్న, హోర, ద్రేక్కాణ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశాధిపతులు - శుభగ్రహయుతులైగాని - శుభస్థానములందుగాని యుండవలెను. పాపస్పర్శ మహాదోషము.

**6. రిఃఫచంద్ర దోషం:** వివాహముహూర్త లగ్నమునకు 1-6-8-12 స్థానములలో చంద్రుడున్నచో అది చెరపు చేయును.

**7. శుభతిథులు:** ఉభయపక్షములందలి 2,3,5,7,10 తిథులను, శుక్ల 11,12,13,15 బహుళ పాడ్యమి తిథులును శ్రేష్ఠములు - ఉభయపక్షములలోని 4,6 తిథులు - శుక్ల 8,9 తిథులు రెండవ మతము.

**8. శుభవారములు:** బుధ, గురు, శుక్రవారములు శ్రేష్ఠము. తప్పనిసరియైనప్పుడు శని, ఆదివారములు కూడా అంగీకరింపబడు చున్నవి. మంగళవారము నిషిద్ధము. దూష్యము. సోమవారము పునర్వివాహప్రదము. కావున సోమ, మంగళ వారములలో పెండ్లి తలపెట్టరాదు.

**9. శుభతారలు:** రోహిణి, మృగ, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రేవతి, ఈ పదకొండు తారలూ శ్రేష్ఠమైనవి. వీటికి పాపగ్రహ సంబంధము లేకుండ చూసుకొని ముహూర్తము నిర్ణయించుకొనవలెను. జన్మతారకు పదియవతార కర్మతార అనబడును. ఆ తారలో పెండ్లి జరుపరాదు. పై నక్షత్రములలో - ఏవైనా వధూవరులకు కర్మతారలైనచో ఆ నక్షత్రములు ఎంత గొప్పవైనను పనికిరానివని తెలియవలెను.

**10. నిషిద్ధములు:** పుట్టినతిథికి 30వ తిథినాడును, జన్మమాసమునకు ఎనిమిదవ మాసమందును, జన్మరాశికి 8వ రాశి యందును, జనన లగ్న రాశికి 8వ రాశి యందును వివాహము చేయరాదు. సూర్యుడు మీనమందున్న చైత్ర మాసములోను, మిథునమందున్న ఆషాఢములోను, కన్యయందున్న భాద్రపదములోను, ధనుస్సునందున్న పుష్యమాసమందును, పెండ్లి చేయరాదు.

ఒక వరునకు లేక యిరువురు అన్నదమ్ములకు అక్కచెల్లెండ్ర నీయకూడదని, ఒకే లగ్నమందు భిన్నోదరవరులకైనను కన్యకాద్వయము నియ్యకూడదనీయు, పుత్రికా పుత్రులకు వివాహము చేయకూడదనియు, ఒకనికి ఉపనయనము ఒకనికి వివాహము ఒకే గృహములో ఒకే లగ్నమందు చేయరాదనియు, భిన్నోదరులకైనను ఒక లగ్నవేదికయందు చేయకూడదని, శాస్త్రములో చెప్పిరి. ఆపత్కాల విషయమై మనువు మొదలైన కొందరు మాసాంతరమందు చేయవచ్చునని, కొందరు పుత్రికా వివాహానంతరమున పుత్రవివాహము చేయవచ్చుననియు చెప్పిరి.

ఏకకాలములో పుత్ర పుత్రికా వివాహము చేయవలసివచ్చినచో, ముందు పుత్రికావివాహముచేసి, అనంతరము పుత్రవివాహము చేయవలెను. పుత్ర వివాహానంతరము, పుత్రికా వివాహమైనను పుత్రోపనయనమైనను చేయకూడదు. పుత్రునికి వివాహము చేసిన తదుపరి ఆరు నెలలు పర్యంతము ఏకోదరున కుపనయనాదులు శుభకరము. మరియు వివాహాది కార్యములలో ఆ సంవత్సరములో ఆరు నెలలు చేయకూడదనియు చెప్పబడినను సంవత్సర భేదమైనచో చెప్పబడిన పరిమితి లేకయే వివాహాదులు చేయవచ్చును. అనగా ఫాల్గుణములో వివాహము చేసి చైత్రమాసమందు మరల వివాహ శుభకార్యములు చేయవచ్చును.

**మాసాధిపతులు - దైవనామములు**

| సం॥ | మాసము | మగ శిశువు | ఆడ శిశువు |
|---|---|---|---|
| 1. | చైత్రము | కృష్ణ | భూదేవి |
| 2. | వైశాఖము | అనంత | కల్యాణి |
| 3. | జ్యేష్ఠము | అచ్యుత | సత్యభామ |
| 4. | ఆషాఢము | చక్రీ | పుణ్యవతి |
| 5. | శ్రావణము | వైకుంఠ | రూపవతి |
| 6. | భాద్రపదము | జనార్దన | ఇందుమతి |
| 7. | ఆశ్వయుజము | ఉపేంద్ర | ఇంద్రావతి |
| 8. | కార్తీకము | యజ్ఞేశ్వర | లక్ష్మి |
| 9. | మార్గశిరము | వాసుదేవ | వాగ్దేవి |
| 10. | పుష్యము | హరనాథ | పద్మావతి |
| 11. | మాఘము | గోవింద | శ్రీదేవి |
| 12. | ఫాల్గుణము | పుండరీకాక్ష | సావిత్రి |

## శిశు జననము - నక్షత్రపాద దోషములు

| నక్షత్రములు | 1వ పాదము | 2వ పాదము | 3వ పాదము | 4వ పాదము |
|---|---|---|---|---|
| అశ్విని | తండ్రికి | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | మంచిది | శిశువునకు |
| కృత్తిక | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| రోహిణి | పితృ, మేనమామ | పితృ, మేనమామ | పితృ, మేనమామ | పితృ, మేనమామ |
| మృగశిర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఆర్ద్ర | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | పితృ, మాతృ | పితృ, మాతృ | మంచిది |
| ఆశ్లేష | మంచిది | శిశువునకు | తల్లికి | తండ్రికి |
| మఘ | తండ్రికి | తండ్రికి | మంచిది | మంచిది |
| పుబ్బ | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| ఉత్తర | పితృ, మాతృ | మంచిది | మంచిది | మంచిది |
| హస్త | మంచిది | మంచిది | పితృ, మాతృ | మంచిది |
| చిత్త (చిత్ర) | తల్లికి | తండ్రికి | మంచిది | మంచిది |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| అనూరాధ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| జ్యేష్ఠ | తల్లికి | సోదరులు, మేనమామ | శిశువునకు | తండ్రికి |
| మూల | తండ్రికి | తల్లికి | ధనమునకు | మంచిది |
| పూ.షా. | మంచిది | మంచిది | తండ్రికి | మంచిది |
| ఉ.షా. | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శతభిషం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పూర్వాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | శిశువునకు |
| ఉత్తరాభాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | తండ్రికి |

సూచన: తల్లిదండ్రులు లేదా అన్నలు లేదా అక్కల జన్మ నక్షత్రమందు శిశు జననమయిననూ, వర్జ్యము, దుర్ముహూర్తము, రాహుకాలము, లేక గ్రహణములందుగాని, అమావాస్యనాడు గానీ జన్మించిననూ, ప్రేగులు మెడకు చుట్టుకుని పుట్టిననూ నక్షత్ర జపము, నవగ్రహశాంతి దానములు, హోమశాంతి, రుద్రాభిషేకము, సువర్ణదానము జరిపించినచో దోషము తొలగి ఆయురారోగ్య సుఖశాంతులతో వర్ధిల్లెదరు.

# జనన ప్రకరణము

## బాలారిష్ట దోషములు

జననకాల లగ్నమునకు చంద్రుడు 8టను, కుజుడు 7టను, రాహువు 9టను, శని 1టను, గురుడు 3టను, సూర్యుడు 5టను, శుక్రుడు 6టను కేతువు 4టను ఉన్నపక్షమున బాలారిష్టదోషములు సంభవించును.

శిశువు జన్మించిన లగ్నమునకు 1-5-6-7-8-12 రాశులయందు పాపగ్రహము లుండినను లేక పాపగ్రహములచే జూడబడినను, మరియు క్షీణచంద్రుడు 12వ రాశి యందుండినను బాలారిష్టదోషములు సంభవించును.

జన్మకాలమున అష్టమాధిపతి దశవచ్చిన బాలారిష్టము. లగ్నమందు శనియు, సప్తమమందు రవియు, అష్టమమందు కుజుడును ఉండి చంద్రుడు పాపగ్రహములచే చూడబడిన బాలారిష్టము.

కుజుడు లగ్నమందును శని షష్టమమందుగాని అష్టమమందుగాని ఉన్నయెడల బాలారిష్టము.

చంద్రుడు శనిరాహువులతో కలసి లగ్నమందుండి అంగారకుడష్టమ మందున్న యెడల బాలారిష్టము.

### బాలారిష్ట దోష భంగములు

శిశు జన్మలగ్నమునకు పై రాశులందు ఆయా గ్రహములుండినను, ఆయా రాశులను బలమగు శుభగ్రహములు చూచినను, కేంద్రములందు ఒక శుభగ్రహముండినను దోషము లేదు.

లగ్నాధిపతి బలవంతుడై శుభగ్రహ వీక్షణము కలిగియున్న బాలారిష్టము లేదు.

పూర్ణచంద్రుడు శుభాంశయం దుండి శుక్రునిచే చూడబడిన బాలారిష్టము లేదు.

గురు శుక్రులు కేంద్రముల యందున్న బాలారిష్టము లేదు.

శుక్ల పక్షమున రాత్రియందైనను, కృష్ణపక్షమున పగటియందైనను జన్మించిన బాలారిష్టము లేదు.

### జననమందు దుష్టకాల ఫల నిర్ణయము

**తిథులు :** కృష్ణచతుర్దశి, అమావాస్య, అశుభకరములు.

సాద్మృష్టేందు స్సినీవాలీ సానష్టేందు కలాకుహూ.

**వివరణము :** అమావాస్యా అనునది సినీవాలీ, కుహూ, దర్శ అని మూడు విధములుగా నున్నది. ఈ అమావాస్య యొక్క 8 ఝాముల కాలములో (1) మొదటి ఝాము సినీవాలీ, చివర 7-8 ఝాములు రెండు కుహూ, మధ్యగల 5 ఝాములు దర్శ అని కొందరు అభిప్రాయపడుచున్నారు.

అమావాస్య యొక్క వృద్ధి యందు మధ్య దినమందు గల 60 ఘడియల కాలము దర్శ - కృష్ణచతుర్దశీతో కూడిన అమావాస్య పూర్వకాలము సినీవాలి - ప్రతిపత్తుతో కూడిన అమావాస్యా ఉత్తర కాలము కుహూ అనియు అమావాస్యా క్షయ సమయమున అంతయు దర్శ అనియు మయూఖమునందు తెలియవచ్చుచున్నది.

**శిశుజననము :** దర్శయందైన తల్లితండ్రులకు దారిద్ర్యము, సనీవాలీయందైన మహాదోషము. అనగా అకాలమునందు తన ఇంటగల ఆవు, ఎనుము, దాసి, కుక్క, పక్షి మొదలగునవి యేవి ప్రసవించిన తనకు ఇంద్రైశ్వర్యమున్నను నశింపచేయును. కుహూ యందైన సర్వదోషములు కలుగును గాన, గ్రహశాన్తి గోముఖ ప్రసవశాన్తి వెంటనే చేయవలయును.

ఆశ్లేషాన్తం మఘాత్పూర్వం, జ్యేష్ఠాన్తం మూల పూర్వకం, రేవత్యశ్వనయోర్మధ్యే శాంతింకుర్యాద్యదావిధి. ఉత్తరే ప్రథమపాదే పుష్యేచైవ తృతీయకే, పూర్వాషాఢా త్రిపాదే చ, చిత్రార్థం పూర్వమేవచ. ఏషుజాతకుమారస్యపితా హాన్తి న సంశయః.

**నక్షత్రములు :** చిత్ర 1-2 పాదములు, పుష్యమి 2-3, పూర్వాషాఢ 3, ఉత్తర 1, మఖ 1, రేవతి 2-3-4, అశ్విని 2-3 పాదములు అశుభప్రదములు.

**అశ్లేష** 1వ పాదము శుభము, 2 ధనహాని, 3 మాతృహాని 4 పితృహాని, స్త్రీ పురుష శిశువులు ఎవరైనను అత్తగారికి హాని కలుగజేయుదురు.

జ్యేష్ఠా పురుషుడైన అన్నగారికి, స్త్రీ అయిన భర్త అన్నగారికి హానిని కలుగజేయును.

జ్యేష్ఠా నక్షత్ర కాలమును పదిభాగములు చేసిన 1 భాగమున జననము మాతామహికి, 2 మాతా మహునకు, 3 మేనమామకు, 4 తల్లికి, 5 తనకు, 6 గోత్రస్థులకు, 7 ఉభయకులములకు, 8 తన అన్నగారికి, 9 తన మామకు, 10 సర్వమునకు హానిని కలుగజేయును.

మూల 1వ పాదమునందు తండ్రికి, 2 తల్లికి, 3 ధనమునకు, 4 కులమునకు హానిని కలుగజేయును.

**స్త్రీ జననము :** మూలయందు మామగారికిని, ఆశ్లేషయందు అత్తగారికిని, జ్యేష్ఠయందు భర్త అన్నగారికిని, విశాఖయందు భర్త తమ్మునకు హానిని కలుగజేయును. ఈ నక్షత్రముల యందు యథాశాస్త్రముగా శాన్తి చేయవలయును.

మూలా నక్షత్ర కాలమును 15 భాగములు చేయగా 1 తండ్రికి, 2 పినతండ్రికి, 3 సోదరులకు, 4 పితామహి కి, 5 తల్లికి, 6 పినతల్లికి, 7 మేనమామకు, 8 పెద్దమామకు, 9 మామకు, 10 పశువులకు, 11 దాసీజనమునకు, 12 శిశువునకు, 13 సోదరులకు, 14 తోబుట్టువులకు, 15 జననీజనమునకు సర్వథా దోషకరము గాన శాన్తిని వెంటనే చేయవలయును.

గండాన్త దోషములు మూడు విధములుగా నున్నవి. 1 లగ్నగండాన్తము, 2. తిథిగండాన్తము, 3. నక్షత్ర గండాన్తము.

**1. లగ్నగండాన్తము :** 12-1 లగ్నముల యొక్క 4-5 యొక్కయు. 8-9 యొక్కయు సంధికాలముల యందు (½+½) ఒక గడియకాలము అశుభదాయకము.

**2. తిథిగండాన్తము :** 5-6 తిథులయొక్కయు, 10-11 యొక్కయు 15-1 తిథుల యొక్కయు సంధి కాలము (4+4) 8 ఘడియల కాలము అశుభదాయకము.

**3. నక్షత్ర గండాన్తము :** రేవతి అశ్వినుల యొక్కయు, ఆశ్లేష మఖల యొక్కయు, జ్యేష్ఠ మూలల యొక్కయు, సంధికాలము (2+2) 4 ఘడియల కాలము అశుభదాయకము.

ఈ జ్యేష్ఠా మూలల యొక్క సంధి కాలమును అబుక్తమూలము అని శాస్త్రములు చెప్పుచున్నవి. ఈ సంధికాల పరిమాణము (½+½) 1 ఘడియ అని బృహస్పతి, (1+1) 2 ఘడియలు అని వశిష్ఠుడు. (2+2) ఘడియలు అని నారదుడు (4+4) 8 ఘడియల కాలము అని కాలామృతకారుడు చెప్పుచున్నారు.

**యోగములు :** విష్కంభము, వ్యతీపాత్, శూలం, వజ్రం, అతిగండం, వ్యాఘాతం, పరిఘా పూర్వార్థం, వైధృతి, ఈ యోగములు అశుభదాయకములు.

**కరణములు :** భద్ర - శుభదాయకము, విష్టి - అశుభదాయకము.

**విశేషములు :** నాళవేష్టనము, సంక్రమణము, గ్రహణము, విషఘడియలు, రాహుకాలము, యమగండము, అవమాత్రిద్యుస్పృక్, వై-ప్ర, వ్య-ప్ర, వేధ, క్రాన్తి మొదలగు దుష్ట కాలములందు జన్మించిన అశుభదాయకము మరియు యమల జననము, త్రికప్రసవము, ప్రసవ వైకృతి, సదంత జననము నాళవేష్టనము మొదలగు వికృత ప్రసవములు అశుభదాయకములు. ఇవి సామాన్య దోషములు.

**ఏకనక్షత్ర జననదోషము :** తండ్రి, తల్లి, అన్న వీరల నక్షత్రమందు శిశుజననము అశుభదాయకము గాన యథాశాస్త్రముగా శాన్తి జేయవలెను.

"శాన్తిర్వాపుష్కలాస్యాచ్చేత్తర్హి దోషో న విద్యతే" అని శాస్త్రములు చెప్పుచున్నవి. గాన శాన్తి అవసరము.

ఆశ్లేష, జ్యేష్ఠ, మూలాది నక్షత్రముల యందు కొన్ని పాదములయందు దోషము లేదన్నను ఉగ్రనక్షత్రములగుట చేత తప్పక నవగ్రహ శాన్తిని చేయుట యుక్తముగా భావించవలెను.

**విశేషం :** ఉత్తర నక్షత్రమందు జన్మించిన రెండు మాసములును, పుష్యమి నక్షత్రమున జన్మించిన మూడు మాసములును, చిత్రా నక్షత్రమందు జన్మించిన ఆరు మాసములును, పూర్వాషాఢ నక్షత్రమందు జన్మించిన యెనిమిది మాసములును, ఆశ్లేషా నక్షత్రమునందు జన్మించిన తొమ్మిది మాసములును, జ్యేష్ఠా నక్షత్రమందు జన్మించిన పదునైదు మాసములును, మూలా నక్షత్రమందు జన్మించిన 8 సంవత్సరములును తండ్రి పుత్ర దర్శనము మానివేయవలయును అని కూడా శాస్త్రములు చెప్పుచున్నవి. అందుచే శాస్త్రోక్తముగా నవగ్రహశాన్తి సర్వథా చేయతగియున్నది.

## నిత్యకృత్యములలో ఆచరింపదగినవి

**1. వెండి, బంగారు పాత్రలు వాడుటకు :** బుధ, గురు, శుక్రవారములు – అశ్వి, రో, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హ,చి,స్వా, అనూ, శ్ర, శత, రేవతీ తారలుండగా – అమృతయోగ ఘడియలలో భుజించుట ఆరంభించవలెను.

**2. యజ్ఞోపవీతధారణ:** శ్రావణ పౌర్ణమి, గ్రహణమోక్షం, జాతామృతాశౌచానంతరం, నూతన యజ్ఞోపవీతములు నాలుగు మాసములకొకసారి ధరించాలి.

**3. ఉద్యోగంలో చేరుటకు :** బుధ, గురు, శుక్రవారాలు – అశ్వి,హ,పుష్య,మృగ,చి,అనూ,రేవతీ తారలు – రవి కుజులు 10,11 స్థానాలలో వున్న మంచి లగ్నాలలో చేరవలెను.

**4. యజమాని, సేవకుల అచ్చుబాటు :** యజమాని నామ నక్షత్రము మొదలు, సేవకుని నామనక్షత్రము వరకు లెక్కించి, 4చే గుణించి, దానిని 7చే భాగించగా మిగిలిన సంఖ్య ధనమగును. సేవకుని నామ నక్షత్రము నుండి, యజమాని నామ నక్షత్రము వరకు లెక్కించి 4చే గుణించి 7చే భాగించగా మిగిలిన సంఖ్య ఋణమగును. ధనము ఎక్కువైన మేలు. ఋణము హెచ్చయిన లాభము.

**5. క్రొత్త వాహనములు వాడుట ప్రారంభించుటకు :** 2,3,5,7,10 11,13 శు. తిథులును, సోమ, బుధ, గురు, శుక్రవారాలు – రో, పున, పుష్య, ఉత్తరాత్రయం, హ,చి,స్వా, అనూ,శ్ర, రేవతీతారలు – అష్టమ శుద్ధిగల వృష, మిథు, కట, కన్యా, తులా, ధనుర్మీనలగ్నాలు మంచివి.

**6. మంచములు, కుర్చీలు వగైరా ఫర్నీచర్ వాడుటకు :** 1,2,3,5,7,10 తిథులు – బుధ, గురు, శుక్రవారాలు అశ్వి, రో, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హ,చి, అనూ, శ్ర, రేవతీతారలు శ్రేష్ఠము.

**7. ఋణవిషయం :** హస్తాయుక్త ఆదివారం, సంక్రమణం నాడు, మంగళవారం నాడు అప్పు ఇవ్వకూడదు. పుచ్చుకోకూడదు. అశ్వి, పున, పుష్య, స్వా, వి, శ్ర, ధ, శతభిషా తారలుండ అష్టమశుద్ధి కలిగి 5,9 స్థానాల్లో శుభులున్న చరలగ్నమైతేనే ఋణమీయవలెను ఇవన్నీ కలిసొచ్చినా సరే – బుధవారంగాని, బుధహోరలోగాని అప్పీయకూడదు.

### 8. తలంటు, నేత, నూతన వస్త్రధారణలకు వారఫలములు

| వారము | తలంటు | మంచంనేత | వస్త్రధారణ |
|---|---|---|---|
| ఆదివారము | కళాహీనం | పీడ | చిరుగుట |
| సోమవారము | శాంతి | సౌఖ్యం | చింతన |
| మంగళవారము | అల్పాయువు | దుఃఖం | శుభహాని |
| బుధవారము | ధనలాభం | ధనలాభం | ధనప్రాప్తి |
| గురువారము | ధననష్టం | సౌఖ్యం | జ్ఞానవృద్ధి |
| శుక్రవారము | సౌఖ్యం | రాజ్యలాభం | మిత్రప్రాప్తి |
| శనివారము | సర్వలాభం | నాశనం | మాలిన్యత |

**9. క్రొత్తస్టీలు పాత్రలు, కంచములు వాడుటకు :** శుభతిథులు సో, బు, గు, శుక్రవారాలు అశ్వి, భరణి, రో, మృ, పున, పుష్య, ఉత్తర, హ, చి, స్వాతి, అనూరాధా, రేవతి నక్షత్రములు – శుభలగ్నములు మంచివి.

**10. క్రొత్తబట్టలు తదుపుటకు :** శ్రాద్ధదినములు – పంచపర్వములు పనికిరావు. **శుభతిథులలో** బుధ, గురు, శుక్రవారములు – **అశ్వి**, పున, పుష్య, హ, చి, స్వా, అనూ, ధనిష్ఠా తారలందును క్షేమము.

**11. గ్యాస్‌స్టౌ, ఫ్రిజ్, మిక్సీలవంటి ఆధునిక పరికరాలవాడకం మొదలు పెట్టుటకు :** 2,3,5,7,10,11 13 తిథులూ బుధ, గురు, శుక్రవారములు వర్జ్య, దుర్ముహూర్తాలు లేని కుజహోరలో మంచివి.

**12. పరామర్శకు :** ద్విపాద త్రిపాద తారలు, ధనిష్ఠా పంచకం పనికిరావు. సంఘటించినదాది సంవత్సరం లోపల ఏదో ఒక జేసి నెల మంచిది. మంగళ, శుక్రవారాలు కూడవు.

**1. కనుములు** : మరణం, శవదహనం, సపిండీకరణం, జాతర, సంక్రమణం, జాతర, సంక్రమణం, గ్రహణం - ఇవి జరిగిన మరుసటి రోజును 'కనుమ' అంటారు.

**2. కరిదినములు :** 1. హోళీ పండుగ, 2. గ్రహణ దినము, 3. భావుక దినము, 4. అయన దినములు, 5. ప్రేతదాహ దినములు పైన తెల్పిననాటి మరుదినములు కరిదినములు సకల శుభకర్మలకు పై దినములు నిషిద్ధములు.

**3. నిషిద్ధనవమీత్రయం :** ఏదైనా ఒక ప్రయాణం చేసిన 9వ రోజునగాని ఆ తిథికి 9వ తిథినిగాని, ప్రవేశము చేయరాదు. ప్రవేశించిననాటి 9వ నాడుగాని, 9వ తిథినిగాని - అటునుండి బయలుదేరరాదు. వీటినే ప్రయాణనవమి, ప్రవేశనవమి, ప్రత్యక్షనవమి అంటారు. ఈ మూడు నవములు నిషిద్ధములు.

**4. సిద్ధియోగములు :** శుక్రవారం 1,6,11 తిథులు - బుధవారం 2,7,12 తిథులు - మంగళవారం 3,8,13 తిథులు - శనివారం 4,9,14 తిథులు - గురువారం 5,10,15 తిథులు - వీటిని సిద్ధియోగము లంటారు. కార్యానుకూలత - విశేష ఫలప్రదాయకత వీటి లక్షణం.

**5. పక్షచ్ఛిద్ర తిథులు** : 4,6,8,12,14 - తిథులు.

**6. త్రిస్రోష్టకం :** మార్గశిర, పుష్య, మాఘ, ఫాల్గుణము 4 మాసముల్లోనూ -కృష్ణపక్షాన వచ్చే 7,8,9 తిథులతో కూడిన దినములను త్రిస్రోష్టకము లందురు. ఇవి అనాధ్యాయములు.

**7. విసర్జించవలసిన వేళలు :** గ్రహణాది 7 రోజులు, లగ్నాంత ½ ఘడియ, నక్షత్రాంత 2½ ఘ॥లు మాసాంత 3 రోజులు, సంవత్సర ప్రారంభమున 15 రోజులు సంవత్సరాంతమున 15 రోజులు వర్జనీయాలు. శుభకార్యములు చేయరాదు.

**8. సర్వార్థసాధన చక్రము :** ఈ దిగువ చక్రము ప్రకారము వార నక్షత్రములున్నచో సర్వకార్యారంభములకును శుభప్రదము.

## శుభ శకునములు

సువాసినీ, వేశ్య, ఇద్దరు బ్రాహ్మణులు, దండధరుడగు శూద్రుడు, మంగళవాద్యము, ఫలములు, పుష్పములు, ఛత్రము, చామరము, అశ్వము, ఏనుగు, వృషభము, పూర్ణ జలకుంభము, చెఱకు, అన్నము, పాలు, పెరుగు, మాంసము, కల్లుకుండ, పొగలేని అగ్ని, తేనె, చలువ వస్త్రములు, అక్షతలు, వీణ, మద్దెల, శంఖము, పధూపరులు, ఘంటానాదము, జయశబ్దము మంగళ వస్తువులు, అభిముఖముగా వచ్చిన మృదుశీతలవాతము, అనుకూలమగు పశ్చాద్వాతము మొదలగునవి శుభశకునములు శుభ ఫలములను ఇచ్చును.

## అశుభ శకునములు

ఒంటి బ్రాహ్మణుడు, విధవ, కాషాయ వస్త్రధారి, కట్టెలు మోపు, పాము, కొత్తకుండ, నూనె కుండ, బిచ్చగాడు, కుంటికుక్క ముక్కులేనివాడు, రోగి, అంధుడు, కుంటివాడు, రజస్వల, ఒంటితుమ్ము, సకిలించుట, వస్త్రాధికము జారిపడుట, దురుక్తులు వినుట, భుజించి పొమ్మనుట, నేను కూడా వచ్చెదననుట, ఈ పూట వద్దనుట, ప్రధాన వస్తువులు మరచుట, వెతికిన దొరకక పోవుట, ఎదురుదెబ్బ తగులుట మొదలగునవి అశుభశకునములు అశుభ ఫలములను ఇచ్చును.

## సుస్వప్నములు

మేడలు, పర్వతములు, ఫల వృక్షములు, రథము, గుఱ్ఱము, ఏనుగులను చూచుట, ఎక్కుట, ప్రభువు, బంగారము, ఎద్దు, ఆవు, పండ్లు, పూలు, గోక్షీరము, గోఘృతము, కన్య, వేశ్య, రత్నములు, ముత్యములు, శంఖము, దేవతా విగ్రహములు, చందనము, పుణ్య స్థలములను చూచుట, పాలు, పెరుగు, నెయ్యి, తేనె, భక్ష్యములను భక్షించుట, పీతాంబరమును ధరించుట, ఆభరణములు ధరించుట, జయములను పొందుట ఈ మొదలగు స్వప్నములు శుభస్వప్నములు శుభఫలములనిచ్చుట.

## దుస్స్వప్నములు

సర్పము, దున్నపోతు, నూనె, ఆముదము, బురదలో దిగుట, సముద్రములో దిగుట, బండినుంచి పడుట, మృతవార్త వినుట, ప్రలాపము చేయుట, ఖైదుపడుట, వైద్యుని చూచుట, విధవను చూచుట, క్షౌరము చేయించుకొనుట, ముండ్ల పొదలోపడుట, తన గొంతుకు ఉరివేయుట, తన చేతిలోని ఫలములను ఇతరులు లాగికొనుట, తనను కొట్టుట, గాడిదను ఎక్కుట, దున్నపోతును ఎక్కుట, కాకిని చూచుట మొదలగు స్వప్నములు దుస్స్వప్నములు దుష్ఫలములనిచ్చును.

రాత్రి 1వ ఝామములో వచ్చిన కల 1 సం॥నకు, 2వ ఝామములో కల 6 నెలలకు, 3వ ఝామములో కల 1 నెలలోను, 4వ ఝామములో కల శీఘ్రముగను ఫలించును. పగలు నిద్రించునపుడు వచ్చు స్వప్నములకును, పైత్యము, అజీర్ణము, వాత దోషములవలన వచ్చు స్వప్నఫలములకు ఫలితములుండవు. దుస్స్వప్నములు వచ్చినచో లేచి శిరఃస్నానము చేసి శివుని ఎదుట దీపముంచి ప్రార్థించవలెను. మంచి కల వచ్చినప్పుడు మెలకువ వచ్చినయెడల తిరిగి నిదురించరాదు.

## వింశోత్తరీదశాన్తర్దశా చక్రము

| భుక్తులు | సూర్య మహాదశా సం॥ 6 | | | భుక్తులు | చన్ద్రమహాదశా సం॥ 10 | | | భుక్తులు | కుజమహాదశా సం॥ 7 | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం. | మా. | ది. | | సం. | మా. | ది. | | సం. | మా. | ది. |
| రవి | 0 | 3 | 18 | చన్ద్ర | 0 | 10 | 0 | కుజ | 0 | 4 | 27 |
| చన్ద్ర | 0 | 6 | 0 | కుజ | 0 | 7 | 0 | రాహు | 1 | 0 | 18 |
| కుజ | 0 | 4 | 6 | రాహు | 1 | 6 | 0 | గురు | 0 | 11 | 6 |
| రాహు | 0 | 10 | 24 | గురు | 1 | 4 | 0 | శని | 1 | 1 | 9 |
| గురు | 0 | 9 | 18 | శని | 1 | 7 | 0 | బుధ | 0 | 11 | 27 |
| శని | 0 | 11 | 12 | బుధ | 1 | 5 | 0 | కేతు | 0 | 4 | 27 |
| బుధ | 0 | 10 | 6 | కేతు | 0 | 7 | 0 | శుక్ర | 1 | 2 | 0 |
| కేతు | 0 | 4 | 6 | శుక్ర | 1 | 8 | 0 | రవి | 0 | 4 | 6 |
| శుక్ర | 1 | 0 | 0 | రవి | 0 | 6 | 0 | చన్ద్ర | 0 | 7 | 0 |
| **భుక్తులు** | **రాహు మహాదశా సం॥ 18** | | | **భుక్తులు** | **గురు మహాదశా సం॥ 16** | | | **భుక్తులు** | **శని మహాదశా సం॥ 19** | | |
| రాహు | 2 | 8 | 12 | గురు | 2 | 1 | 18 | శని | 3 | 0 | 3 |
| గురు | 2 | 4 | 24 | శని | 2 | 6 | 12 | బుధ | 2 | 8 | 9 |
| శని | 2 | 10 | 6 | బుధ | 2 | 3 | 6 | కేతు | 1 | 1 | 9 |
| బుధ | 2 | 6 | 18 | కేతు | 0 | 11 | 6 | శుక్ర | 3 | 2 | 0 |
| కేతు | 1 | 0 | 18 | శుక్ర | 2 | 8 | 0 | రవి | 0 | 11 | 12 |
| శుక్ర | 3 | 0 | 0 | రవి | 0 | 9 | 18 | చన్ద్ర | 1 | 7 | 0 |
| రవి | 0 | 10 | 24 | చన్ద్ర | 1 | 4 | 0 | కుజ | 1 | 1 | 9 |
| చన్ద్ర | 1 | 6 | 0 | కుజ | 0 | 11 | 6 | రాహు | 2 | 10 | 6 |
| కుజ | 1 | 0 | 18 | రాహు | 2 | 4 | 24 | గురు | 2 | 6 | 12 |
| **భుక్తులు** | **బుధ మహాదశా సం॥ 17** | | | **భుక్తులు** | **కేతు మహాదశా సం॥ 7** | | | **భుక్తులు** | **శుక్ర మహాదశా సం॥ 20** | | |
| బుధ | 2 | 4 | 27 | కేతు | 0 | 4 | 27 | శుక్ర | 3 | 4 | 0 |
| కేతు | 0 | 11 | 27 | శుక్ర | 1 | 2 | 0 | రవి | 1 | 0 | 0 |
| శుక్ర | 2 | 10 | 0 | రవి | 0 | 4 | 6 | చన్ద్ర | 1 | 8 | 0 |
| రవి | 0 | 10 | 6 | చన్ద్ర | 0 | 7 | 0 | కుజ | 1 | 2 | 0 |
| చన్ద్ర | 1 | 5 | 0 | కుజ | 0 | 4 | 27 | రాహు | 3 | 0 | 0 |
| కుజ | 0 | 11 | 27 | రాహు | 1 | 0 | 18 | గురు | 2 | 8 | 0 |
| రాహు | 2 | 6 | 18 | గురు | 0 | 11 | 6 | శని | 3 | 2 | 0 |
| గురు | 2 | 3 | 6 | శని | 1 | 1 | 9 | బుధ | 2 | 10 | 0 |
| శని | 2 | 8 | 9 | బుధ | 0 | 11 | 27 | కేతు | 1 | 2 | 0 |

# ప్రశ్న ప్రకరణము

**1. ప్రశ్న విషయము:** ప్రశ్నించిన వేళకు లగ్నము మేషమైనచో మానవ విషయము, వృషభమైన పశు విషయము, మిధునమైన ధన పరము, కటకమైన వ్యవహారము, సింహమైన రాజకీయము, కన్యయైన వధూ ప్రసక్తి, తులయైన లోహ విషయం, వృశ్చికమైన వ్యాధి, ధనుస్సయిన ధనపరము, మకరము మనోచింత, కుంభం గృహ విషయము, మీనమైన ప్రయాణ విషయము అని తెలుపవలెను.

**2. పనియగునా? కాదా?:** ప్రశ్నించిసవేళకు లగ్నము మీన మిధున కన్యలైన శీఘ్రముగా పని యగును. తులా, కుంభ, వృషభములైన కార్యసాఫల్యము. మేష ధనుస్సింహము లందు కార్యాలస్యము, మకర, వృశ్చిక, కటకము లందు కార్య నాశనమని ఎరుగవలెను.

**3. పుట్టబోవునది స్త్రీ శిశువా? పురుష శిశువా?:** ప్రశ్న లగ్నం నుండి 9-5-7-3 స్థానములందు రవి, కుజ, గురులున్నచో పుత్రుడని, 2-4-6 స్థానములలో చంద్ర, శుక్రులున్నచో పుత్రికయని, 2-4-6-8 స్థానములలో శని, బుధులున్నచో నపుంసకులని చెప్పవలెను. లగ్నాత్తు చతుర్థమున ఎన్ని గ్రహము లుండిన అందరు సంతానమని అనగా 2 వున్న కవలలని, 3 వున్న ముగ్గురని చెప్పుటకూడా కలదు.

**4. మరియొక పద్ధతి:** గర్భిణీ స్త్రీ యొక్క నామాక్షరముల సంఖ్యను 7చే గుణించి దానికి ఆనాటి తిథి సంఖ్యను కలిపి, 9చే, భాగించవలెను. వచ్చిన శేషము సరి సంఖ్యయైన స్త్రీ శిశువని, బేసియైన పురుష శిశువని తెలియవలెను.

**5. ప్రయాణ లాభాలాభములు:** తన నీడ వల్ల కలిగిన పాదచ్ఛాయల సంఖ్యను 3చే గుణించి 13 కలిపి 8చే భాగించగా శేషం 1 అయిన ధనలాభం, 2 ధన నాశనం, 3-4-7 లయిన ప్రమాదం, 5-6 లయిన శుభం, 8 అయిన ప్రాణాపాయ మని చెప్పవలెను.

**6. దేశాంతర మేగినవారు ఎప్పుడు వత్తురు?:** ప్రశ్న లగ్నమున బుధ, చంద్ర, కేతువులున్నచో తిరుగు మార్గమందున్నాడని, గురు, శుక్రులున్న చేరువకు చేరినాడు, ఒకటి రెండు నాళ్ళలో రాగలడని, కుజ, రవులున్నచో ఇంకా అక్కడనే ఉన్నాడని, శని, రాహువులున్నచో అనారోగ్యము వలన రాలేకపోయినాడని తెలియవలెను.

**మరియొక్క పద్ధతి :** ప్రశ్నించిన వానిని 27 అంకె లోపల ఒక అంకె చెప్పమని అది అశ్విన్యాది నక్షత్రములలో ఏ నక్షత్రమగునో చూచి, ఆరుద్ర మొదలు ఆ నక్షత్రము వరకు లెక్కించి దానిని 7చే భాగించగా శేషం 1 అయిన శీఘ్రముగా వచ్చునని, 2 అయిన అక్కడనే వున్నాడనీ, 3 అయిన యింటికి వచ్చుచున్నాడని, 4 సమీపమునకు చేరుకున్నాడని, 5 మార్గ మధ్యమందున్నాడని, 6 జబ్బుపడి యున్నాడని, 7 మృత్యుగతమని తెలియవలెను.

**7. నష్టద్రవ్య ప్రశ్న:** కేంద్ర, త్రికోణ, అష్టమ, ధన (4,7,10,11,9,8,2) స్థానములందు శుభ గ్రహసంబంధము లేనివీ, పాపగ్రహ సంబంధముతో యున్న పాపులున్న యెడల పోయిన సొమ్ము దొరకదనియు, ఆ ప్రయత్నమందు మరికొంత ద్రవ్యము ఖర్చు అగునేగాని ప్రయోజన ముండదని తెలుపవలెను. మరియు 1,5,9,2,3,10,11 స్థానములలో శుభ గ్రహములు బలవంతులై యుండగా 1,5,9,4,7,10,8,11 స్థానములలో పాప గ్రహములు లేని యెడల పోయిన సొమ్ము తిరిగి దొరుకునని చెప్పవలెను.

**8. నక్షత్రమును బట్టి చోర ప్రశ్న:** 1. రోహిణి, పుష్యమి, ఉత్తర, విశాఖ, పూర్వాషాఢ, ధనిష్ఠ, రేవతి అను యీ 7ను అంధక నక్షత్రము లనబడును. ఈ తారల యందు దొంగిలింపబడిన వస్తువులు తిరిగి లభించునని చెప్పబడినది. 2. మృగశిర, ఆశ్లేష, హస్త, అనూరాధ, ఉత్తరాషాఢ, శతభిషం, అశ్విని - ఇవి 7ను మందాక్షములన బడును. ఈ తారలలో పోయిన సొమ్ము కొంచెము ప్రయత్నముపై లభించును. 3. ఆర్ద్ర, మఖ, చిత్ర, జ్యేష్ఠ, అభిజిత్, పూర్వాషాఢ, భరణి ఈ 7ను మధ్యమములు. ఈ తారలందు పోయినవి తిరిగి లభించుట కష్టం. మిక్కిలి ప్రయాసము పై లభించిన లభించవచ్చును. 4. పునర్వసు, పుబ్బ, స్వాతి, మూల, శ్రవణం, ఉత్తరాభాద్ర, కృత్తిక - ఈ 7ను సులోచనము లనబడును. ఈ తారలలో పోయిన వస్తువులు తిరిగి దొరుకుట అరుదు అని రత్నమాలావచనము.

**9. ఉద్యోగ ప్రశ్న:** ప్రశ్న లగ్నమునకు 7,10 స్థానములలో శుభ గ్రహములున్నను లేదా శుభగ్రహ వీక్షణమున్నను త్వరలో ఉద్యోగము లభించునని చెప్పవలెను. రాహువు 7,10 స్థానములలో వున్న ఉద్యోగ భంగముండవచ్చునని చెప్పవలెను.

**10. పెండ్లి ఎప్పుడు జరుగును:** ప్రశ్న లగ్నము మేషము లగాయితు సమరాశు లందుండి, శుక్రుడు సమరాశులలో యున్నచో త్వరలోనే పెండ్లి జరుగునని చెప్పవలెను. గురు వీక్షణమున్న, గురుడు కేంద్రమందున్న త్వరలో సూచించును.

## ప్రథమార్తవమున దుష్టమాసాది నిర్ణయము

1. **మాసములు:** చైత్రము, జ్యేష్ఠము, ఆషాఢము, భాద్రపదము, కార్తీకము, పుష్యము – ఈ ఆరుమాసములు స్త్రీ ప్రథమ రజస్వలయైన అశుభదాయకము.

2. **తిథులు :** ప్రతిపత్, చవితి, షష్ఠి, అష్టమి, నవమి, ద్వాదశి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, అపమృత్రిద్యుస్పృక్ – ఈ తిథులు అశుభప్రథములు

3. **నక్షత్రములు:** భరణి, కృత్తిక, పునర్వసు, ఆశ్లేష, మఖ, పూ.ఫ., పూర్వాషాఢ, పూర్వాభాద్ర, విశాఖ, జ్యేష్ఠ – ఈ నక్షత్రములు అశుభప్రదములు. మరియు భర్తృనక్షత్రము తనకు నైదనతార, భర్తకు అష్టమ చంద్రుడు అశుభప్రదములు.

4. **వారములు:** ఆదివారము, మంగళవారము, శనివారము అశుభప్రదములు.

5. **యోగములు:** విష్కంభము, గండము, అతిగండము, శూలము, వ్యాఘాతము, పరిఘ పూర్వార్ధము, వ్యతీపాత్, వైధృతి – ఈ యోగములు అశుభప్రదములు.

6. **కరణములు:** (విష్టి) అశుభప్రదము, భద్ర మంగళప్రదము.

7. **లగ్నములు:** మేషము, సింహము, వృశ్చికము, మకరము, కుంభము – ఈ లగ్నములు అశుభప్రదములు.

8. **విశేషములు:** సంక్రమణము, గ్రహణకాలము, సూర్యోదయము, సూర్యాస్తమయము, అపరాహ్ణము, అర్ధరాత్రి, అపరరాత్రి, పర్వకాలము, రాహు కాలము, యమగండము, నిద్రాసమయము, ఆర్తి సమయము వ్య.ప్ర.నై.ప్ర. వేధలు, క్రాన్తులు మొదలగు కాలములు అశుభప్రదములు.

9. **వస్త్రములు:** నీల వస్త్రము, రక్తవస్త్రము, చిత్రావస్త్రము, జీర్ణవస్త్రము, దిగంబరత్వము అశుభదాయకములు.

10. **స్థానములు:** పరగృహము, గ్రామాన్తరము, మార్గమధ్యము, అపవిత్రార్థములు అశుభప్రదములు.

11. **సంనివేశము:** సంమార్జనీ, కాష్ఠము, తృణము, అగ్ని, చేట, కత్తి హస్తములో ధరించియున్న అశుభప్రదములు.

12. **బిందుఫలము:** వస్త్రమునందు ఒకటి రెండు బిందువులు శుభప్రదము, అనేక బిందువులు అశుభప్రదములు. కొందరు బేసి బిందువులు శుభప్రదములు, పుత్ర ప్రదములు, సరిబిందువులు రోగ ప్రదములు పుత్రికా ప్రదములు అనియు చెప్పుచున్నారు.

13. **ప్రథమార్తవశుభకాలపు నిర్ణయము:** అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ 17 నక్షత్రముల యందును, సోమ, బుధ, గురు, శుక్రవారము లయందును, ఈ గ్రహముల యొక్క లగ్నముల యందును, ఆర్తవ లగ్నమునకు శుభ గ్రహములు 2,4,5,7,9,10,11 ఈ స్థానముల యందుండగాను పాప గ్రహములు 3,6,11 స్థానముల యందుండగాను, చంద్రహోరయందును ప్రథమార్తవము జరిగెనేని సౌఖ్యము, సౌభాగ్యము, సంతానము, సంపద, ఆయుష్యము, అర్థలాభము, ఆరోగ్యము, ఆనందము, ప్రియవాల్లభ్యము, యశస్సు మొదలగు శుభఫలములు లభించును.

| రాహుకాలము | | | యమకంటక కాలము | | | గుళిక కాలము | | |
|---|---|---|---|---|---|---|---|---|
| వారములు | ఘంటలు మొదలు | ఘంటలు వరకు | వారములు | ఘంటలు మొదలు | ఘంటలు వరకు | వారములు | ఘంటలు మొదలు | ఘంటలు వరకు |
| ఆది | 4½ | 6 | ఆది | 12 | 1½ | ఆది | 3 | 4½ |
| సోమ | 7½ | 9 | సోమ | 10½ | 12 | సోమ | 1½ | 3 |
| మంగళ | 3 | 4½ | మంగళ | 9 | 10½ | మంగళ | 12 | 1½ |
| బుధ | 12 | 1½ | బుధ | 7½ | 9 | బుధ | 10½ | 12 |
| గురు | 1½ | 3 | గురు | 6 | 7½ | గురు | 9 | 10½ |
| శుక్ర | 10½ | 12 | శుక్ర | 3 | 4½ | శుక్ర | 7½ | 9 |
| శని | 9 | 10½ | శని | 1½ | 3 | శని | 6 | 7½ |

**సోమోశనిర్భృగుశ్చై వ,**
**సౌమ్యోజీవః కుజోరవిః ।**
**ఆదిలోపశ్చతుర్నాద్యః**
**రాహుకాలః ప్రకీర్తితః ॥**

**గురుస్సౌమ్యః కుజస్సోమః,**
**భానుర్మందశ్చ భార్గవః ।**
**అన్త్యలోపః చతుర్నాద్యః**
**కాలోఽయం యమకంటకః ॥**

**శనిశ్శుక్రో గురుస్సౌమ్యః**
**కుజస్సోమోదివాకరః ।**
**అన్త్యలోప శ్చతుర్నాద్యః**
**కాలోయం గుళికస్స్మృతః ॥**

ఉదయం 6 గంటల మొదలు కాలం 1 కి 1½ గంట వంతున సాయంకాలం 6 గంటల వరకు 8 కాలములు ప్రతిదినము ఆ వారాధిపతి మొదలు రవి కుజ గురు బుధ శుక్ర శని చంద్ర రాహువులు క్రమంగా 8 కాలములకు అధిపతులు. పాపగ్రహాధిపత్య కాలములు, రాహువునకు నిర్ణయించబడిన కాలము రాహుకాలమనియు శుభకార్యములకు మిక్కిలి వర్జింపతగినవి అందురు. ఉదయాస్తమానముల వృద్ధి క్షయములను బట్టి కాలముల నిర్ణయింపదగి యున్నవి.

## అశౌచ నిరూపణమ్

## ధర్మ శాస్త్రములు

కూటస్థుని దగ్గరనుంచి యేడుగురు పురుషుల వరకు సపిండులు, తరువాత యేడుగురు పురుషుల వరకు (14) సమానోదకులు, తరువాత యేడుగురు పురుషుల వరకు (21) సగోత్రులు అనియు చెప్పుచున్నవి. మరియు సాపిండ్యము పురుష జనన విషయములో సప్తపూరుషము - స్త్రీ జనన విషయములో త్రిపూరుషమనియు చెప్పుచున్నవి. ఈ సాపింద్యాదులను సరించియే అశౌచము ప్రవర్తించుచున్నది. ఈ అశౌచము, 1 జాతా శౌచము, 2 మృతాశౌచము అని రెండు విధములుగా నున్నది.

### జాతాశౌచము

**జననమందు:** జ్ఞాతులందరకు పది దినములు జాతా శౌచము, గర్భస్రావము 4వ మాసమున జరిగిన తండ్రికి మాత్రము స్నానము. 5,6 మాసములయందు జరిగిన తండ్రికి జ్ఞాతులకు స్నానము, 7,8,9 మాసములయందు జరిగిన అందరకు 10 దినముల అశౌచము.

తల్లికి పురుష ప్రసవమునందు 30 దినములు - స్త్రీ ప్రసవమునందు 40 దినములు అశౌచమ అనంతరము శుద్ధియగును. దీనిని నెలపురుడు అందురు.

10 దినముల వరకు - అనిరీక్ష్యత్వాది (చూడకుండుట) రూపమగు అశౌచము.

అనంతరము - అస్పృశ్యత్వ (తాకకుండుట) కర్మానర్హత్వ (కర్మలకు పనికిరాకుండుట) రూపమగు అశౌచము.

కుమార్తె ప్రసవించిన మొదట పుత్రజననమైతే ఆ కుమార్తె యొక్క తల్లిదండ్రులకు (3) మూడు దినములు జాతాశౌచము.

### మృతాశౌచము

జననము మొదలు 10 దినములలోగా శిశువు మరణించిన తండ్రికి జ్ఞాతులకు అందరకు జాతాశౌచ శేషముతో శుద్ధియగును - మృతాశౌచము లేదు.

పది దినములకు పైన 6 మాసములకు లోగా శిశువు మరణించిన జ్ఞాతులకు స్నానమాత్రము. 6 మాసములకు పైన 3 సంవత్సరములకు లోగా శిశువు మరణించిన తల్లిదండ్రులకు, జ్ఞాతులకు బాల మరణమున 1 దినమును, బాలికా మరణమున సద్యశ్శౌచము.

3 సంవత్సరములకు పైన ఉపనయనమగు వరకు జ్ఞాతులకు త్రిరాత్రము అశౌచము.

ఉపనయనానంతరము వటువు మరణించిన తల్లిదండ్రులకు, భ్రాతలకు, అందరు జ్ఞాతులకు దశరాత్రము అశౌచము.

3 సం॥లకు పైన, వివాహములోపల బాలికా మరణమునందు, తల్లిదండ్రులకు భ్రాతలకు దశరాత్రాశౌచము. జ్ఞాతులకు దినము అశౌచము.

### దశరాత్రాశౌచము

జ్ఞాతి (సపిండుని) మరణమునందు జ్ఞాతులకు దశరాత్రాశౌచము.

### త్రిరాత్రాశౌచము

శిశు జననమందును, ఉపనీతుని మరణమందును సమానోదకులకు మూడు దినములు అశౌచము, సగోత్రులకు అహస్సు అశౌచము, అనుపనీతుని మరణమునందు స్నానమాత్రము.

సపిండుడు, సమానోదకుడు, సగోత్రుడు మొదట వివరించబడియున్నారు. అశౌచ విషయములో ప్రమాణము.

**దశాహే న స పిండానాం శుద్ధి స్యాత్తు త్రిరాత్రతః సమానోదక జాతానాం, గోత్రజానా మహాస్స్మృత్యం ॥**

భగినీపుత్ర (తోబుట్టువు కుమారుని) మరణమందు తల్లితో బుట్టువులకు, తల్లిసోదరులకు త్రిరాత్రం అపరోక్షమున పక్షిణీ – అనుపనీత మరణమునందు స్నానమాత్రము.

పినతల్లి అనూఢ అయిన మేనమామ అనుపనీతుడైన స్నానమాత్రము.

మాతామహి మాతామహుల యొక్క మరణమునందు దౌహిత్రునకు త్రిరాత్రము పక్షిణి.

అత్త, మామల మరణమునందు – అల్లునకు తన భార్యా జీవించియున్న త్రిరాత్రము.

### పక్షిణ్యాశౌచము

**వివాహితయగు స్త్రీకి:** 1. తల్లితండ్రి, 2. తల్లితల్లి, 3. మేనమామ, 4. అయన కొడుకు, 5. కూతురు, 6. తల్లితోబుట్టువు, 7. ఆమె కొడుకు, 8. కూతురు, 9. తనతోబుట్టువు, 10. ఆమె కొడుకు, 11. కూతురు, 12. తనతోబుట్టినవాడు, 13. అయన కొడుకు, 14. కూతురు, 15. తండ్రితోబుట్టువు, 16. ఆమె కొడుకు, 17. కూతురు, 18. తండ్రితోబుట్టినవాడు, 19. అయన కొడుకు, 20. కూతురు, 21. కొడుకు, కూతురు, 22. కూతురి కూతురు, 23. తండ్రి తండ్రి, 24. తండ్రి, తల్లి.

ఈ పై తెల్పిన 24 మంది యొక్క మరణమునందు వివాహిత యగు స్త్రీకి పక్షిణీ అశౌచము సంభవించును.

**పురుషునకు:** 1. మేనమామ కొడుకు, 2. కూతురు, 3. తల్లితోబుట్టువు కొడుకు, 4. కూతురు, 5. తండ్రితోబుట్టువు కొడుకు, 6. కూతురు, 7. తనతోబుట్టువు, 8. ఆమె కొడుకు, 9. కూతురు, 10. తన సోదరుని కూతురు, 11. తండ్రి సోదరుని కూతురు, 12. కుమారుని కూతురు, 13. కూతురి కూతురు.

ఈపై తెల్పిన 13 మంది మరణమునందు పురుషునకు పక్షిణీ అశౌచము సంభవించును. ఈ పక్షిణీ అశౌచము వివాహితలగు స్త్రీల యొక్కయు, ఉపనీతులగు పురుషుల యొక్కయు మరణమునందే సంభవించును. అంతకు పూర్వమైన స్నానముచేతనే శుద్ధియగును. పక్షిణీ అనగా అశౌచము విన్న పగలుభాగము, ఆ రాత్రి భాగము మరుదినము పగలుభాగము, 3 భాగములు కలిసిన పక్షిణీ అనబడును. రాత్రి విన్నను అటులనే రాత్రి పగలు రాత్రి మూడు భాగములు పక్షిణీ అనబడును.

### ఏకదినాశౌచము

సపతి కూతురు యొక్క మరణమునందు సపతి తల్లికి, సపతి తల్లియొక్క మరణమునందు సపతి కూతురునకు, ఏకదినము. భిన్నోదరమాతుల మరణమునందు ఒక దినము రాజుయొక్క మరణమునందు సన్నిధానమున ఒక దినము.

### అతిక్రాంతాశౌచము

జనన విషయములో అతిక్రాన్తాశౌచము లేదు అని చెప్పబడినది.

మరణ విషయములో దశాహాశౌచము కలవారికి 10 దినములు అతిక్రమించిన తరువాత స్నానమాత్రము.

త్రిరాత్రా శౌచము అతిక్రమించిన యెడల ఒక దినము అశౌచము.

ఏకదినాశౌచము అతిక్రమించిన యెడల స్నానమాత్రం.

పక్షిణ్యాశౌచము అతిక్రమించిన యెడల దశాహ మధ్యమందైన ఏక కాలము, అనగా పగలు విన్న పగలు రాత్రి విన్న రాత్రి అశౌచము, దశాహానంతరమందైన స్నానమాత్రము.

### ఆశౌచసాంకర్యమునందు

జాతాశౌచకాలములో సమాన పరిమాణము గల మరియొక జాతాశౌచము వచ్చిన అదిపూర్వాశౌచ శేషము తోడనే శుద్ధియగును.

మృతాశౌచకాలములో సమపరిమాణము గల మృతాశౌచముకాని జాతాశౌచముగాని వచ్చిన యెడల రెండును పూర్వాశౌచము శేషముతోడనే శుద్ధియగును.

**సూతకాదుల ప్రారంభ నిర్ణయము:** జాతాశౌచ, మృతాశౌచ, రజస్వలాదులందు అవిరాత్రి జరిగినచో రాత్రిఘడియలు 3 భాగములు చేసి తొలి రెండు భాగములందైన పూర్వదినముగనూ, తుదిభాగమందైన పరదినముగాను గణింపవలెను. తల్లిదండ్రులు

1 సంవత్సరము సూతకము. తానే కర్తయైన సవతితల్లి మృతి విషయములో 6 నెలలు సూతకము. స్వభార్యమృతికి 3 నెలలు ఇతరులు యందు సూతక ప్రసక్తిలేదు.

**తర్పణక్రమం:** ముందుగా తల్లిదండ్రులకు, సవతి తల్లి, మాతామహ, పితామహ, ప్రపితామహాదులు, తన భార్య, కుమారులు, పినతండ్రి, పెదతండ్రులు, మేనమామ, కూతురు, బావలు, మరదులు, అత్తమామలు, ఆచార్యుడు, గురువు, ప్రభువు, స్నేహితుడు ఈ క్రమమందే తర్పణాలీయవలెను. మాతామహ్యాదులకు పితృపితామహ్యాదులలో కలపకుండగా వేరుగా తర్పణమునిచ్చుట. భార్యలు పోయినవారికి సభార్యానాం అనియు, బిడ్డలు పోయినవారికి ససంతతేయనియు, భర్తలు పోయినవారికి సభర్తృణాం అనియు గోత్రపూర్వకముగా తర్పణ మిచ్చుట. ఇందలి గొప్ప విశేషము. సవతి తల్లికి వలెనే సాపత్న్య సోదరులకు కూడా తర్పణమీయవలెను.

## మృత విషయమై గృహవర్జన

1-2-3-6-9-12-14-30 తిథులు, ఆది, మంగళ, శుక్రవారములు దోషములు, చిత్ర, మృగశిరానక్షత్రములు ఇందలి మృతి విషయమై 3 నెలలు, కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ, విశాఖా పునర్వసులందైనచో 4 నెలలు, రోహిణి, మఖ, ఆశ్లేష, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతులందైనచో 6 నెలలు, భరణీ నక్షత్రమైన 1 నెల. ఆ గృహమును విసర్జించవలెను. చెడు తిథి, చెడువారము అయి-నక్షత్రము బాగున్నచో అర్ధ దోషమగును. తిథి వారములతో నక్షత్రము కలిసినచో పూర్ణదోషము. తిథికంటె వారదోషము ఎక్కువ. శుక్రవారముకంటె మంగళవారము కీడు కల్గించును. ఈ వారములతో ద్వి-త్రిపాద-ధనిష్ఠా పంచక నక్షత్రములు కల్సినచో ఒక మరణముతో మరొక మరణము సూచ్యము. కాన గృహమును విసర్జించుట మంచిది.

## నక్షత్రశూలలు

శ్లో॥ పూర్వే జ్యేష్ఠాధనిష్ఠే చ శ్రోణాశ్విన్యౌ చ దక్షిణే ।
పశ్చిమేపుష్య రోహిణ్యావుత్తరేహస్త ఫల్గుని ఏత
న్నక్షత్ర శూలాసు యాత్రా న పునరాగమః ॥

తా॥ జ్యేష్ఠ ధనిష్ఠ తూర్పు దిక్కునకును, శ్రవణాశ్వినులు దక్షిణ దిక్కునకును, పుష్యమీ రోహిణులు పశ్చిమ దిక్కునకును, హస్త పుబ్బ ఉత్తరలు ఉత్తర దిక్కునకును శూల సంజ్ఞలు గలవి. కనుక ఈ నక్షత్ర శూలలలో ప్రయాణము చేసిన వారు తిరిగి రారు అని తాత్పర్యము. వీనికి శాంతులు.

శ్లో॥ నక్షత్ర శూలాశాంత్యర్థం దధితైలం గుడం తథా ।
పాయసం చ ప్రదాతవ్యం దిక్షుప్రాగాదిషు క్రమాత్ ॥

తా॥ తూర్పుదిక్కునందు శూలలుగల నక్షత్రములకు పెరుగును, దక్షిణ దిక్కునందు శూలలుగల నక్షత్రములకు తైలమును, పశ్చిమ దిక్కునందు శూలలుగల నక్షత్రములకు బెల్లమును, ఉత్తర దిక్కునందు శూలలుగల నక్షత్రములకు క్షీరాన్నమును దానము చేయవలెను.

## తిథి సమీక్ష

శ్లో॥ ద్వితీయా చతృతీయా చ పంచమీ సప్తమీ తథా ।
దశమ్యేకాదశీ చైవ యాత్రాసిద్ధిం త్రయోదశీ ॥
కృష్ణే వా యదివా శుక్లే వర్జనీయా చతుర్దశీ ।
పౌర్ణమాస్యామమాయాంచ న గంతవ్యం కదాచన ॥

తా॥ కృష్ణ పక్షమునందును, శుక్ల పక్షమునందును విదియ, తదియ, పంచమీ, సప్తమీ, దశమీ, ఏకాదశీ, త్రయోదశీ, అను యీ తిథులు కార్యసిద్ధిని గలిగించును. శుక్ల, కృష్ణ పక్షములయందు చతుర్దశిని విడువవలయును. పూర్ణిమ, అమావాస్యా తిథులలో ఎప్పుడును ప్రయాణము చేయరాదు.

**అమృతాదియోగములు**

| నక్షత్రములు | ఆ | సో | మం | బు | గు | శు | శ |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | సి | సి | సి | మృ | అ | అ | సి |
| భరణి | ప్ర | సి | సి | సి | సి | సి | సి |
| కృత్తిక | సి | మృ | సి | అ | మృ | సి | అ |
| రోహిణి | సి | అ | అ | సి | మృ | మృ | అ |
| మృగశిర | సి | అ | సి | సి | మృ | సి | సి |
| ఆర్ద్రా | సి | సి | మృ | సి | మృ | సి | సి |
| పునర్వసు | సి | అ | సి | సి | అ | సి | సి |
| పుష్యమి | సి | సి | సి | సి | అ | మృ | సి |
| ఆశ్లేష | సి | సి | సి | సి | సి | మృ | మృ |
| మఖ | మృ | మృ | సి | సి | అ | మృ | అ |
| పు.ఫ. | సి | సి | సి | అ | సి | సి | సి |
| ఉ.ఫ. | అ | సి | అ | అ | మృ | సి | మృ |
| హస్త | అ | సి | సి | మృ | సి | అ | మృ |
| చిత్త | సి | ప్ర | సి | సి | సి | సి | మృ |
| స్వాతి | సి | అ | సి | సి | అ | సి | అ |
| విశాఖ | మృ | మృ | మృ | సి | సి | సి | సి |
| అనూరాధ | మృ | సి | సి | సి | సి | సి | సి |
| జ్యేష్ఠ | మృ | సి | సి | సి | ప్ర | మృ | సి |
| మూల | అ | సి | అ | మృ | సి | అ | సి |
| పూ.షా. | సి | ప్ర | సి | అ | సి | ప్ర | సి |
| ఉ.షా. | అ | మృ | ప్ర | అ | సి | సి | సి |
| శ్రవణం | అ | అ | సి | సి | సి | మృ | సి |
| ధనిష్ఠ | మృ | సి | సి | ప్ర | సి | సి | సి |
| శతభిషం | సి | సి | మృ | సి | మృ | సి | అ |
| పూ.భా. | సి | మృ | మృ | అ | సి | సి | మృ |
| ఉ.భా. | అ | సి | అ | సి | సి | సి | సి |
| రేవతి | అ | సి | సి | మృ | సి | అ | ప్ర |

అ. - అమృతయోగము
సి. - సిద్ధయోగము
ప్ర. - ప్రబలారిష్టయోగము
మృ. - మృత్యుయోగము

## కాల సమీక్ష

ఉషః కాలము ప్రయాణమునకు శుభదాయకము.

ఉషః కాలము అనగా సూర్యోదయమునకు పూర్వ ముహూర్తము, శన్యుషః కాలము ప్రయాణమునకు ముఖ్యతమము అని గర్గమహర్షి మతము.

ప్రయాణము చేయువారు శకునమును చూచి కార్యసిద్ధిని నిర్ణయించుకుని ప్రయాణము చేయవలయును గాన శుభశకున కాలమే ప్రయాణకాలము అని బృహస్పతి మతము.

"ఇగామలంకాం మనసా మనస్వీ" అను హనుమధ్యాన న్యాయముచే కార్యసిద్ధి త్వరాభినివేశములుగల మానసిక వేగము కల కాలమే ప్రయాణ కాలము అని మాండవ్యమతము.

**నమోస్తురామాయ స లక్ష్మణాయ**
**దేవ్యైచ తస్యై జనకాత్మజాయై ।**
**నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యః**
**నమోస్తు చంద్రార్కమరుద్గణేభ్యః ॥**

అని కార్యసిద్ధి సాధక దేవతాధ్యాన కాలమే ప్రయాణ శుభకాలము అని సంప్రదాయవేత్తలు చెప్పుచున్నారు.

## ఏల్నాటి శని ప్రభావము

జన్మరాశికి - 12,1,2 రాశులలో శని సంచరించుటనే ఏల్నాటి శని యందురు. ఒక్కొక్క రాశిలో 2½ సం॥లు చొప్పున మొత్తం 7½ సం॥లు దోషముగును. 12వ రాశిలోనికి రాగానే ధనవ్యయముపై దెబ్బతీయును. దరిద్రము, ఇంటిపోరు, కష్టములు, మానహాని, వ్యవహార చిక్కులు కలుగును. జన్మ (1) రాశిలోనికి రాగానే గతంలో మిగిలిన దేమైనా వుంటే అదికూడా ఖర్చు చేయించి శరీరమును బాధించును. బంధు అరిష్టము, కళత్రపీడ, గుర్తించలేని వ్యాధులు, మతిభ్రమణం, కళాకాంతులు లేకపోవుట కలిగించును. 2వ రాశికి రాగానే -ఎనలేని ఆశలు కల్పించును. కాని నిందలుపడుట, నిత్యదుఃఖము కలుగును. మానసికముగా క్రుంగదీయును. 3వ రాశిలోనికి ప్రవేశించగానే సర్వ శుభములూ కలిగించును. 12,1,2 రాశులలో శని సంచారమిట్లుండును.

| | సం॥ | నె. | రో. |
|---|---|---|---|
| 1. | 0 | 3 | 10 |
| 2. | 1 | 1 | 00 |
| 3. | 1 | 8 | 10 |
| 4. | 1 | 4 | 20 |
| 5. | 1 | 1 | 10 |
| 6. | 0 | 10 | 00 |
| 7. | 0 | 6 | 20 |
| 8. | 0 | 6 | 20 |
| | 7 | 6 | 00 |

**ముఖమునందు - హాని, పీడ**
**దక్షిణభుజము - జయం, లాభం**
**పాదములు - త్రిప్పుట, [illegible], అశాంతి**
**హృదయస్థానం - ధనప్రాప్తి, గౌరవం**
**వామభుజం - రోగము, దుఃఖము**
**శిరోభాగం - సంతోషం, లాభం**
**కన్నులు - మర్యాద, మన్నన, సంతోషం**
**గుదము - గొప్ప దుఃఖం, మానహాని**

మొత్తం మీద శని సంచారవేళ - 'గురుబలం' కొంత ఉపయుక్తమౌతుంది. ఏది యేమైనా ఈ 7½ సం॥లు శనిస్తోత్రం, జపం, దాన, ధ్యాన - శాంత్యాదులు మృత్యుంజయ మంత్ర జపం చేయాలి.

శని పీడా పరిహారార్థమై శ్రీ శనీశ్వరస్వామివారికి తైలాభిషేకము, హోమాదులు జరుపుట శ్రేయస్కరం మరీ చిక్కులుపడేవారు తంత్రశాస్త్రం ప్రకారం కాలిమట్టి, పాతమేకు, గ్రహించి నల్లగుడ్డలో శనీశ్వరయంత్రం లిఖించి కాల్వలో వర్జించవలెను. నువ్వులు, నూనె, బెల్లము, నవధాన్యాలు మున్నగు పదార్థాలు అభిషేకమునకు వినియోగించదగును.

ఈ సంవత్సరములలో కొద్దిమందికి విశేష అష్టైశ్వర్యములు, స్థిరాస్తులు ఈ శని కల్గించును.

## నవరత్నముల ఉంగరము

సర్వ గ్రహానుగ్రహములకు, పీడాపరిహారమునకును, చాలామంది ధరించదగినది నవరత్నముల ఉంగరము. ఇందులో ఏఏ రత్నము ఎచ్చట నుండవలెనో ఈ దిగువ చిత్రమునందు చూపబడినది.

| ఈశాన్యం | తూర్పు | | ఆగ్నేయం | |
|---|---|---|---|---|
| | బుధ<br>పచ్చ | శుక్ర<br>వజ్రం | చంద్ర<br>ముత్యం | |
| ఉత్తరం | గురు<br>పుష్యరాగం | సూర్య<br>కెంపు | కుజ<br>పగడం | దక్షిణం |
| | కేతు<br>వైఢూర్యం | శని<br>నీలం | రాహు<br>గోమేధికం | |
| వాయువ్యం | పశ్చిమం | | నైఋతి | |

ఇట్టి ఉంగరము ధరించుటచే దీర్ఘరోగములు, శతృత్వములు, ఋణపీడలు తొలగిపోవును. ఆదాయము వృద్ధియగును. వ్యసనములు నశించును. సత్సాంగత్యము కల్గును. కుటుంబ సౌఖ్యం, సత్సంతానం, దైవభక్తి, సర్వ సంపద్వృద్ధి కలుగును. చంద్రబలాదులును చూచుకొని ఇష్ట దైవము వద్ద వుంచి పూజించి అనంతరము ధరించవలెను.

**గమనిక:** ఇది కొద్ది మందికి మాత్రము యోగ్యముకాదు. జ్యోతిష్కులను సంప్రదించి ధరించండి.

## ప్రయాణమునకు ఆనందాది యోగములు

| వారము యోగములు | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని | ఫలములు |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆనందయోగము | అ | మృ | ఆశ్లేష | హ | అనూ | ఉ.షా. | శ | ద్రవ్యలాభము |
| కాలదండయోగము | భ | ఆర్ద్ర | మ | చి | జ్యే | అభి | పూ.భా. | విఘ్నము |
| ధూమ్రయోగము | కృ | పున | పూ.ఫ. | స్వా | మూ | శ్ర | ఉ.భా. | హాని |
| ధాతృయోగము | రో | పు | ఉ.ఫ. | వి | పూ.షా. | ధ | రే | కార్యసిద్ధి |
| సౌమ్యయోగము | మృ | అ | హ | అనూ | ఉ.షా. | శ | అ | సుఖము |
| ధ్వాంక్షయోగము | ఆర్ద్ర | మ | చి | జ్యే | అభి | పూ.భా. | భ | విఘ్నము |
| ధ్వజయోగము | పున | పూ.ఫ. | స్వా | మూ | శ్ర | ఉ.భా. | కృ | రాజ్యలాభము |
| శ్రీవత్సయోగము | పు | ఉ.ఫ. | వి | పూ.షా. | ధ | రే | రో | లక్ష్మీప్రదము |
| వజ్రయోగము | ఆ | హ | అనూ | ఉ.షా. | శ | అ | మృ | కలహము |
| ముద్గరయోగము | మ | చి | జ్యే | అభి | పూ.భా. | భ | ఆర్ద్ర | మరణము |
| ఛత్రయోగము | పూ.ఫ. | స్వా | మూ | శ్ర | ఉ.భా. | కృ | పున | రాజ్యలాభము |
| మిత్రయోగము | ఉ.ఫ. | వి | పూ.షా. | ధ | రే | రో | పు | కార్యసిద్ధి |
| మానసయోగము | హ | అనూ | ఉ.షా. | శ | అ | మృ | అ | స్త్రీలాభము |
| పద్మయోగము | చి | జ్యే | అభి | పూ.భా. | భ | ఆర్ద్ర | మ | ఐశ్వర్యము |
| లంబయోగము | స్వా | మూ | శ్ర | ఉ.భా. | కృ | పున | పూ.ఫ. | కార్యహాని |
| ఉత్పాతయోగము | వి | పూ.షా. | ధ | రే | రో | పు | ఉ.ఫ. | ద్రవ్యనాశనము |
| మృత్యుయోగము | అనూ | ఉ.షా. | శ | అ | మృ | అ | హ | హాని |
| కాలయోగము | జ్యే | అభి | పూ.భా. | భ | ఆర్ద్ర | మ | చి | కార్యహాని |
| సిద్ధయోగము | మూ | శ్ర | ఉ.భా. | కృ | పున | పూ.ఫ. | స్వా | కార్యసిద్ధి |
| శుభయోగము | పూ.షా. | ధ | రే | రో | పు | ఉ.ఫ. | వి | శుభకార్యసిద్ధి |
| అమృతయోగము | ఉ.షా. | శ | అ | మృ | అ | హ | అనూ | స్త్రీ సంతోషము |
| ముసలయోగము | అభి | పూ.భా. | భ | ఆర్ద్ర | మ | చి | జ్యే | భోజనహాని |
| గదాయోగము | శ్ర | ఉ.భా. | కృ | పున | పూ.ఫ. | స్వా | మూ | అశుభము |
| మాతంగయోగము | ధ | రే | రో | పు | ఉ.ఫ. | వి | పూ.షా. | స్వర్ణలాభము |
| రాక్షసయోగము | శ | అ | మృ | అ | హ | అనూ | ఉ.షా. | క్లేశము |
| చరయోగము | పూ.భా. | భ | ఆర్ద్ర | మ | చి | జ్యే | అభి | దుర్వార్తాశ్రవణము |
| స్థిరయోగము | ఉ.భా. | కృ | పున | పూ.ఫ. | స్వా | మూ | శ్ర | కార్యసిద్ధి |
| వర్ధమానయోగము | రే | రో | పు | ఉ.ఫ. | వి | పూ.షా. | ధ | అధికలాభము |
| విషయోగము* | కృ<br>౫ | చి<br>౨ | రో<br>౧౫ | భ<br>౩ | అనూ<br>౧౩ | శ్ర<br>౬ | రే<br>౮ | |

* కృత్తికాది నక్షత్రములకు ఆయా తిథులతో యోగమేర్పడిన విషయోగము.

## గౌరీ పంచాంగము

| | | | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పగటి ముహూర్తములు | ఒక్కొక్కటి 1½ గం॥ ప్రమాణం | 1 | ఉద్యోగం | అమృతం | రోగం | విషం | ఉద్యోగం | రోగం | విషం |
| | | 2 | లాభం | విషం | ఉద్యోగం | అమృతం | విషం | జ్వరం | అమృతం |
| | | 3 | విషం | ఉద్యోగం | జ్వరం | శుభం | జ్వరం | అమృతం | జ్వరం |
| | | 4 | అమృతం | లాభం | లాభం | ఉద్యోగం | లాభం | కలహం | ఉద్యోగం |
| | | 5 | శుభం | జ్వరం | అమృతం | రోగం | అమృతం | లాభం | శుభం |
| | | 6 | ధనం | అమృతం | ఉద్యోగం | శుభం | విషం | సుఖం | లాభం |
| | | 7 | అమృతం | లాభం | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| | | 8 | విషం | ధనం | లాభం | అమృతం | జ్వరం | అమృతం | లాభం |
| | | | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
| రాత్రి ముహూర్తములు | ఒక్కొక్కటి 1½ గం॥ ప్రమాణం | 1 | శుభం | రోగం | జ్వరం | లాభం | శుభం | అమృతం | విషం |
| | | 2 | అమృతం | లాభం | ఉద్యోగం | రోగం | రోగం | జ్వరం | ఉద్యోగం |
| | | 3 | జ్వరం | ఉద్యోగం | కలహం | విషం | కలహం | కలహం | శుభం |
| | | 4 | రోగం | ధనం | లాభం | ఉద్యోగం | లాభం | లాభం | అమృతం |
| | | 5 | కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యోగం | శుభం | కలహం |
| | | 6 | లాభం | అమృతం | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| | | 7 | ఉద్యోగం | విషం | ఉద్యోగం | ధనం | లాభం | అమృతం | అమృతం |
| | | 8 | జ్వరం | జ్వరం | ధనం | లాభం | ఉద్యోగం | విషం | లాభం |

శ్లో॥ న తిథిర్న చ నక్షత్రం న యోగం కరణం తథా ।
న హోరా యోగినీచక్రం న లగ్నం న తమోగుణః ॥
వ్యతీపాతే చ సఙ్క్రాన్తౌ భద్రాయామశుభే దినే ।
దేవదేవార్చనం కృత్వా సర్వత్ర విజయీభవేత్ ॥

### పురశ్శుక్రదోషములు

గర్భిణీ స్త్రీ, శిశుసహిత స్త్రీ, నూతనవధువు, వీరలు శుక్రుడు తూర్పు దిక్కున నున్నప్పుడు పశ్చిమదిక్కు నుండి వాయవ్య దిక్కునకు, ఉత్తరమునకు, ఈశాన్యమునకు, తూర్పు దిక్కునకు ప్రయాణము చేయకూడదు. పశ్చిమదిక్కున శుక్రుడున్నప్పుడు తూర్పు దిక్కునుండి ఆగ్నేయము, దక్షిణము, నైఋతి, పశ్చిమములకు ప్రయాణము చేయకూడదు. ఏక గ్రామమందు ఈ దోషము లేదు. దుర్భిక్ష, రాజవిద్వర, వివాహ తీర్థయాత్రలలో ఈ దోషము వర్తింపదు.

### వాస్తుపురుష స్థితి

భాద్రపద, ఆశ్వయుజ, కార్తీక మాసములందు తూర్పు శిరస్సు గలిగి ఎడమప్రక్కను శయనించును. గాన ఈ మాసములందు పశ్చిమ సింహద్వారము, దక్షిణ సింహద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. మార్గశిర, పుష్య, మాఘ మాసములందు దక్షిణ శిరస్సుగ శయనించును. ఈ మాసములందు పడమర సింహద్వారము, ఉత్తర సింహద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. ఫాల్గుణ, చైత్ర, వైశాఖ మాసములందు పశ్చిమ శిరస్సుగ శయనించును. ఇందు తూర్పు సింహద్వారము, ఉత్తర సింహ ద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ మాసములందు ఉత్తర శిరస్సుగ శయనించును. ఇందు దక్షిణ సింహద్వారము, తూర్పు సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయవలెను. వాస్తుపురుషునికి గల దృష్టికి అభిముఖ సింహ ద్వార గృహములను పాదములకు అభిముఖ సింహద్వార గృహములకు ఆ యా మాసములందు శంకుస్థాపన చేయరాదు. ఇదియే బహుదేశాచార సిద్ధమున్నూ, వశిష్ఠ, నారద సంహితాది మూలగ్రంథ ప్రమాణ సిద్ధమున్ను అయియున్నది. ఇది త్రైమాసిక వాస్తు పురుష స్థితి పద్ధతి.

## గౌళిపతన (బల్లిపాటు) ఫలములు

| స్థానములు | ఫలములు | స్థానములు | ఫలములు |
|---|---|---|---|
| చెవిమీద | దుర్వార్తవినుట | పాదమందు | కల్యాణము |
| కనుబొమ్మలమీద | ధనలాభము | నడుము వెనుక | వస్త్రలాభము |
| కనుబొమ్మలమధ్య | కలహసూచకము, దైవికభయము | పిరుదున | శయ్యాలాభము |
| కుడికన్నున | పరాజయము | తొడవెనుక | విషభయము |
| ఎడమకన్నున | అవమానము | ముందొడమీద | సుఖము |
| ముక్కుమీద | కార్యహాని | స్త్రీకి తొడమీద | వ్యభిచారము |
| ముక్కుకొనయందు | పరాజయము | తొడ మొదట | బలహీనము |
| ముక్కు ప్రక్కన | మిత్రలాభము | శిశ్నమందు | సంతానము |
| మీసముమీద | అధికారలాభము | శిశ్నాగ్రమున | దాంపత్యభంగము |
| పై పెదవిమీద | భూలాభము | శిశ్నరోమములందు | దేశభ్రమణము |
| కింది పెదవిమీద | సుభోజనము | వృషణములయందును దానికి దిగువను | చోరత్వము |
| నాలుకయందు | విద్యాలాభము | గుదమందు | ఆయుధ భయము |
| గడ్డము మీద | అపమృత్యువు | మోకాలియందు | వాహనలాభము |
| గండస్థలము మీద | భూమినష్టము | మోకాలి సందియందు | వాహనభ్రంశము |
| గడ్డము వెంట్రుకల మీద | కారాగృహప్రాప్తి | మోకాలిక్రింద | వాతరోగము |
| వెనుక మెడయందు | మరణభయము | మోకాలి క్రింద నరములయందు | రోగమూలాద్ధనవ్యయము |
| ముందువైపు కంఠమందు | బుద్ధినాశనము, ఆత్మహత్య, భయము | | |
| గొంతుయెముకమీద | ఉభయసంకటములు | పిక్కలయందు | కార్యానుకూలము |
| రొమ్మున | జయము | మోకాలి క్రింది యెముకమీద | వ్యాపారలాభము |
| గుండెలోన | అధైర్యము | పాదముల యెముకమీద | కార్యహాని |
| పైకడుపున | పుత్రలాభము | పాదసంధియందు | రోగము |
| బొడ్డున | భయము | పాదములవెనుక | కారాగృహ ప్రవేశము |
| బొడ్డునకు దిగువున | రోగము | పాదమున | ప్రయాణము |
| కడుపు ప్రక్కన | ఆరోగ్యము | వ్రేళ్ళయందు | రోగము |
| భుజములయందు | సహాయము | అరికాలియందు | రాజ్యలాభము |
| రెట్టలయందు | యత్నకార్యభంగము | తలమీద బ్రహ్మరంధ్రమునకు వెనుక బల్లిపడిన | లక్ష్మీకరము |
| అరచేతియందు | ద్రవ్యలాభము | | |
| మోచేతియందు | సహాయనాశము | నడినెత్తిమీద | రోగము |
| మణిబంధమున | గర్వభంగము | కుడినెత్తి మీద | సోదరునికి భయము |
| గోళ్లయందు | జంతుభయము | నెత్తివెనుక | తమ్మునికరిష్టము |
| చంకలో | ప్రేతభయము | బ్రహ్మరంధ్రమునకు ముందు | మేనమామకు చేటు |
| వెన్నున | శత్రుభయము | బ్రహ్మరంధ్రమున | మృత్యుభయము |
| వెన్ను ఎముకయందు | పిశాచభయము | ముఖమునకు యెగువ | ధనలాభము |
| ముంగురుల మీద | హాని | గండస్థలమందు పురుషులకు | బంధువులు వత్తురు |
| కేశాంతమందు | అనాయాస మరణము | గండస్థలమందు స్త్రీలకు | అశుభము |
| జుట్టుమీద | కష్టము | స్త్రీలకు చెవిదగ్గర చెంపమీద | శుభము |
| జడమీద | పతికి మృత్యువు | తలముసుగుల మీద | కీడుసంభవించును |
| ముచ్చిలిగుంటలో | భారముమోయుట | తలముసుగు స్త్రీకైతే | వైధవ్యసూచకం |

## క్షణిక వాస్తు నిర్ణయము

వాస్తు పురుషుడు ప్రతి దినము నందును పగలు మొదటి జామునను, రాత్రి మొదటి జామునను ఉత్తర శిరస్సు తూర్పునకు దృష్టియు గలిగి శయనించును. గావున 1 జామున తూర్పునకు సింహద్వారము దక్షిణమునకు సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయవలెను. 2 జామున తూర్పు శిరస్సు దక్షిణ దృష్టి గలిగియుండును. 2 జామున దక్షిన సింహద్వారము పశ్చిమ సింహద్వారము గల గృహములకు శంకుస్థాపన చేయవలెను. 3 జామున దక్షిణ శిరస్సు పడమర దృష్టి గలిగియుండును. 3 జామున పడమర సింహద్వారము, ఉత్తర సింహద్వారము గల వాటికి శంకుస్థాపన చేయవలెను. 4 జామున పడమర శిరస్సు, ఉత్తరమునకు దృష్టియు గలిగియుండును. గావున 4 జామున తూర్పు సింహద్వారము, ఉత్తర సింహద్వారము గల వాటికిని శంకుస్థాపన చేయవలెను. పైన చెప్పబడిన త్రైమాసిక వాస్తు పురుష స్థితిని బట్టి గృహమునకు శంకుస్థాపన చేయుకాలము లభించని సమయమున ఈ క్షణిక (యామ) వాస్తు నిర్ణయమును అనుసరించి గృహములను నిర్మించుటయు ఆచార సిద్ధము అయియున్నది. మరియు నాల్గువైపులకు సింహద్వారములు గల (చతుశ్శాల) మండువా లోగిలికి శంకుస్థాపనము అన్ని మాసములందును చేయవచ్చును. మరి ఒక విశేషము సూర్యుడు స్థిరరాశులగు వృషభ, సింహ, వృశ్చిక, కుంభరాశులలో సంచరించు కాలమున ఏకశాలా (పంటి గర్భము) సర్వముఖ గృహములకును శంకుస్థాపన చేయవచ్చును. 1వ పద్ధతిచే శంకుస్థాపన కాలమును నిర్ణయించుటకు అవకాశము లేనప్పుడు 2,3 పద్ధతుల బట్టియు ఆచరించుట అత్యవసర పరిస్థితిని బట్టి ఆచారసిద్ధమయి యున్నది.

## దేవాలయారంభము

ఉత్తరాయణము - చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఫాల్గుణ మాసములు ఉత్తరము, శ్రావణ, కార్తీక మాసములు మధ్యమము. శుక్ల పక్షము ఉత్తమము. అస్తపంచకమును వదలిన కృష్ణపక్షము మంచిది. సోమ, బుధ, గురు, శుక్రవారములు ప్రశస్తము - రోహిణి, పునర్వసు, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణము, శతభిషము ఈ నక్షత్రములు ఉత్తమములు, స్థిరలగ్నము ముఖ్యము - పాపులు 3-6-11 రాశుల యందును శుభులు కేంద్ర త్రికోణముల యందును ఉండగా స్థిరలగ్నమున ప్రారంభించుట ఉత్తమోత్తమము.

## దేవాలయ ప్రతిష్ఠ

ఉత్తరాయణము - చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఫాల్గుణ మాసములు ఉత్తమము - శ్రావణ, ఆశ్వయుజ, కార్తీక మాసములు మధ్యమము, మార్గశీర్ష మాఘమాసములు పనికిరానివి. అశ్విని, రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణము ఈ పది నక్షత్రములు - శుక్లపక్షము, సోమ, బుధ, గురు, శుక్రవారములు ప్రశస్తములు, స్థిరలగ్నము ఉత్తమము చరలగ్నము పనికిరాదు - శుభులు కేంద్ర త్రికోణముల యందును పాపులు త్రిషడాయముల యందును ఉండగా స్థిరలగ్నమున దేవాలయము నందు పరమేశ్వరర్చా రూపమును ప్రతిష్ఠించుట ఉత్తమోత్తమము.

**విశేషము : శ్లో ॥ మాతృభైరవ వారాహ నారసింహ త్రివిక్రమాః,**
**మహిషాసురహంత్రీ చ స్థాప్యా వై దక్షిణాయనే.**

## గృహారంభము

ఉత్తరాయణము - చైత్రము, వైశాఖము, కార్తీకము, మాఘము ఈ మాసములు, శుక్ల పక్షమున 2,3,5,7,10,13 తిథులు ప్రశస్తము. కృష్ణ పక్షమున చివర పంచకము పనికిరాదు. మిగతా 1,2,3,5 తిథులు పనికివచ్చును. అవమా, త్రిద్యుస్పృక్ మొదలగు దుష్ట తిథులు మంచివికావు. రోహిణి, మృగశిర, ఉత్తర, హస్త, చిత్త, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం - ఈ నక్షత్రములు ప్రశస్తములు. అశ్విని, పుష్యమి, స్వాతి, అనూరాధ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి - ఈ ఏడు నక్షత్రములు మధ్యమములు, ఇతర నక్షత్రములు మంచివి కానేరవు. బుధ, గురు, శుక్రవారములు పూర్ణేందువారము ప్రశస్తము. పరిఘ, వైధృతి, వ్యతీపాత్, గండం, అతిగండం, వ్యాఘాతం - ఈ యోగములు మంచివికావు. భద్రకరణము మంచిదికాదు. స్థిరలగ్నము, ద్విస్వభావ లగ్నములు మంచివి.

వృషభలగ్నము ప్రశస్తమైనది -అష్టమశుద్ధి ఉండవలెను. కేంద్రత్రికోణముల యందు పాపులు ఉండకూడదు.

శుభగ్రహములు కేంద్ర త్రికోణముల యందున్నను పాపులు 3,6,11 రాశులయందున్నను శుభప్రదము. గురు, శుక్రులయొక్క మౌఢ్యము, బాల్యము, వార్ధక్యము, చాతుర్మాస్యకాలము, శూన్యమాసము మంచివికావు.

## గృహప్రవేశము

ఉత్తరాయణము - మాఘ, పాల్గుణ, వైశాఖ, జ్యేష్ఠమాసములు ప్రశస్తము. కుంభమాసము మంచిదికాదు. శుక్లపక్షము 2,3,5,7,10,13 తిథులు కృష్ణపక్షమున చివర పంచకముగాక 1-2-3-5 తిథులు మంచివి. అవమాత్రిద్యుస్పృక్ మొదలగు దుష్టతిథులు పనికిరావు. బుధ, గురు, శుక్రవారములు పూర్ణేందువారము మంచివి. రోహిణి, మృగశిర, ఉత్తర, చిత్త, అనూరాధ, ఉత్తరాషాఢ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి - ఈ నక్షత్రములు ప్రశస్తములు. అశ్విని, పునర్వసు, హస్త, స్వాతి, శ్రవణం - ఈ నక్షత్రములయందు గృహమున ప్రవేశించిన గృహము కొలది కాలములోనే అన్యాక్రాంతమగును. శేషించిన నక్షత్రములు మంచివి కానేరవు. పరిఘాది యోగములు భద్రకరణము మంచివికావు. కర్తరియందు గృహమునకు శంఖుస్థాపన మొనరించినను గృహనిర్మాణ మొనరించినను అగ్నిహోత్ర ప్రీతికరములగునని కాలామృతము, కృష్ణవాస్తు మొదలగు గ్రంథములు చెప్పుచున్నవి. ప్రవేశము చేయవచ్చునని కొందరి అభిప్రాయము. జన్మరాశియందు గృహప్రవేశము శుభప్రదము. గురు శుక్రులయొక్క మౌఢ్యము, బాల్యము, వార్ధక్యము, చాతుర్మాస్యకాలము, శూన్యమాసము మంచివికావు. స్థిరలగ్నములు, ద్విస్వభావ లగ్నములు మంచివి, వృషభ లగ్నము ప్రశస్తమైనది. ద్వాదశశుద్ధి ఉండవలెను. కేంద్ర త్రికోణములయందు పాపులు వుండకూడదు. శుభులు కేంద్ర కోణములయందున్నను పాపులు 3,6,11 రాశులయందున్నను ప్రశస్తమైనది. చంద్రబలము గృహ ప్రవేశమునకు ముఖ్యముగా చూడతగినది. కలశ వృషభచక్రముల ఫలములను గూడా చూచుట యుక్తము.

## గృహనిర్మాణమునకు మాసములు

చైత్రమున శుభము, వైశాఖము సంపద, జ్యేష్ఠము మృత్యుప్రదము, ఆషాఢమున సిరిసంపదలు నశించును. శ్రావణమున శుభము, భాద్రపదమున రోగభయము, ఆశ్వయుజమున కలహములు, కార్తీకమున ధనయోగము, మార్గశిరమున ధాన్యము, మహాభయము, పుష్యము చోర, అగ్ని ప్రమాదముల భయం, మాఘం వంశాభివృద్ధి, ఫాల్గుణం ధనలాభం.

కుటుంబములో వివాహము జరిగిన సం॥లోపలను, భార్య గర్భవతిగ యున్నప్పుడు ఆరుమాసముల లోపల గృహ నిర్మాణము చేయరాదు. దేవుని పూజా మందిరము ఈశాన్యములో తూర్పు గోడకుచేర్చి యుంచవలయును. అనగా పూజ చేయుటకు కూర్చుండువారి ముఖము తూర్పు దిక్కుగ ఉండవలయును. వంట ఆగ్నేయములో తూర్పు గోడకు చేర్చి వంటచేయువారి ముఖము తూర్పును చూచునట్లుండవలయును. మరుగుదొడ్లు నైరుతి, వాయువ్యములలో వీలునుబట్టి యేర్పరచుకొనవలెను.

ధాన్యపుగాదులు ఉత్తరదిక్కున ఉండవలయును. వాటి ప్రవేశ ద్వారములు దక్షిణమును చూచునట్లుండవలయును. ఈశాన్యములో మరుగుదొడ్లు పెట్టరాదు. ఏ స్థలమునకైనను ఉత్తర, ఈశాన్య, తూర్పుల నుండి నీరు బయటకు పోవునట్లు తూములు పెట్టుకొనుట మంచిది. ఆ విధముగ వీలులేనప్పుడు, ఆగ్నేయ వాయువ్యమూలల నుండి నీరు బయటకు పోవునట్లు పెట్టుకొనుట మంచిది.

గృహము నిర్మించు స్థలము చతురస్రముగ గాని, దీర్ఘచతురస్రముగ గాని యుండవలయును. చతురస్రములో నాలుగు దిక్కుల కొలతలు సమానముగా యుండును. దీర్ఘచతురస్రములో ఎదుటి భుజములు మాత్రమే సమానమైన కొలతలు కలిగియుండును.

నైరుతి మూల నుండి నీరు బయటకు పోవునట్లు తూముల పెట్టరాదు. నీటివాటములు స్థలములకు మాత్రమే చెప్పబడినవి. ఇండ్లలో యీ విధులు పాటించనవసరము లేదు. యింటిలో యుండు గదులను బట్టి నీటివాటములు యేర్పరచుకొనవచ్చును.

సింహద్వారమునకు రెండువైపుల కిటికీలు ఉండవలయును. ఇంటిద్వారములు మూయునప్పుడు తెరచునప్పుడు ధ్వని కలుగరాదు. ఎత్తు తక్కువ యిల్లు కుబ్జ గృహమనబడును. అందు నివసించరాదు.

గృహమునకు కట్టదలచిన స్థలము తూర్పు, ఉత్తరములలో ఎత్తుగయుండి పశ్చిమ, దక్షిణములు పల్లముగ యున్నచో "ఉచ్చవేధ" వచ్చును. ఇది శుభప్రదముకాదు. దక్షిణ, పశ్చిమములు అనగా ఇంటి బయట ఆవరణముల యందు మాత్రమే ఎత్తుగా యుండుట మంచిది.

కిటికీలు లేని గృహము 'అంధకవేధ' కలదియగును. కొబ్బరి, అరటి, దానిమ్మచెట్లు ఉన్న గృహము సర్వదావృద్ధి పొందుచుండును.

పశ్చిమ, ఉత్తర దిక్కులకు శిరస్సు పెట్టి నిద్రించరాదు. దిగంబరుడుగ శయనించరాదు. దిగంబరుడుగా స్త్రీ సంభోగము చేయరాదు. తడికాళ్ళతో శయనించరాదు.

అన్నదమ్ములు ఒక గృహమును పంచుకొని, అందు నివసించునప్పుడు పెద్దవారు దక్షిణ, పశ్చిమ దిశలలోను, చిన్నవారు తూర్పు, ఉత్తర భాగములలోను యుండుట శుభము.

భోజనము - తూర్పు లేక ఉత్తర దిశలను చూచుచు కూర్చుండి భోజనము చేయుట శుభప్రదము.

వసారాలు కట్టదలచినచో దక్షిణపు గోడమీద ఎత్తు ఉంచి చూరు ఉత్తర దిశకు దిగునట్లు కట్టవలయును. పడమరదిశలో వసారా వేయునప్పుడు, తూర్పునకు వాలు పెట్టి కట్టవలయును.

తన గృహమునకు చేర్చి తూర్పు, ఉత్తర, ఈశాన్యములలో యున్న స్థలములను కలుపుకొనవచ్చును. దక్షిణ దిశయందుండు స్థలములను కొని, తన స్థలమునకు కలుపుకొనరాదు. తన గృహమునకు ఈశాన్యములో మట్టి దిబ్బలు, గుట్టలు, పేడకుప్పలు, మరుగుదొడ్లు ఉండరాదు. అట్లున్నచో కష్ట నష్టములు కలుగుచుండును.

వాస్తు పురుషునకు సింహద్వారము ముఖము అగును. సింహద్వారమును బట్టి, ఆ యిల్లు తూర్పు యిల్లు, దక్షిణపు యిల్లు, పడమర యిల్లు, ఉత్తరము యిల్లు అని చెప్పబడును.

1. **తూర్పు యిల్లు:** పడమర ద్వారము పెట్టి, ముఖము తూర్పుగ పెట్టి లోనికి ప్రవేశించునది. ఇది తూర్పు యిల్లు అగును. కార్తీక, మాఘమాసములలో కట్టుకొనవలయును. శ-అ-క వర్గుల వారికి అర్హణము.
2. **దక్షిణపు యిల్లు:** ఉత్తరమున సింహద్వారము పెట్టి, దక్షిణముగ ముఖము పెట్టి లోనికి ప్రవేశించుచున్నచో, అది దక్షిణపు యిల్లు అనబడును చ-ట-త-ప వర్గుల వారికి అర్హణము. మాఘ, ఫాల్గుణ, వైశాఖములలో కట్టవలయును.
3. **పడమర యిల్లు:** తూర్పున సింహద్వారము పెట్టి, పడమర దిశగ ముఖము పెట్టి లోనికి ప్రవేశించునది పడమర యిల్లు. ఫాల్గుణ, వైశాఖ, శ్రావణ మాసములలో నిర్మించుట శుభప్రదము. ట-త-ప వర్గుల వారికి శ్రేష్ఠము.
4. **ఉత్తరపు యిల్లు:** దక్షిణమున సింహద్వారము పెట్టి, ఉత్తర ముఖము లోనికి ప్రవేశించునది ఉత్తరపు యిల్లు. శ్రావణ, కార్తీక మాసములలో కట్టవలయును. ప-య-శ వర్గుల వారికి అర్హణము.

గృహము కట్టువారి పేరులో మొదటి అక్షరము అ,క,చ,ట,త,ప,య,శ అను ఎనిమిది వర్గులలో ఏ వర్గునకు చెందినదో ఆ వర్గు స్వస్థానమగును. దానికి 5వ వర్గు శత్రుస్థానమగును. ఆ శత్రుస్థానములో గృహ నిర్మాణముచేయరాదు. అర్హణము కాని వర్గులకు సంబంధించిన స్థలములలో గృహ నిర్మాణము చేసి, అందు నివసించినచో, సదా కష్ట నష్టములు కలుగుచుండును.

వంటకు ప్రతి గృహమునకు ఆగ్నేయ గదిలో తూర్పుగ ఆగ్నేయము మూల వంట చేయవలెను. తూర్పు ముఖముగ మనము ఉండాలి. లేని యెడల ఆగ్నేయము కుదరనిచో నైఋతి గదిలో ఆగ్నేయము మూల మంచిది.

| స్థలములు పెరిగిన దిశల ఫలములు | | |
|---|---|---|
| **దిశ** | **పెరిగినచో ఫలము** | **తరిగినచో ఫలము** |
| ఈశాన్యం | ఉత్తర దిశకు పెరిగిన ధనవృద్ధి, తూర్పునకు పెరిగిన ధనంతో బాటు ధర్మబుద్ధి, ప్రతిష్ఠ, ఎటు పెరిగినా సిరిసంపద | పురుష సంతానం లేకుండుట ఆయుశ్శంక, సంపాదనకు మించిన ఖర్చులు, చిక్కులు, చికాకులు |
| తూర్పు | ధనవృద్ధి, ఆయుర్వృద్ధి ప్రయోజకులైన పురుష సంతతి. | పురుష సంతతిలోపం, వేధ, అంగవైకల్యం, కీర్తినష్టము |
| ఆగ్నేయం | తూర్పుకు నిర్వంశత, ఆగ్నేయం కలహాలు, వృధా కీడు. | శుభం, ఒక పరిమితిలో సన్మానం, స్నేహం, ధైర్యం. |
| దక్షిణం | ఆర్థిక నష్టం, స్త్రీ హాని, తగువులు. | స్త్రీలకు శుభం, ఈ దిశ ప్రభావం స్త్రీలపై ఎక్కువ. |
| నైఋతి | శత్రు, రోగ, ఋణబాధలు, దక్షిణపు వైపు పెరిగితే స్త్రీలకు, పశ్చిమం లోనైతే పురుషులకు అకాల మరణ ప్రమాదం. | సంతాన వృద్ధి, సుఖశాంతులు. |
| పశ్చిమం | పెరగకపోవడమే శ్రేయం. పెరిగితే చెట్లు పెంచడం మంచిది. ఈ దిక్కు ప్రభావము మగ సంతతిపై ఎక్కువ. | ఈ దిశ సమానంగా వుండాలి. అది గృహ స్థలాన్ని బట్టి జాగ్రత్తగా చూచుకోవాలి. |
| వాయవ్యం | అశాంతి, ఋణబాధలు, అధిక ఖర్చులు, సంతాన నష్టం. | ధన గౌరవములు, మనశ్శాంతి సుఖ సంతోషములు. |
| ఉత్తరం | అష్టైశ్వర్యములు, సర్వశుభములు, ఉత్తరం తూర్పు ఖాళీ స్థలం ఎక్కువ కలిగి వీటిపై ప్రహరీగోడ అలాగే పశ్చిమ సింహ ద్వారం ఉంచి, ఆగ్నేయం వంట గది ఏర్పర్చిన (దక్షిణం ఎక్కువైతే మంచిది) న్యాయశీలురు, భాగ్యవంతులు, మేధావంతులు అవుతారు. | గృహం పరులపాలవును, కీడు, చిక్కులు, కలహాలు, ఉత్తర ముఖద్వారం గల ఇంటి తూర్పున ఖాళీ స్థలం తక్కువై అలాగే దక్షిణ దిశ ఖాళీ స్థలం ఈ రెండికన్న ఎక్కువ వున్నచో ఆ ఇల్లు శీఘ్రమే పరాధీనమగును. |

## ఎనిమిది దిక్కులా ఎత్తు పల్లముల వలన ఫలములు

| దిశ | ఎత్తుగా వున్న ఫలములు | పల్లముగా నున్న ఫలములు |
|---|---|---|
| తూర్పు | సంతానమునకు తీవ్రహాని. | ఆయుర్వృద్ధి, సిరిసంపదలు మంచి కీర్తి. |
| ఆగ్నేయం | వాయవ్య ఈశాన్యముల కంటే ఎత్తుగా నున్నచో ధనలాభము, నైఋతి కన్న ఎత్తయినచో అశుభము. | వాయవ్య ఈశాన్యముల కన్న పల్లమైనచో దుష్ట ప్రవృత్తి అగ్ని శతృభయము, పుత్ర సంతానారిష్టము. |
| దక్షిణం | పుష్టి, తుష్టి, ఆరోగ్యం, ఆర్థికంగా ఆధిక్యత. | దరిద్రము - వ్యాధులు. |
| నైఋతి | పరువు ప్రతిష్టలు, ధనవృద్ధి, సర్వదాజయం | దీర్ఘవ్యాధులు, దుర్మరణములు, దుర్వ్యసనములు. |
| పడమర | సంతానవృద్ధి, ప్రతిష్ఠ - పలుకుబడి పెరుగుట. | ధన నష్టం, సంతాన నష్టం. |
| వాయవ్యం | ఈశాన్యం కన్న ఎత్తయిన ధనప్రాప్తి, వ్యవహార జయము, నైఋతి, ఆగ్నేయముల కన్న ఎత్తైన అశుభం. | ఈశాన్యము కన్న పల్లమైన వ్యాధులు, బాధలు, కలహాలు, నైఋతి, ఆగ్నేయములకన్న పల్లమైన శుభం. |
| ఉత్తరం | కష్టపరంపర, అరిష్టములు, మిక్కిలి అశుభము. | సర్వత్రా విశేష శుభప్రదం. |
| ఈశాన్యం | అష్టకష్టములు - అతి దరిద్రములు, పెంటకుప్పలు, దిబ్బలు, గుట్టలు, పందిళ్లు, పాకలు, పాయిఖానా, దొడ్లు, వంటగదులు. గుండ్రని ప్రహరీగోడలతో స్థలం ఆక్రమించినా, ఎత్తైనా అష్ట కష్టములు, దరిద్రములు, ప్రమాద శూచకం, చీడ, పీడ. | నిత్య సుఖ సంతోషములు-అష్టైశ్వర్యప్రాప్తి, ఈశాన్యపు తూర్పు వాలు మగవారికి, ఉత్తరముగా పసారాలు వాలిన స్త్రీలకు సమస్త సత్ఫలితాలు కలిగిస్తాయి. నూతులు, కాలువలు, గోతులు, స్థల వైశాల్యము గృహములలో స్థల వ్యాప్తి, వాడకపు నీరు పారుట వలన ఆర్థికపుష్టి, సర్వ సౌభాగ్యదాయకము. |

## కలశచక్రము యొక్క ఫలము

కలశచక్రమును లిఖించి రవియున్న నక్షత్రము మొదలు 27 నక్షత్రములు కలశము యొక్క పార్శ్వాది భాగములయందు వ్రాసి చంద్రుడున్న సుముహూర్త కాలిక నక్షత్రము యెచ్చటనున్నదో తెలుసుకొని లెక్కించి ఫలము చెప్పబడుచున్నది.

దాని పరమార్థము ఈ క్రింద వివరింపబడుచున్నది. రవియున్న నక్షత్రము మొదటిదిగా వ్రాయదగి యున్నది. చంద్రుడున్న నక్షత్రమును తెలుసుకొని ఫలమును గుర్తింపుము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1) 1. నక్షత్రము | = | శిరశ్ఛేదము | 5) 14, 15, 16, 17 నక్షత్రములు | = | నిర్ధనం |
| 2) 2, 3, 4, 5 నక్షత్రములు | = | పరదేశగమనము | 6) 18, 19, 20, 21 నక్షత్రములు | = | గర్భస్రావం |
| 3) 6, 7, 8, 9 నక్షత్రములు | = | నిర్భయము | 7) 22, 23, 24 నక్షత్రములు | = | సంపద |
| 4) 10, 11, 12, 13 నక్షత్రములు | = | ధాన్యము | 8) 25, 26, 27 నక్షత్రములు | = | పూర్ణాయువు |

## వృషభచక్రము యొక్క ఫలము

వృషభ చక్రమును లిఖించి సూర్యుడున్న నక్షత్రము మొదలు అభిజిత్తుతో సహా 28 నక్షత్రములుగా నిర్ణయించి వృషభావయవముల యందు వ్రాసి వృషభచక్రము లిఖించి అప్పుడు సుముహూర్త కాలికమగు చంద్రుడున్న నక్షత్ర మెచ్చట నున్నదో కనుగొని లెక్కించి ఆ అవయవముల ననుసరించి ఫలము చెప్పబడుచున్నది. దాని పరమార్థము ఈ క్రింద వివరింపబడుచున్నది.

రవియున్న నక్షత్రము మొదటిదిగా వ్రాయదగియున్నది. చంద్రుడున్న నక్షత్రమును తెలుసుకొని ఫలమును గుర్తింపుము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1) 1, 2, 3 నక్షత్రము | = | మృత్యువు | 5) 15, 16, 17, 18 నక్షత్రములు | = | ధనము |
| 2) 4, 5, 6, 7 నక్షత్రములు | = | దురవస్థ | 6) 19, 20, 21, 22 నక్షత్రములు | = | ధాన్యము |
| 3) 8, 9, 10, 11 నక్షత్రములు | = | చిరకాల స్థైర్యము | 7) 23, 24, 25 నక్షత్రములు | = | సంపద |
| 4) 12, 13, 14 నక్షత్రములు | = | దేశభ్రమణము | 8) 26, 27, 28 నక్షత్రములు | = | పశువృద్ధి |

## గృహములు కట్టరాని ప్రదేశములు

శక్తికి పార్శ్వమునను, రుద్రునకు దృష్టి ప్రదేశమునను, విష్ణువునకు పృష్ఠ భాగమునను ఇండ్లు కట్టరాదు. రాజవీధి మధ్య అడ్డముగా నున్నను కట్టవచ్చును అని కొందరి మతము. గోవులు మంద మేయు స్థలము, శ్మశానభూమి, మరుభూమి, మలత్యాగము చేయుస్థలము, చెరువులు, బావులు పూడ్చిన స్థలము లందును ఇండ్లు కట్టరాదు. క్రమముగా వంశమునకు లోపములు తటస్థించును. దాయాదుల గృహముల గర్భ, వెనుపోటీలు కూడదని బహు శాస్త్రములందు గలదు.

## గృహములో తేనెపట్టు పెట్టినందులకు ఫలమ్

ఇంటిలో తేనెపట్టు మధ్యభాగమున పెట్టిన యజమానునకు మరణము. తూర్పున ధనలాభము. ఆగ్నేయమున అగ్నిభయము, దక్షిణమున మరణము, నైరుతి భాగమున ధాన్యలాభము. పశ్చిమమున మనోవ్యథ, వాయవ్యమున ధననష్టము, ఉత్తరమున పుత్రలాభము, ఈశాన్యమున బంధు మిత్రదర్శనము. అశుభ స్థానములయందు పెట్టిన యెడల శాంతిని చేయవలయును.

## గృహములో పుట్ట పెట్టినందులకు ఫలమ్

ఇంటి మధ్యలో పుట్ట పెట్టిన కళత్రమునకు హాని, తూర్పున యజమానున కుకీడు, ఆగ్నేయమున అగ్నిభయము, దక్షిణమున మరణము, నైరుతి భాగమున ధనహాని, పడమర రాజపూజ్యత, వాయవ్యమున మిత్ర దర్శనము. ఉత్తరమున పశునాశనము, ఈశాన్యమున ధనలాభము. అశుభ స్థానములయందు పెట్టిన యథావిధిగా శాంతి చేయవలయును.

## గృహములో మొండి చేయి మొలచినందులకు ఫలమ్

తూర్పున యజమానునకు హాని, ఆగ్నేయమున అగ్నిభయము, దక్షిణమున మరణము, నైరుతి భాగమున శత్రువులకు కీడు, పడమర మరణము, వాయవ్యమున పశువులకు హాని, ఉత్తరమున, ఈశాన్యమున కళత్రహాని. ఈ మొండిచేయి రామహస్తమనియు, రావణ హస్తమనియు రెండు విధములుగా నుండును. రామహస్తం సుగంధంతో కూడియుండును అందులకు శాన్తి అవసరము లేదు. రావణ హస్తము దుర్గంధముతోను ఎఱ్ఱని కౌసునీళ్ళతోను కుళ్ళు కలిగియుండును. ఇది యజమానునకు అశుభదాయకము గాన గృహమును ఆరు మాసములు వదలి తరువాత యథాశాస్త్రముగా శాన్తిచేసి ప్రవేశించవలయును. దిక్కులయందు విదిక్కులయందు దోషము కాన యథావిధిగా శాన్తి చేయవలయును. ఆ యా శాంతిని చేసినచో గృహమును వదలి పెట్టనవసరము లేదు.

## గృహములో గుడ్లగూబ ప్రవేశించినందులకు ఫలమ్

కాపురము చేయుచున్న ఇంటిలో గుడ్లగూబ ముఖద్వారముగా వచ్చి ప్రవేశించిన పురుషునకు హాని. ఆరు మాసములు ఆ గృహమును వదలి శాన్తిని చేసి ప్రవేశించవలెను. పశ్చాద్వారముగా ప్రవేశించిన స్త్రీకి హాని మూడు మాసములు ఆ గృహమును వదలి శాన్తిని చేసి ప్రవేశించవలెను.

## గృహమునకు పెరటిలో అరటిచెట్టు గెలవేసినందులకు ఫలమ్

తూర్పున శుభము, ఆగ్నేయమున శతృవృద్ధి, దక్షిణమున బంధుమిత్ర నాశనము, నైఋతి పుత్ర సంతాన లాభము, పడమర విపత్తు, వాయవ్యమున అనారోగ్యము, ఉత్తరమున ధనలాభము, ఈశాన్యమున కీర్తి లాభము ఇటులనే నారికేళక్రముక ఖర్జూరాది వృక్షములకు కూడా తెలియవలెను.

## గృహమునందు పిడుగు పడినందులకు ఫలమ్

గృహమునందు పిడుగు పడుటవలన యజమానునకు హాని, ఆవరణమందు పడుట వలన అనుచరులకు హాని గాన యథావిధిగా శాన్తిని చేయవలయును. దేవాలయములందు పిడుగు పడిన గ్రామమునకు క్షేమము లేదు. ధర్మకర్తకు, పూజకులకు గూడా నష్టము సంభవించును గాన యథోక్తముగా శాన్తిని చేయవలెను.

## గర్భిణీ స్త్రీ పురుషాది వివేక ప్రశ్న

**శ్లో॥ లగ్నాద్భాగ్యకళత్ర పుత్ర సహ జేష్వర్కార జీవాః స్థితాః చేత్పుత్రం దనమాతృరంధ్ర రిపుగౌచేచ్చంద్రశుక్రౌ వధూమ్ ।**
**తేష్వర్కీందుసుతౌ నపుంసకమితి ద్విర్భావలగ్నే యది పృచ్ఛేత్తజ్జననీగృహే ఖగయుగం చేద్యుగ్మగర్భం వదేత్ ॥**

**తా॥** ప్రశ్నకాలీన లగ్నమునకు 9,7,5,3 స్థానముల యందు రవ్యంగారక గురువులున్న యెడల పురుష శిశువు గలుగుననియు, ఆ ప్రశ్న లగ్నమునకు 2,4,6,8 స్థానములయందు శుక్రచంద్రులుండిరేని స్త్రీ శిశువు గలుగుననియు ఈ స్థానములయందే శని,

బుధులున్న యెడల నపుంసకుడనియు, ప్రశ్నలగ్నము ద్విస్వభావ లగ్నమై ఆ లగ్నమునకు నాల్గవ స్థానమునందు రెండు గ్రహము లున్నయెడల కవలబిడ్డలు పుట్టుదురనియు తాత్పర్యము.

## గోచార ఫలము

జన్మకాల చంద్రలగ్నము (లేక నామరాశి) మొదలు ద్వాదశరాశుల యందు చారవశంబున రవ్యాది గ్రహములు యిచ్చెడి ఫలములు.

| రాశులు | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురుడు | శుక్రుడు | శని | రాహు-కేతు |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | స్థానభ్రంశం | సుఖభోజనం | ఖేదః | బంధనం | దేశభ్రంశః | ఆరోగ్యం | విపత్ | భయం |
| 2. | భయం | ధనక్షయః | భాగ్యహానిః | స్వర్ణలాభః | లాభః | భోగః | హానిః | కలహః |
| 3. | సంపత్ | ధనలాభః | భాగ్యం | పీడా | కార్యహానిః | లాభః | సంపత్ | సౌభాగ్యం |
| 4. | మానభంగం | రోగః | శత్రుపీడా | శత్రుక్షయః | వ్యయః | అధికసుఖం | కుక్షిరోగః | మానహానిః |
| 5. | పీడా | కార్యహానిః | శత్రుక్షయః | దారిద్ర్యం | సంపత్ | సుతోదయః | పుత్రక్షయః | వ్యయం |
| 6. | శత్రునాశః | ధనం | అర్థసిద్ధిః | భూమిలాభః | క్లేశం | మానహానిః | లక్ష్మీకరం | సుఖం |
| 7. | వ్యథా | ధనలాభః | అర్థనాశః | ఖేదః | ఆరోగ్యం | రోగః | దైన్యం | రిపుక్షయః |
| 8. | వ్యాధిః | మృత్యుప్రదం | శస్త్రభయం | సంతోషః | వ్యయః | శస్త్రలాభః | మృత్యుప్రదం | శోషణం |
| 9. | క్రోధః | రాజక్రోధం | వ్యయః | వ్యయః | లాభః | ఆభరణం | దేహ పీడా | శత్రువృద్ధిః |
| 10. | కార్యసిద్ధిః | సుఖం | మనోదుఃఖం | సుఖం | పీడా | చింతా | పీడా | వ్యయః |
| 11. | ధనలాభం | లాభః | ధనం | ఆనందః | సుఖం | లాభః | లాభః | శుభం |
| 12. | వ్యయః | స్త్రీహానిః | క్రూరం | హానిః | వ్యయః | హానిః | నష్టం | మృత్యుప్రదం |

రవ్యాది నవగ్రహములు ప్రతి రాశియందుండు, కాల ప్రమాణము : చంద్రుడు - 2½ దినములు, సూర్య, బుధ, శుక్రులు ప్రతియొకరు ఒకనెల, అంగారకుడు 1½ నెల, గురువు 1 సంవత్సరం, రాహుకేతువులు 1½ సంవత్సరం (అపసవ్యముగ), శని 2½ సంవత్సరం ఒక్కొక్క రాశియందు రమారమి సంచరించెదరు.

## నవగ్రహశాంతి

**సూర్యగ్రహమును:** యధావిధిగా పూజించి, సూర్య నమస్కారములు చేసినను, ఎర్రపువ్వులచే పూజించినను, ఎర్రగుడ్డ, మాణిక్యము ధరించినను, ఎర్ర ఆవు లేక గోధుమలు దానము చేసినను దోషనివృత్తి.

**చంద్రగ్రహమును:** యధావిధిగా పూజించి, శ్వేత పుష్పములచే పూజించినను, శ్వేతవస్త్రము, ముత్యములు వీటిని ధరించినను, శంఖము లేక బియ్యము వీటిని దానము చేసినను దోషనివృత్తి.

**కుజగ్రహమును:** యధావిధిగా పూజించి రక్తవస్త్రము, పగడములు ధరించినను, ఎర్రయెద్దు లేక కందులు వీటిని దానము చేసినను దోష నివృత్తి.

**బుధగ్రహమును:** యధావిధిగా పూజించి, పీతాంబరము, మరకతము వీటిని ధరించినను, సువర్ణము లేక పెసలు వీటిని దానము చేసినను దోషనివృత్తి.

**గురుగ్రహమును:** యధావిధిగా పూజించి, పుష్యరాగము, పసుపు వస్త్రము ధరించినను, శెనగలు దానము చేసినను దోషనివృత్తి.

**శుక్రగ్రహమును:** యదావిధిగా పూజించి, శ్వేతవస్త్రము, వజ్రము ధరించినను, వెండి, తెల్లటి గుఱ్ఱము, అనుములు వీటిని దానము చేసినను దోషనివృత్తి.

**శనిగ్రహమును:** యధావిధిగా పూజించి, నల్లని వస్త్రము, ఇంద్రనీలము ధరించినను, నల్ల ఆవు లేక నువ్వులు వీటిని దానము చేసినను దోషనివృత్తి.

**రాహుగ్రహమును:** యధావిధిగా పూజించి, గోమేధికమును ధరించినను, కత్తి, ఇనుము, ఉద్దులు (మినుములు) వీటిని దానము చేసినను దోషనివృత్తి.

**కేతుగ్రహమును:** యధావిధిగా పూజించి, వైఢూర్యము ధరించినమ, దానము చేసినను, ఉలవలు దానము చేసినను దోషనివృత్తి.

## నవగ్రహ మఖపట్టికా

| గ్రహములు | వర్ణములు | అధిదేవతలు | స్థానములు | పీఠములు | అగ్ని కుణ్డములు | పుష్పములు | ఓదనములు | సమిధలు | గ్రహ మంత్రము | అధిదేవతా యములు | ధానములు | ప్రత్యామ్నా | ప్రత్యధి దేవతలు | ప్రత్యధిదేవతా మంత్రములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| ఆదిత్యః | రక్తః | అనలః | మధ్య | చతురశ్రం | సభ్యము | కరవీరం | శుద్ధోదన | అర్క | ఆసత్యేన | అగ్నిందూతం | రక్తధేనుః | గోధుమలు | పశుపతి | ఏషామీశే |
| చంద్రః | సితః | అప్పతిః | ఆగ్నేయ | వృత్తం | ఆహవనీయ | శంఖపుష్పం | పాయస | ఫలాశ | సోమోధేనుగ్ం | ఏతేశతం | శంఖం | బియ్యము | గౌరి | గౌరీమిమాయ |
| అంగారకః | అతిరిక్తః | గుహః | దక్షిణ | తుట్యా | అన్వాహార్య | ఉత్పలం | గుడౌదన | ఖదిర | అగ్నిర్మూర్ధా | సుబ్రహ్మణ్యో | తామ్రం | కందులు | క్షేత్రపతి | క్షేత్రస్యపతినా |
| బుధః | శ్యామః | హరిః | ఈశాన్య | త్రికోణం | అవసథ్య | నంద్యావర్తం | దధ్యోదన | అపామార్గ | ఉద్బుధ్యస్వ | ఇదంవిష్ణుః | హిరణ్యం | పెసలు | విష్ణుః | విష్ణోరరాటమసి |
| బృహస్పతిః | పీతః | ఇంద్రః | ఉత్తర | అష్టాశ్రం | అవసథ్య | చంపకం | గౌడిక | అశ్వత్థ | బృహస్పతే | ఇంద్రం | శుక్లంవాసః | శనగలు | బ్రహ్మ జిజ్ఞానం | బ్రహ్మ |
| శుక్రః | సితః | శచీ | పూర్వ | అర్ధచన్ద్రా | ఆహవనీయ | మల్లికా | చిత్రౌదన | ఉదుమ్బర | శుక్రంతే | గంధద్వారం | హయః | అలచందలు | శుక్రః వోవిశ్వతః | ఇంద్ర |
| శనైశ్చరః | అసితః | ప్రజాపతిః | పశ్చిమ | వజ్రాకారం | గార్హపత్య | గిరికర్ణికా | కృసర | శమీ | శమగ్నిరిత్యస్య | బ్రహ్మ | నీలగౌః | తిలలు | యమః యమప్రస్తరం | ఇమం |
| రాహుః | కృష్ణః | శేషః | నైరుతి | దండాకారం | అన్వాహార్య | కల్హారం | మాషౌదన | దూర్వా | కయా నశ్చిత్ర | శన్నోని | భాగః | మినుములు | నిర్ఋతికాలీ | యత్తేదేవీ |
| కేతుః | ధూమ్రః | యమః | వాయవ్య | ధ్వజాకారం | గార్హపత్య | తాపించం | కణౌదన | కుశ | కేతుం కృణ్వన్ | యమో దాధార | ఆయస దణ్డః | ఉలవలు | చిత్రగుప్తః | సచిత్రచిత్రం |

**విశేషములు: 1.** గ్రహములకు జపము చేయవలెను. 2. జపదశాంశము తర్పణము చేయవలెను. 3. తర్పణదశాంశము హోమము చేయవలెను. 4. (త్రిమధునా-క్తాభిస్సమిద్భిర్హోమః) పాలు, పంచదార, తేనె త్రిమధువులు. 5. కొన్ని శాఖలవారు ప్రత్యధి దేవతలను కూడా పూజించుచున్నారు. 6. కొందరు కుజస్య-గుహః, రోహోః – కళింగః, ప్రత్యధిదేవతలుగా పూజించుచున్నారు. 7. అధిదేవతా ప్రత్యధిదేవతలను గ్రహములకు దక్షిణోత్తర పార్శ్వములయందు తదాకృతి పీఠములమీదగాని చతురశ్ర పీఠములమీదగాని పూజించవలెను. 8. అన్ని గ్రహములయొక్క దానములకు ప్రతినిధి సువర్ణముగాను యుండవచ్చును. 9. గ్రహములను అధిదేవతలను, ప్రత్యధిదేవతలను, సువర్ణ ప్రతిమలయందుగాని, కూర్చలయందుగాని ఆవాహనము చేయనగును. 10. ఈ గ్రహశాంతిని పురస్కరించుకుని మహర్షులు "అద్భుతశాన్తి"ని ఉపదేశించినారు.

శ్లో ॥ గ్రహాయత్తానరేంద్రాణా ముచ్ఛ్రయాః పతనానిచ
గ్రహో గావో నరేంద్రాశ్చ బ్రాహ్మణాశ్చ విశేషతః
పూజితాః పూజయన్త్యేవం నిర్దహన్త్యవమానితాః ఇతి.

ఇట్టి ప్రమాణములచే మహారాజుల యొక్క ఔన్నత్యములు, పతనములు నవగ్రహాధీనము లైయున్నవి. నవగ్రహములు మహారాజులు మొదలగువారు తమను పూజించిన వారిని అనుగ్రహించెదరు. అవమానించిన వారిని బాధించెదరు. గాన మానవుల యొక్క లోకయాత్ర నవగ్రహాయత్తమగుటచే సంకటములు సంభవించిన సమయమునందైనను నవగ్రహములను యధావిధిగా మనోవాక్కాయములచే పూజించుట ముఖ్య కర్తవ్యము.

### సుముహూర్తములు

దైవజ్ఞులు శుభకార్యములయందు శాస్త్రానుసారముగా తిథి, వార, నక్షత్ర, యోగ, కరణ, శుద్ధులను సమయశుద్ధిని లగ్నశుద్ధిని పంచక రాహిత్యమును తారాబల చంద్రబల సంపదలను లగ్నగుణములను సంపాదించి స్వల్పదోషములను మహా దోషములను తొలగించి శుభ లగ్నమును ఏర్పరచి ఆ లగ్నములో 2 లేక 3 నిమిషముల పరిమితి గల పుష్కర కాలమును సుముహూర్తముగా నిశ్చయించుచున్నారు. ఇదియే సుముహూర్తము.

### లగ్న గుణములు

లగ్నమునకు గురు శుక్రాదులలో నొకరు కేంద్రకోణ ఉచ్ఛస్థాన మిత్ర క్షేత్రములలో నున్న గుణము రవి శని కుజాదులు 3-6-11 స్థానములయందున్నను గుణము. ఇటులనే గుణములను తెలియదగినది.

## స్వల్ప దోషములు - పరిహారములు

దుశ్శకునములు, దుస్స్వప్నములు, ఇంద్రధనుస్సు, ధూమకేతువు, దుష్టవస్తుదర్శనము, దుర్వాక్యశ్రవణము గురుశుక్రుల సమసప్తకము యమకంటకం గుళికదోషం ఖచరయోగం శుభగ్రహావేధ శూన్య తిథులు మొదలగునవి. వీనికి పరిహారములు పై చెప్పిన లగ్నగుణములు, 'హన్త్యేనదోషార్బుదం' అనుటచే శుభులు అర్బుద స్వల్పదోషములను 'హన్త్యాశుదోషాయుతం' అనుటచే పాపులు అయుత స్వల్పదోషములను తొలగించుచున్నారు. అవి శాస్త్రములు చెప్పుచున్నవి.

### ఏకవింశతి మహాదోషములు

1. పంచాంగశుద్ధిరాహిత్య దోషం
2. సంక్రాన్తిదోషము
3. పాపిషడ్వర్గదోషము
4. కునవాంశదోషము
5. కుజాష్టమదోషము
6. భృగుషట్కదోషము
7.
8. అష్టమలగ్నదోషము
9. అష్టమ చంద్రదోషము
10. షడష్టరిప్ఫచంద్రదోషము
11. సగ్రహ చంద్రదోషము
12. దుర్ముహూర్తదోషము
13. ఖర్జూరిస్థసమాంఘ్రిభదోషము
14. గ్రహణభదోషము
15. ఉత్పాతభదోషము
16. క్రూరయుగ్భదోషము
17. అశుభవిద్ధభదోషము
18. విషయుగ్లగ్నదోషము
19. లగ్నాన్తదోషము
20. గండాన్తదోషము
21. వ్యతీపాతవైధృతి మహాదోషము.

ఈ దోషముల యొక్క స్వరూపమును శాస్త్రముల వల్ల తెలుసుకొనుట యుక్తముగాన వ్రాయబడలేదు.

### లగ్న పుష్కర కాలములు

ఏకవింశో మనుశ్చైవ జినాశ్చమునయః క్రమాత్ । మేషాది మీనపర్యన్తం పుష్కరాంశాః ప్రకీర్తితాః ॥

### గోధూళిలగ్నము

సూర్యోదయ లగ్నమునకు సప్తమలగ్నము గోధూళి లగ్నము. ఇది సర్వ శుభకార్యముల యందు శుభప్రదము. ఈ లగ్నము పశ్చిమ దేశీయులచేత కళింగ దేశీయులచేతను ముఖ్యముగా ఉపయోగించబడుచున్నది.

### అభిజిల్లగ్నము

సూర్యుడుదయించుచున్న లగ్నమునకు నాల్గవలగ్నము అభిజిల్లగ్నము. ఇది సర్వదోషములను నశింప చేయును. సర్వ **దేశముల యందును, సర్వవర్ణముల వారికి ఉపనయనాతిరిక్తములగు సర్వ శుభకర్మల యందును సర్వ కార్యముల యందును**

ప్రశస్తమైనది అని మహర్షులు చెప్పుచున్నారు. దైవజ్ఞులు నిశ్చయించెడి సుముహూర్తములకు లగ్నబల సంపదచే స్వల్పదోషములు నశించినను మహాదోషములు తొలగుటను గూర్చి చెప్పుట లేదు. ఈ అబిజిల్లగ్నమును గూర్చి శాస్త్రము "అశేష దోషాపహారం" అని దోష విభేదము లేకనే సర్వదోషములను నశింపచేయును అని చెప్పుచున్నది. గాన దైవజ్ఞ భారము వహించలేనివారు ఈ అభిజిల్లగ్నమును సర్వ కార్యములయందును ఆశ్రయించుట మంచిది. ఈ లగ్నము మన పూర్వులంగీకరించినదే గాన అభిజిల్లగ్నము శుభప్రదం.

## శుద్ధి విశేషములు

**ప్రవేశే ద్వాదశే శుద్ధిః యుద్ధేచైకాదశే తథా ప్రాశనే దశమేశుద్ధిః నవమేచౌలకర్మణి**
**ఉపనాయేఽ ష్టమే శుద్ధిః వివాహే సప్తమే తథా నవవస్త్రేచ షట్శుద్ధిః ప్రయాణేపంచమే తథా**
**విద్యారంభే చతుశ్శుద్ధిః ఔషధే చ తృతీయకే ద్వి్శుద్ధిర్నామకరణే లగ్నశుద్ధిస్తు సంగమే.**

**వివాహ లగ్న విశేషములు** : వివాహలగ్నమునకు పై చెప్పిన సప్తమ శుద్ధిలేని యెడల జామిత్ర దోషము కలుగును. అనగా ఆ స్థానమునందు రవి. చంద్ర, కుజ, బుధ, గురు, శుక్రులలో నొక్కరున్న క్రమంగా వైధవ్యమును, సాపత్న్యమును, (సవతిని) మరణమును, పుత్రహానిని, నాశమును, రోగమును, స్త్రీకి కలుగజేయుదురు. శని, రాహు, కేతువులున్న క్రమముగా దంపతులకు మరణము, బంధనం ఆపదలు కలుగచేయుదురు అని కొందరు సమయవేత్తలు చెప్పుచున్నారు. కొందరు శుభగ్రహములున్న దోషము లేదని చెప్పుచున్నారు.

**ఉపనయన లగ్న విశేషములు** : లగ్నమునకు 1-4-7-10 స్థానముల యందు క్రూరగ్రహములు 1 రవి, 2 కుజుడు, 3 శని, 4 రాహువు, 5 కేతువు ఉండకూడదు. రవి యున్న స్ఫుజిత దోషము వటువును తండ్రిని హరించును. కుజుడున్న కూజితదోషము తల్లిని హరించును. శనియున్న రధిరదోషము ఉపనీతుని కులమును హరించును. రాహువున్న ఉగ్రదోషము వటువును హరించును. కేతువున్న రంధ్రదోషము తండ్రిని హరించును. గాన ఇట్టి దోషములు లేక లగ్నగుణ సంపద కలిగి మహాదోష శూన్యమగు ముహూర్తమును నిశ్చయించుట దైవజ్ఞుని పూర్ణవిజ్ఞాన సాధ్యము చిరకాల సాధ్యముగా తెలియవలెను.

## శాస్త్ర ప్రబోధము

'ఉద్వాహాదిషు చైకవింశతి మహాదోషాన్ విసృజ్యేతరాన్ స్వల్పాన్ దోషగణాన్ గుణాంశ్చగణితాన్ నిశ్చిత్యశాస్త్రాత్స్ఫుటం లగ్నం యత్ర గణాధికం చ సకలైర్గ్రాహ్యం న దోషాధికం బ్రహ్మా వాపరిహర్తుమత్ర సకలాన్ దోషాన్ సమర్థో న హి'.

తా॥ వివాహాది శుభలగ్నముల యందు ఏకవింశతి మహాదోషతి రిక్తములగు స్వల్పదోషములను లగ్న గుణములను శాస్త్రముచే నిర్ణయించి దోషాధిక్యము లేక గుణాధిక్యము గల లగ్నమును గ్రహించవలెను. లగ్నమందు సర్వదోషములు నివృత్తి చేయుటకు సృష్టికర్తయే సమర్థుడు కానేరడు. అందుచే దోషశూన్యమగు లగ్నము మృగ్యమని భావము.

## ఉపసంహారము

**యావత్స్పందతిలోచనం శుభకరం తత్కోటిభాగో భవేత్ తల్లగ్నేశుభకాల ఏవ సతతం బ్రహ్మానజానాతితం ।**
**అన్యేకింపునరేవ కర్తురథ తత్కాలశ్శుభోవాఽ ఽ శుభః పూర్వాదృష్టవశాద్భవేత్సమయవిత్త్సాక్షిమాత్రం సదా ॥**

తా॥ కనురెప్పపాటు కాలములో కోట్యంశ కాలము లగ్నములో శుభకాలము. అది చిత్ర విచిత్ర నిర్మాణ చతురుండగు విధాతకు గూడా తెలియ సాధ్యముకాదు. అట్టి సూక్ష్మ కాలమును మానవుడెట్లు తెలియగలడు. జన్మాంతరీయాదృష్టము వలననే అతి సూక్ష్మమగు శుభకాలము సంప్రాప్తమగును. అది దైవాధీనము. దైవజ్ఞుడు లగ్నమునకు సాక్షిమాత్రుడే కాని లగ్న ప్రదాత కానేరడు. అందువలన అఖిల చరాచర సృష్టి కర్తయు ఆశ్రిత వాత్సల్యైకజలధియునై శేషపర్వతమున వేంచేసి యున్న శ్రీ శ్రీనివాస పరదైవము యొక్క అనుగ్రహము మీద నాధారపడియున్న ఆ సుముహూర్త కాలమును పొందుటకు మానవుడు ఆ మహాప్రభువు యొక్క అనుగ్రహమునకు ఎదురు చూచుటయే ముఖ్యకర్తవ్యమని సమయవేత్తలు వక్కాణించుచున్నారు.

**హై మోర్ధ్వపుండ్రమజహన్మకుటం సునాసం మన్దస్మితం మకరకుణ్డలచారుగణ్డమ్ ।**
**బిమ్బాధరం బహులదీర్ఘ కృపాకటాక్షం శ్రీ వేఙ్కటేశ మజమాత్మనిభావయేఽ హమ్ ॥**

**శ్రీలక్ష్మీ వేంకటేశార్పణమస్తు**

**కీ.శే. పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్య,**
**తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన విద్వాన్.**

